అపరాధ పరిశోధన అనుబంధం—156

# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## ఎత్తుకు పై యెత్తు

రచన: వసుంధర

## స్మగ్లింగ్ కింగ్

రచన: సుంకరి రాంప్రసాద్

## వజ్రాల గనులు

రచన: భీమవరపు పురుషోత్తం

## శాశ్వత సమాధి

రచన: కె.వి.వి. సత్యనారాయణరాజు

అన్వేషణ - ఆరవ భాగం

అపరాధ పరిశోధన సప్లిమెంట్ --156
డిసెంబరు, 1986
వెల: రు. 7-00
ఏడాది చందా: 84 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
ఏ. వీ. మోహన్రావ్
కొమ్మిడి అచ్చారావు
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# ఎత్తుకు పై యెత్తు

## వసుంధర

రాష్ట్రంలోని ప్రతిపక్షాలన్నీ ఒకటై—ప్రభుత్వ విధానా లన్నింటినీ క్షుణ్ణంగా పరిశీలించి సమీక్షించాలని మనోహర రెడ్డి పత్రికాముఖంగా విజ్ఞప్తి చేశాడు.

ఆయన తలపండిన జాతీయవాది. రాజకీయపక్షాలకు అతీతుడు. రాష్ట్రమంతటా ఆయనంటే ప్రత్యేక గౌరవ భావముంది. ఆయనను రాజకీయాల్లోకి దింపాలని ఎందరో ప్రయత్నించారు. అటు నెహ్రూ కుటుంబం—ఇటూ సినీ గ్లామరు.... ఈ రెంటినుంచీ రాష్ట్రాన్ని తప్పించి ప్రజలను ప్రజలకోసం పాలించగల మహా నిజాయితీపరుడు, మానవతావాది ఆయన ఒక్కడేనని యెన్నో ప్రతిపక్షాలు ఘోషించాయి.

ఈ వాదాన్ని మనోహరరెడ్డి ఖండించాడు. తన పేరును యే రాజకీయపక్షమూ వాడుకునేందుకు లేదన్నాడు. అధికారంలోకి వచ్చిన ప్రతి రాజకీయ పక్షమూ ఒకే విధంగా ప్రవర్తిస్తున్నదని ఆయన అన్నాడు. తప్పు చాలా

వరకూ ప్రజలదనీ ప్రజల ఆలోచనల్లో మార్పులు తీసుకుని రావాలనీ ఆయన ప్రబోధించాడు.

ఇలాంటి నీతులు వల్లించడానికేగానీ ఆచరణకు— యే రాజకీయవాదీ ఇష్టపడడు. అందుకు వారు మనోహర రెడ్డిమీద ఆశలు వదులుకున్నారు.

మనోహర రెడ్డి పత్రికలలో వ్యాసాలు రాశాడు. విద్యాసంస్థలలో ఉపన్యాసాలిచ్చాడు. రేడియోలోకూడా మాట్లాడాడు.

కొందరాయన అభిప్రాయాలను మెచ్చుకున్నారు. కొందరు విమర్శించారు. అయితే ప్రజలపైమాత్రం ఆయన అభిప్రాయాల ప్రభావం కనపడలేదు.

రెడ్డికి పదవీ వ్యామోహంలేదు. కీర్తి కాంక్షలేదు. కానీ ఆయనకు దేశమంటే ప్రేమ, గౌరవం, భక్తి ఉన్నాయి.

మనది ప్రజారాజ్యం.

ప్రజలెన్నుకున్న ప్రజా ప్రతినిధులు ప్రజాక్షేమమే ధ్యేయంగా ప్రజలనేలుకోవాలి. ఆ ప్రజలకు వారి పాలన నచ్చకపోతే ప్రజలు వేరొకరి నెన్నుకుంటారు. అందుకు వీలుగా నియమిత కాలంలో ఎన్నికలు....

ఈ పరిస్థితుల్లో దేశమెంతో సుభిక్షంగా వుండాలి.

కానీ లేదు.

ఎందుకల్ల?

"అధికార పక్షం అసమర్థత —" అంటాయి ప్రతిపక్షాలు.

"ప్రతిపక్షాల కుట్ర—" అంటుంది అధికారపక్షం.

నిజానికాయిద్దరిదీ సమాన బాధ్యత—అని మనోహర రెడ్డి గుర్తించాడు.

ప్రజా జీవితం స్తంభించిపోయినా ఫరవాలేదని—బంద్‌లు, సమ్మెలు లేవదీస్తాయి ప్రతిపక్షాలు.

వాటిని అణచివేయడంలో బ్రిటిష్ ప్రభుత్వాన్ని మరిపిస్తుంది అధికారపక్షం.

సామాన్యుడి గురించే అందరూ మాట్లాడతారు. సామాన్యుడి గోడు మాత్రం యెవరికీ అవసరంలేదు. అసలు వాడేమైపోతున్నాడో యెవ్వరూ ఆలోచించరు.

అధికారాన్ని చేజిక్కించుకోవడం ప్రతిపక్షాల లక్ష్యం.

అధికారాన్ని నిలబెట్టుకోవడం అధికారపక్షం ఆశయం.

అందుకు వారిద్దరూ యేమైనా చేస్తారు. ఎంతకైనా తెగిస్తారు.

మనోహరరెడ్డిలా ఈ విషయాన్ని గుర్తించిన వారెందరో వున్నారు.

తను గుర్తించిన విషయాలను ప్రజలు గుర్తించాలంటే తనకూ ఓ గుర్తింపు అవసరమని మనోహరరెడ్డి చాలా ఆలస్యంగా గుర్తించాడు.

గుర్తింపున్న మనిషి భగవద్గీత గొప్పదంటే—ఏదో కొత్త విశేషం విన్నట్లు అంతా చర్చిస్తారు.

గుర్తింపులేని మనిషి తను బాగుకోరే నిజాలు తెలియ జెప్పినా యెవరూ పట్టించుకోరు.

తన గురించికాక దేశం గురించీ తనకోసంకాక దేశం కోసం ఆలోచించే మనోహరరెడ్డి చివరకు పత్రికా ముఖంగా ప్రతిపక్షాలకు విజ్ఞప్తి చేశాడు.

బాధ్యతగల ప్రతిపక్షాలు అధికారపక్షాన్నెవిధంగా వంచవచ్చో ఆయన వారందరికీ చెప్పాలనుకున్నాడు.

ఈ విజ్ఞప్తి ప్రతిపక్షాలలో కొత్త ఊపిరి నింపింది.

నడి సముద్రంలో చుక్కాని లేని నావలా కొట్టుకు పోతున్న వారికి—ఆధునిక సౌకర్యాలున్న ఓడ కనిపించి నట్లయింది.

"మనోహర రెడ్డి మాట మాకు వేదవాక్కు. ఆయన మాటను అక్షరాలా పాటిస్తాం. ఆయన మావల్ల తప్పున్న దంటే ఒప్పుకుంటాం. ఆయన చెప్పిన విధంగా దిద్దు కుంటాం. ప్రజాక్షేమమే మా ధ్యేయం—" అంటూ ప్రతిపక్ష నాయకులందరూ పత్రికాముఖంగా చెప్పు కున్నారు.

ఇది రాష్ట్రంలో గొప్ప సంచలనాన్ని కలిగించింది.

ప్రతిపక్షాల సమావేశానికి మహా సభ అన్న పేరు పెట్టారు.

మహాసభ నెక్కడ నిర్వహించాలీ అన్న విషయం కూడా పెద్ద పెట్టున చర్చించబడింది.

రాజధానిలో పరిస్థితి అంత బాగోలేదు.

ఏమాత్రం అలజడి రేగినా అక్కడ మతకలహాలు రేగ వచ్చు. మారేదో జరుగవచ్చు.

అదీకాక రాజధానిలో అధికారపక్షానికి ప్రాబల ముంటుంది.

అందుకని వారు శ్రీనాథపురాన్ని తమ సమావేశాని కెన్నుకున్నారు.

శ్రీనాథపురం జనాభా ఆరు లక్షలు.

ఆ ఊళ్ళో ఇరవై ఆరు సినిమా థియేటర్లున్నాయి. ఊరి చుట్టూ చిన్న చిన్న పరిశ్రమలున్నాయి.

శ్రీనాథపురాన్నానుకుని ఉన్న గ్రామాల్లో బంగారం పండుతుంది. ఆ బంగారానికి వజ్రాలు పొదుగుతుంది

శ్రీనాధపురం.

మిగతా రాష్ట్రంలో కనపడే పేదరికం అక్కడ కనపడదు. అక్కడ ఎక్కువమంది విద్యార్థులు. విద్యార్థులు కానివారికి రాజకీయాల గురించి పట్టించుకునే టంత తీరుబడిలేదు.

శ్రీనాధపురంలో ప్రతిపక్షాల మహాసభ నిర్వహించబడుతుందని ప్రకటించబడగానే ఆ ఊళ్ళో పెద్ద సంచలనం కలిగింది.

అంతవరకూ శ్రీనాధపురం గురించి యెవరికీ యెక్కువగా తెలియదు. ఇప్పుడు శ్రీనాధపురం గురించి పత్రికల్లో యెన్నో వివరాలు....ఆ ఊరి పుట్టుకతో మొదలై, రాష్ట్ర చరిత్రలో ఆ ఊరికున్న స్థానంవరకూ యెన్నో విశేషాలు సమగ్రంగా తెలుపబడ్డాయి.

మహాసభ గురించిన ప్రయత్నాలు మూడు మాసాలకు ముందే ప్రారంభించబడ్డాయి.

ఆగస్టు 15 స్వాతంత్ర్య దినోత్సవం. ఆ రోజు పతాకవందనం అనంతరం మహాసభ ప్రారంభం కావాలని మనోహర రెడ్డి నిర్ణయించాడు.

మనోహర రెడ్డిని మరో మహాత్మాగాంధీ అన్నట్లు ప్రతిపక్షాలు చిత్రిస్తున్నాయి.

మహాసభ ప్రారంభం దగ్గర పడుతోంది.

## 2

ముఖ్యమంత్రి ముఖంలో దిగులు....

ఆయన కెదురుగా కూర్చుని వున్నాడు ప్రధాన సలహాదారు ప్రతిభేశ్వర్.

"రెడ్డి గారింతపని చేస్తారనుకోలేదు—" అన్నాడు ముఖ్యమంత్రి.

"ఆయన ముందుగా మనసే కలుసుకున్నారు. మీరు గుర్తుచేసుకోండి—" అన్నాడు ప్రతిభేశ్వర్.

ముఖ్యమంత్రికి గుర్తుంది. మనోహర రెడ్డి తనను కలుసుకుని పరిపాలనా విధానాలలో మార్పులు సూచించాడు. ముఖ్యమంత్రి అంగీకరించలేదు. తను ప్రజల మనిషిననీ, ప్రజలకోసం తానేమైనా చేయగలననీ, తనమీద ప్రజలకు విశ్వాసముందనీ, వేరొకరి పద్ధతిలో తను ప్రజాపాలన చేయలేననీ ముఖ్యమంత్రి మనోహర రెడ్డికి చెప్పాడు.

అప్పుడు మనోహర రెడ్డి ఆయన్ను—"మీరు తప్పుచేస్తే ప్రజలకది నచ్చదు. మీరు తప్పుచేశారనీ ప్రజలకది నచ్చలేదనీ మీరెలా తెలుసుకుంటారు?" అనడిగాడు. అందుకు తన పద్ధతులు తనకున్నాయనీ, ఒకరికి చెప్పేవి కావనీ ముఖ్యమంత్రి ఆయనతో అన్నాడు. అప్పుడు తను ప్రతిపక్షాలను కలుసుకుంటానని మనోహర రెడ్డి అంటే—"అది మీ యిష్టం—" అని కూడా ముఖ్యమంత్రి చెప్పాడు.

"నువ్వు చెప్పింది నిజమే! ఆయన అన్నీ మనకు ముందే చెప్పాడు. కానీ అదింతకు దారితీస్తుందనుకోలేదు. రెడ్డి గారికి ప్రచారాలు గిట్టవు. ఆయన పేరున ఇంత ప్రచారం జరిగిపోతే ప్రజల్లో తప్పక సంచలనం కలుగుతుంది—" అన్నాడు ముఖ్యమంత్రి.

"ప్రతిపక్షాలు రెడ్డి గారి పేరు నుపయోగించుకుంటున్నాయి...." అన్నాడు ప్రతిభేశ్వర్.

"అవును. ఆయన ఆశయాలు వాళ్ళు పాటించగలరని నేననుకోను. ఈ అవకాశాన్ని వాళ్ళుపయోగించుకుంటున్నారంతే!" అన్నాడు ముఖ్యమంత్రి.

"రెడ్డి గారికి ప్రతిపక్షాలమీద సదభిప్రాయం లేదు. ఆయన పేరును మనముపయోగించుకుంటే ప్రతిపక్షాలు

రూపురేఖలు లేకుండాపోయేవి—” అన్నాడు ప్రతి భేశ్వర్.
“నిజమే! కానీ మన స్థానం బలంగా వుంది. అందుకని ప్రతిపక్షాలను తుడిచిపెట్టే ఆలోచన చేయలేదు....” అన్నాడు ముఖ్యమంత్రి సాలోచనగా.
“రెడ్డిగారంటే ప్రజల్లో విలువ వుంది. ప్రతిపక్షాలాయనకో ప్రత్యేకమైన గుర్తింపు నిచ్చాయి. ఇప్పుడాయన పలికే ప్రతిఅక్షరం మనకు వ్యతిరేకం కావచ్చు” అన్నాడు ప్రతిభేశ్వర్.
“ప్రజలు నన్నే వ్యతిరేకిస్తారంటావా?” అన్నాడు ముఖ్యమంత్రి.
“ప్రజలు మనుషుల్నే తప్ప—వారు చేసే పనుల్ని చూడరు....మహాసభను మనమంత తేలికగా తీసుకుందుకు లేదు—” అన్నాడు ప్రతిభేశ్వర్.
“నేను ప్రజలకెంతో చేశాను. ఇంకా ఎంతో చేయాలనుకుంటున్నాను. దీనికేమీ విలువలేదా?”
“మీకు తెలియనిదేముంది? మీరేం చేశారన్నది ప్రజలకక్కర్లేదు. మీరేం చేశామని ప్రచారం చేసుకుంటున్నారో అదే ముఖ్యం. మీ ప్రచారం మీకు శ్రీరామరక్ష, ప్రతిపక్షాల ప్రచారం మీకు ప్రమాదం. ఆ ప్రమాదాన్ని మీరెదుర్కోవాలి. ఆరంభంలోనే త్రుంచేయాలి....”
“ఎలా?”
“ప్రతిపక్షంలో చీలికలు తేవాలి....”
“అది వీలుపడుతుందా?”
“అందుకెన్నో మార్గాలున్నాయి....”
ముఖ్యమంత్రి సాలోచనగా—“రెడ్డిగారి విషయం

యేమీ చేయలేమా?" అన్నాడు.

"రెడ్డిగారి కన్ను ముఖ్యమంత్రి పదవిమీద పడిందని కొందరిచేత అనిపించాలి—" అన్నాడు ప్రతిభేశ్వర్.

"ఆకాశంమీద ఉమ్మితే అది మనమీదే పడుతుంది. ప్రజల్లో మనకున్న గౌరవం నిలుపుకోవాలంటే మనం రెడ్డిగారి జోలికి వెళ్ళడం మంచిదికాదు...."

"మనంగానీ — మన పార్టీలో యే ఒక్కరుగానీ రెడ్డిగారి జోలికి వెళ్ళరు. ఆయన గురించి ఒక్క పొల్లు మాట అనరు. పైగా మనమందరం రెడ్డిగారిపట్ల గౌరవం వ్యక్తపరుస్తూ — ఆయనవంటి మహానుభావుడు వూనుకోవడంవల్ల ప్రతిపక్షాలు నిర్మాణాత్మకంగా ఆలోచించ గల్గుతాయన్న ఆశాభావాన్ని వ్యక్తపరుద్దాం...."

"మరి రెడ్డిగారి గురించిన పొల్లుమాట లెవరంటారు?"

"కొందరు ప్రతిపక్షాలవాళ్ళు...."

ముఖ్యమంత్రి అసంతృప్తిగా—"ఛా— రెడ్డిగారిమీద పొల్లుమాట పడడం నాకే యిష్టంలేదు—" అన్నాడు.

"ఇందులో మనం చేసినదేముంది? రాజకీయాల బురదలో ఆయన తనకు తానే ప్రవేశించారు. ఇనుములో కలియడంవల్ల అగ్నికికూడా సమ్మెటపోట్లు పడతాయి గదా" అన్నాడు ప్రతిభేశ్వర్.

"ఈ విషయమై నేనూ తీవ్రంగా ఆలోచిస్తాను" అన్నాడు ముఖ్యమంత్రి.

## 3

అంతర్జాతీయ స్మగ్లర్ ఆశావాధ్ గురించి యెన్నో కథలు ప్రచారంలో వున్నాయి.

అతడే దేశానికి చెందినవాడో తెలియదు. అసలు పేరు కూడా తెలియదు కానీ అతడికి పద్నాలుగు భారతీయ

భావలు క్షణంగా వచ్చు. భారతదేశంలో యే ప్రాంతంలో వున్నప్పటికీ అతడా ప్రాంతానికి చెందినవాడనే అంతా భ్రమపడతారు.

ప్రస్తుతం అతడు శ్రీనాధపురం చేరినట్లు వార్త వచ్చింది.

శ్రీనాధపురంలో పోలీసులు ఊరంతా వలపన్ని అతడి కోసం గాలిస్తున్నారు.

వేషాలు మార్చడంలో ఆశానాధ్ దిట్ట. ఈ క్షణంలో రొమాంటిక్ యంగ్ హీరోగా కనబడి మరుక్షణంలో అతడు మూడుకాళ్ళ ముసలిగా మారిపోగలడు.

ముఖ్యంగా ఆశానాధ్ ఆడపిల్లలను వలలో వేసుకోవడంలో సమర్థుడు.

పోలీసు లీ విషయమై నగర పౌరులను హెచ్చరించారు. ముఖ్యంగా ఆడపిల్లలను జాగ్రత్తగా వుండమని వారు మరీ మరీ హెచ్చరించారు.

పోలీసులంతటితో ఆగలేదు.

హోటళ్ళలో—బీచి, పార్కు, థియేటర్లు వగైరా ప్రాంతాలల్లో విడిగా కనబడిన ప్రతిజంటనూ వారు ప్రశ్నించి వివరాలు తెలుసుకోనిదే వదిలేవారు కాదు.

ఇది నగర పౌరులకె ఇబ్బందిగా కూడా పరిణమించింది

ఏ అమ్మాయైనా తన అన్నతో బయటకు రావాలన్నా భయపడసాగింది. అమ్మాయిల్లో ప్రియులు మోసగిస్తారన్న భయంకంటె పోలీసులు జులుం చేస్తారన్న భయమే యెక్కువగా వుంది.

ఇలా ఉండగా అప్పుడే యిద్దరమ్మాయిలు మాయమై పోయారన్న వార్త ఊరంతా కార్చిచ్చులా వ్యాపించింది.

శ్రీనాధపురంలో అప్పుడు డిటెక్టివ్ కిల్లర్ తన

మొబైల్ వ్యానుతో సహా ప్రవేశించాడు. అతడితో పాటు ఓ అందమైన అమ్మాయికూడా ఊళ్ళో ప్రవేశించింది.

స్మగ్లర్ ఆశానాథ్‌ను పట్టుకోవాలన్నది డిటెక్టివ్ కిల్లర్ జీవితాశయాల్లో ఒకటి. అతడు శ్రీనాథపురంలో వున్నాడని తెలియగానే కిల్లర్ ఓ పథకం తయారు చేసుకుని అక్కడకు వచ్చాడు. ఆ పథకంలోని భాగమే ఆ అందమైన యువతి.

ఆమె పేరు నళిని.

ఆమెకు అందముంది. బియ్యేదాకా చదువూ ఉంది.

ఆమె ఉద్యోగానికి ప్రయత్నించింది.

ఉద్యోగం సంపాదించాలంటే అందం కావాలి. ఆ ఉద్యోగాన్ని నిలబెట్టుకుందుకూ అందం కావాలి.

ఒంటరి ఆడదానికోసం యెన్నో మగతోడేళ్ళు ఆకలితో పొంచివుంటాయని ఆమె గ్రహించింది. ఆ తోడేళ్ళ బారినుండి తప్పించుకునే మార్గం తెలియక క్రమంగా ఆమె వాటిని దగ్గరకు రానిచ్చి మచ్చిక చేసుకోసాగింది.

ఆడది నీతిని వదిలిపెట్టాలిగానీ — మగతోడేళ్ళు పెంపుడు కుక్కగా మారడానికెంతో సేపు పట్టదని ఆమె అర్థంచేసుకుంది. ఎటొచ్చీ తను తెలివిగా వ్యవహరించాలి.

ఉద్యోగం నిలబెట్టుకునేందుకు ఉపయోగించాల్సిన అందాన్ని — ధనసంపాదన కుపయోగించసాగిందామె. అందువల్ల సమాజంలో పడిపోయే ఆమె విలువను డబ్బు నిలబెట్టింది.

తెలివైన యువతి నళిని.

ఆమెనోసారి కలుసుకున్నాడు కిల్లర్. ఆమె అందం కంటే తెలివి అతణ్ణి ఆకర్షించింది—"కలకాలం నీ

జీవితాన్నిలా వృధా చేసుకోకు. ఇప్పుడు నీవద్ద కొంత డబ్బు చేరింది. ఇక ఉద్యోగంలో ప్రవేశించు. అధికారి అన్యాయంగా ప్రవర్తిస్తే తిరగబడి వాడి జాతకం బైట పెట్టు. ఓ మంచి వర్రాణ్ని పెళ్ళిచేసుకో. నీ అందం, డబ్బు చూసి యెవడో ఒకడు ముందుకు వస్తాడు. నీ తెలివితో సరైనవాణ్ని అంచనావేయి. ఆ తర్వాత నీ తెలివితోనే వాణ్ని ఆకట్టుకో. నీకు శుభం జరుగుతుంది" అని అతడామెకు సలహా యిచ్చాడు.

"నాకిప్పుడుద్యోగం దొరకదు—" అందామె.

"నీ వయసు పాతికేళ్ళుండవచ్చు నేమో గానీ ఇప్పుడు చూడ్డానికి పద్దెనిమిదేళ్ళ పాపలాగున్నావు. ఏ ప్రయివేటు కంపెనీలోనైనా నీ కుద్యోగం దొరుకుతుంది...."

"ప్రయివేటు కంపెనీ వాళ్ళు నాకు భయపడరు...."

"పోనీ యే బట్టల షాపులోనైనా సేల్సుగర్లుగా పనిచేయి. అక్కడ నీ అందాన్నితరుల ఆకర్షణకే తప్ప తమకోసం ఉపయోగించుకోవాలనుకోరు నీ యాజమానులు...."

"మీరే నాకు రికమెండేషన్ చేయండి...."

"చేస్తాను. నువ్వు నాతో వచ్చి కొన్నాళ్ళుంటే?"

నళిని ఆశ్చర్యపడింది. అతడు ఆశానాథ్ గురించి చెప్పాడు.

ఆమె ఒప్పుకుంది.

ఇద్దరూ యిప్పుడు శ్రీనాధపురంలో వున్నారు.

అక్కడ వన్ టవున్ పోలీస్టేషన్లో ఇన్ స్పెక్టర్ కుమారస్వామితో కిల్లర్ కి పూర్వపరిచయముంది.

ముందతడక్కడకే వెళ్ళాడు. కూడా నళిని వెళ్ళ లేదు. ఆమె సరాసరి ఒక హోటలు గదిలో దిగింది.

"ఆశానాథ్ శ్రీనాథపురం వచ్చిన వార్త పోలీసుల ద్వారా ఎలా వచ్చింది?" అన్నది కిల్లర్ కుతూహలం.

దీనికి కుమారస్వామి సరైన జవాబివ్వలేకపోయాడు.

"బహుశా—స్థానిక పత్రికల్లో వార్తగా వచ్చినట్టుంది—" అన్నాడతడు.

"ఆ వార్త వారికెలా వచ్చిందట?"

"ఎవడో ఆకాశరామన్న ద్వారా—ఇలాంటి కబురు పబ్లిగ్గా అందజేయగల ధైర్యమెవరికీ ఉండదు...."

"ఇంతకీ ఆశానాథెక్కడున్నాడనడానికి సరైన ఋజువులున్నాయా?"

"ఉన్నాయి...."

"ఏమిటవి?"

"ఆశానాథ్ చిత్రమైన మనిషి. ముందుగా అతడో హోటలు రూం బుక్ చేసుకుంటాడు—టెలిఫోన్ ద్వారా. ఏ కుర్రాడిద్వారానో డబ్బు పంపిస్తాడు. రూం ఆశానాథ్ పేరిట బుక్కవుతుంది. కానీ అతడా రూంలో వుండడు. ఇంకెవరో ఉంటారు...."

"అతడు ఆశానాథ్ మనిషా?"

"కాదు. హోటల్ గది అవసరమున్న మనిషిని యే రైల్వేస్టేషన్ దగ్గరో పట్టుకుంటాడతడు. తన గది ఖాళీగా ఉందని కారణాంతరాలవల్ల తను గదికి వెళ్ళడం పడలేదని అంటాడు. ఊరికే రూం వచ్చింది కదా అని ఆ వ్యక్తి ఆశానాథ్ రూంకి వెడతాడు. ఆశానాథ్ రహస్యంగా అతణ్ణో కంట కనిపెడతాడు. అతడిమీద పోలీసుల నిఘా లేకపోతే తనకు రావలసిన వస్తువులతడికి చేరేలా చేసి—అప్పుడతణ్ణించి రాబట్టుకుంటాడు."

"ఇది మీకెలా తెలుస్తుంది?"

"ఆశానాథ్ రూం తన పేరుతోనే బుక్ చేసు కుంటాడు...."

"ఇప్పుడూ అలాగే జరిగిందా?"

"అవును. ఊళ్ళోని మంచి హోటల్సన్నింటికీ మేము ఫోన్స్ చేశాం. జయంతీ లాడ్జిలో ఆశానాథ్ పేరిట రూం బుక్కయింది. అందులో కృష్ణమూర్తి అనే అమా యకుడుంటున్నాడు. అతడికి వారం రోజులిక్కడ పని వుంది. అన్ని రోజులూ అతడి గది అద్దె ఆశానాథ్ కట్టాడు....మాకు మాత్రం ఆశానాథ్ ఆచూకీ లేదు."

కిల్లర్ సాలోచనగా తలపంకించి — "ఇంకేమైనా ఋజువులున్నాయా?" అన్నాడు.

"ఆశానాథ్‌కు ఆఫ్రికన్ బెల్లీడ్యాన్సంటే యెంతో ఇష్టం. అతడే ఊళ్ళోదిగినా—ఓ హోటల్లో ఆ డ్యాన్స్ యేర్పాటు చేయించుకుంటాడు. ఇప్పుడుకూడా నటరాజ్ హోటల్లో అతడి కోరికమీద జూలీ అనే ఓ అమ్మాయి బెల్లీ డ్యాన్స్ చేసింది. ముందుగా సమాచారం తెలిసి కొందరు పోలీసులుకూడా మఫ్టీలో ఆ డ్యాన్సు చూడ్డానికి వెళ్ళారు. అక్కడ ఆశానాథ్ ఆచూకీ బొత్తిగా తెలియ లేదు...."

"ఊఁ....ఇంకా యేమైనా ఋజువులున్నాయా?" అన్నాడు కిల్లర్ కుతూహలంగా.

"ఊళ్ళో ఓ స్కూటర్ దొంగతనం జరిగింది. కారు దొంగతనం జరిగింది. ఆ తర్వాత అవి యెక్కడో దొరి కాయి. అంటే ఆశానాథ్ వాటిని తన ప్రయోజనానికి వాడుకుని వదిలి పెట్టాడన్నమాట. తర్వాత ఊళ్ళో యిద్దరమ్మాయిలు అపహరించబడ్డారు. వారి ఆచూకీ యింతవరకూ తెలియలేదు. ఇవన్నీ ఆశానాథ్ ఉనికిని

తెలియజేస్తున్నాయి....”

“ఇంతకీ ఆశానాథ్ ఇక్కడికెందుకు వచ్చినట్లు?”

“అది మాత్రం యెవరూ చెప్పలేరు. అతడికి తప్పకుండా ఇక్కడో మనిషుండి వుండాలి. పోలీసులు నగరంలో అనుమానమున్న ప్రముఖులందరిపైనా కన్నువేసి వుంచారు. అనుమానించాల్సిన విశేషమేమీ జరుగలేదు.”

“అపహరించబడ్డ ఇద్దరమ్మాయిల వివరాలు కావాలి నాకు....”

ఇన్స్పెక్టర్ కుమారస్వామి అతడికా వివరాలు చెప్పాడు.

“చాలా థాంక్స్” అంటూ కిల్లర్ అక్కణ్నుంచి లేచాడు.

## 4

బీచివద్ద ఒంటరిగా కూర్చుంది నళిని.

అలలకూ ఆమెకూ యెంతో దూరంలేదు.

ఉన్నట్లుండి ఓ కెరటం ఉవ్వెత్తున లేచింది. ఓ క్షణమాగితే అదామెను ముంచేసేదే!

ఎవరో ఆమెను చరచరా వెనక్కు లాగారు.

నళిని కెరటంనుంచి తప్పించుకుంది. కానీ వెల్లకిలా పడిపోయింది. ఆమెకప్పుడో యువకుడి ముఖం కనిపించింది.

“నా పేరు శశికాంత్ — ఇందాకట్నుంచి నిన్ను చూస్తున్నాను. ఈ అందం సముద్రంపాలై పోతుందని భయపడ్డాను—” అన్నాడతడు.

నళిని లేచి కూర్చుని పైట సవరించుకొని-“థాంక్స్-” అంది.

“నేను నీతో మాట్లాడొచ్చా—” అన్నాడతడు.

"ఊఁ" అందామె.

అతడామె యెదురుగా కూర్చున్నాడు.

ఆమె అతణ్ని చూసింది.

"నేను సూటిగా అడుగుతాను. ఏమీ అనుకోకూడదు.

"ఊఁ" అందామె.

"ఎక్కడుంటున్నావు నువ్వు?"

ఆమె చెప్పింది.

"వెరీగుడ్—నేనూ నీతో వస్తాను...." అన్నాడతడు.

"ఎందుకు?" అందామె.

"ఆ ప్రశ్న నీ అందాన్నడుగు...."

"అంటే?"

"అందమంటే తెలియదా? అది నీ దుస్తుల మరుగున దాగి వుంది...."

నళిని కోపంగా "ఏయ్ మిస్టర్....ఎవరితో మాట్లాడుతున్నావో తెలుసా?" అంది.

"ఇందులో నాకు చాలా అనుభవముంది. నీ చూపులు చూసి పసిగట్టాను. నువ్వు సంసార స్త్రీవి కావు. నాబోంట్లకు వరప్రసాదానివి...."

నళిని ముఖం ఎర్రబడింది — "యూ ఆర్ టాకింగ్ రబ్బిష్—" అంది.

అతడు జేబులోంచి—రెండు వందనోట్లు తీసి—"ఇది అడ్వాన్స్—ఉంచుకో—" అన్నాడు.

నళిని డబ్బు తీసుకోలేదు—"గెటౌట్—" అంది.

"నువ్వు నన్ను నీ గదికి తీసుకువెళ్ళకపోతే నేను నిన్ను నా గదికి తీసుకొని వెడతాను—" అన్నాడతడు.

"అంతా నీ యిష్టమేనా?"

"నా యిష్టం చాలా భయంకరంగా వుంటుంది. నా మాట విని మర్యాదగా నన్ను నీ గదికి తీసుకొని వెళ్ళు.." అన్నాడతడు.

"సరే—...." అంది నళిని.

ఇద్దరూ అక్కణ్ణించి వెంటనే బయల్దేరి లాడ్జికి వెళ్ళారు.

తలుపు తాళం తనే తీసింది నళిని.

ఇద్దరూ లోపల ప్రవేశించారు. అతడు తలుపు గడియ వేశాడు.

"గడియెందుకు వేశావు?" అందామె.

"ఇంకెవరూ లోపలకు రాకుండా!" అన్నాడతడు.

"ఎందుకు రాకూడదు?"

"నేను నీ అందాన్ని — ఒక్కణ్ణే చూడాలి...."

"చూశావుగా...." అందామె.

"అందం నీ శరీరంలో ఉంది. ఆ శరీరాన్ని దుస్తులు కప్పాయి...."

"కూర్చో—" అందామె.

"కూర్చోను—పడుకుంటాను...." అన్నాడతడు.

"నీ యిష్టం...."

"నువ్వూ పడుకో...." అన్నాడతడు.

"నేనలాంటిదాన్ని కాదు...."

"నువ్వెలాంటిదానివో నీ చూపులే చెబుతున్నాయి."

"అవి చూసేవారి కళ్ళలో ఉంటుంది—"

"మరి ఒక్కత్తెవీ ఈ ఊరొచ్చి-డబుల్ రూమెందుకు తీసుకున్నావు? ఈ గదిలో డబల్ కాటెందుకుంది?"

"నీ ప్రశ్నకు నేను బదులిస్తాను...."

కొత్త మాట విని ఉలిక్కిపడ్డాడు శశికాంత్.

అతడు వెనక్కి తిరిగేసరికి అక్కడ కిల్లర్ ఉన్నాడు.

కిల్లర్ నవ్వుతున్నాడు.

"మావారు.... పేరు కిల్లర్ ...." అంది నళిని.

"అయామే కిల్లరాఫ్ క్రిమినల్స్...." అన్నాడు కిల్లర్.

శశికాంత్ అతణ్ని భయంగా చూస్తున్నాడు.

"నీ కథేమిటో చెప్పు...." అన్నాడు కిల్లర్.

"నేను కావాలని రాలేదు. ఆమే నన్ను పిలిచింది.."

"ఎందుకు?"

"తన అందం చూపిస్తానంది...."

"ఎందుకట?"

"డబ్బు కావాలిట...."

"ఓహో—మరి ఆమె తనే నన్ని గదిలో ఉంచి తాళం వేసి బయటకు వెళ్ళింది. లోపలకు నిన్ను తెచ్చిందంటే అర్థమేమిటి?"

"బరి తెగించిన ఆడది...."

మరుక్షణం శశికాంత్ చెంప ఛెళ్ళుమంది.

"ఆమె కాళ్ళుపట్టుకో—" అన్నాడు కిల్లర్.

అతడు ప్రతిఘటించి విఫలుడయ్యాడు. చివరికి గతిలేక అతడామె కాళ్ళు పట్టుకున్నాడు.

"నేనెవరో నీకు తెలియదు. ఇంతకింతా అనుభవిస్తావు...."

"ఎవరుట నువ్వు?"

"నాది హైదరాబాదు. మా నాన్నది ముత్యాల వ్యాపారం...."

"మీ నాన్నను అభినందించాలి—నీలాంటి ముత్యాన్ని

కన్నందుకు...."

నళిని కిసుక్కున నవ్వింది.

"నాన్నకు నీ గురించి తెలిస్తే — నువ్వీభూమిమ్మీద మిగలవు...."

"మీ నాన్నకు నా గురించి తెలిసేముందు—లోకానికి మీ గురించి తెలుస్తుంది. హా హా దూయూ లైకిట్...." అన్నాడు కిల్లర్.

శశికాంత్ మాట్లాడలేదు.

కిల్లర్ నవ్వుతూ—"ఆమెను అందం చూపిస్తే డబ్బిస్తానన్నావు. నేనూ నీకు డబ్బిస్తాను. నీ అందం చూపిస్తావా?" అన్నాడు.

శశికాంత్ మొండిగా—"డబ్బక్కర్లేదు. నా అందం మీరెవరైనా చూడొచ్చు—" అన్నాడు.

"థాంక్యూ-అయితే ఊరందరికీ నీ అందం చూపిద్దువు గాని. నిన్ను వీధుల్లో తిప్పుతాను...."

అప్పుడా యువకుడి ముఖంలో భయం కనబడింది—"వద్దు" అన్నాడు.

"నళినీ—పోలీసులకు ఫోన్ చేసి పిలు...." అన్నాడు కిల్లర్.

కాసేపట్లో ఇన్స్పెక్టర్ కుమారస్వామి ఆ గదిలోకి వచ్చాడు. కిల్లర్ అతనికి జరిగింది చెప్పాడు.

"అంతా అబద్ధం!" అన్నాడు శశికాంత్.

"నళినీ—నీ వ్యానిటీ బ్యాగులోని కాసెట్ తీసి ఇన్స్పెక్టర్ గారికివ్వు—" అన్నాడు కిల్లర్.

"మీరు టేపురికార్డరుతో నన్ను పట్టుకుందుకు వచ్చేరా?" అన్నాడు శశికాంత్ ఆశ్చర్యంగా, భయంగా.

"మేకను ఎరపెడితే — తినడానికి వచ్చేవి క్రూర మృగాలే కదా! నేను నిన్ను ప్రత్యేకించి పట్టుకోవాలను కోలేదు. ఒకరికోసం చూస్తూంటే నువ్వు దొరికావు-" అని కుమారస్వామివంక తిరిగి-"బహుశా ఇద్దరమ్మాయిల అపహరణలో ఇతడి పాత్రకూడా ఉంటుంది. తగిన విధంగా మర్యాదచేసి నిజం చెప్పించు" అన్నాడు కిల్లర్.

"నాకేం తెలియదు. ఈ విషయంలో పొరపాటై పోయింది...." అన్నాడు శశికాంత్ గోలపెడుతూ.

ఇన్‌స్పెక్టర్ అతణ్ని తీసుకొని వెళ్ళిపోయాడు.

"చాలా చిత్రంగా వుంది" అంది నళిని వాళ్ళు వెళ్ళిపోయాక.

"మనిషి చాలా పొగరుబోతులా వున్నాడు. అంతా పెంపకం లోపం. అసలిక్కడికెందుకు వచ్చాడో?!" అన్నాడు కిల్లర్ సాలోచనగా.

"అతడే ఆకాశనాథ్ అయుండవచ్చునేమో!" అంది నళిని.

"ఇంత సులభంగా దొరికిన వాడికి మానసపిచ్చి ఉంటుంది తప్పితే—ఇతడు ఆకాశనాథ్ అయుండే అవకాశం లేదు—" అన్నాడు కిల్లర్.

"ఒకవేళ అతడే ఆకాశనాథ్ అయితే..." అంది నళిని.

"అప్పుడు నువ్వూ నేనూ కూడా మిగలం...."

నళిని కళ్ళలో భయం....

కిల్లర్ కనులలో ఆలోచన....

## 5

తప్పిపోయిన ఇద్దరమ్మాయిల గురించీ వాకబు చేశాడు కిల్లర్.

తలిదండ్రులు వారి గురించి సరైన సమాచారమివ్వ

లేదు.

ఇద్దరమ్మాయిలూ అందగత్తెలు. వయసు పదిహేడుకీ ఇరవైకీ మధ్య. ఒకామె బియ్యే చదువుతోంది. ఇంకొకామె టైపిస్టుగా పని చేస్తోంది.

ఆ పిల్లల గురించి వాకబు చేయడం తలిదండ్రులకు నచ్చలేదు.

"పరువుగా బ్రతుకుతున్నాం. ఈ కథ రట్టు చేయకండి—" అని వారు వేడుకున్నారు.

కన్న కూతురు మాయమయిందన్న చింతకంటె—ఆ విషయం మాయనిమచ్చగా తమ కుటుంబాన్ని పీడిస్తుందన్న బాధ వారిలో యెక్కువగా కనిపిస్తోంది.

అందుకే వారి వివరాలు పత్రికల్లో రావడానికి కూడా వారంగీకరించలేదు. విషయం వీలైనంత రహస్యంగా వుంచమని వారు పోలీసుల్ని కోరారు.

"మీరు నాకు సహకరిస్తే నేను వాళ్ళను వెనక్కు తేగలను—" అన్నాడు కిల్లర్.

"పరువు పోయాక వాళ్ళు తిరిగొచ్చి ఏం లాభం?"

ఇదీ వారి తలిదండ్రుల భయం ప్లస్ అభిప్రాయం.

కిల్లర్ బియ్యే చదువుతున్న అమ్మాయి గురించి ఆ చుట్టుపక్కల వాకబు చేశాడు.

క్రమంగా కొన్ని విశేషాలు బయటపడ్డాయి.

ఆ అమ్మాయో వర్ణాన్ని ప్రేమించింది. పెళ్ళి చేసుకుంటానంటే యింట్లో ఒప్పుకోలేదు. ఇంట్లో ఆమెకు ఆంక్షలు పెరిగాయి. ప్రేమికులు కలుసుకోకుండా కట్టుదిట్టాలు కూడా చేశారామె తలిదండ్రులు.

ఇప్పుడా అమ్మాయి మాయమయిందంటే—

వాళ్ళిద్దరూ కలిసి ఎక్కడికైనా వెళ్ళిపోయుండాలి-

లేదా నిజంగానే ఆ అమ్మాయి అపహరించబడి వుండాలి.

చుట్టుపక్కలవారి అభిప్రాయం ప్రకారం-ఆశానాథ్ ఊళ్ళో అడుగు పెట్టాడన్న వార్తను ఆ అమ్మాయి తలి దండ్రులుపయోగించుకున్నారు. తమ పరువు పోకుండా ఈ విధంగా నిలబెట్టుకోవాలనుకుంటున్నారు. అమ్మాయి చేసిన వెధవ పనికి నలుగురూ ముఖాన ఉమ్మి వేయకుండా తమమీద జాలిపడాలని తాపత్రయపడుతున్నారు.

ఇంచుమించు తప్పిపోయిన అమ్మాయి కథకూడా యిదే!

దేశంలోని కొందరాడపిల్లల పరిస్థితి చూస్తే కిల్లర్‌కి జాలి వేసింది. అతడా ఆడపిల్లలిద్దరి ప్రియుల గురించీ ఆచూకీ తెలుసుకోవాలని ప్రయత్నించాడు — కానీ లభించలేదు.

ఆ పిల్లలు మాయం కావడానికీ ఆశానాథ్‌కీ అసలే సంబంధముండకపోవచ్చునని అతడికి తోచింది.

అయినప్పటికీ ఈ విషయంలో పోలీసులేం చేస్తున్నారో తెలుసుకుందుకు ప్రయత్నించాడతడు.

"అంతా పత్రికలవాళ్ళ హడావుడి. ఆ పిల్లలు మాయం కావడానికీ ఆశానాథ్‌కీ సంబంధమున్నట్లు వాళ్ళు చేస్తున్న ఊహాగానాలకి ఋజువులు లేవు. ఆ కేసులింకా ప్రారంభ దశలోనే ఉన్నాయి. ఎందుకంటే ఆ పిల్లలు ప్రముఖులకి సంబంధించిన వారు కాదు. పిల్లల తలిదండ్రులు వారిగురించి ఒత్తిడి తీసుకొని రావడంలేదు."

ఇదీ పోలీసుల సమాధానం.

## 6

శశికాంత్ గురించి హైదరాబాదునుంచి అతడి తండ్రి వచ్చాడు.

"వాడు దుడుకు మనిషి. దుర్మార్గుడు కాదు. ఇంత

వరకూ వాడెలాంటి నేరమూ చేయలేదు—" అన్నా డాయన పోలీస్ స్టేషన్లో.

"ఇప్పుడు చేశాడు...." అన్నాడు కుమారస్వామి.

"ఇప్పుడూ చేయలేదు. మావాడిననుమానించే ముందు- ఆ పిల్ల పుట్టుపూర్వోత్తరాలు లాగండి. అసలు సంగతి తెలుస్తుంది—" అన్నాడు శశికాంత్ తండ్రి.

"ముందు మీ వాడి పుట్టుపూర్వోత్తరాలు లాగు తాను...."

"నేను వాడి తండ్రిని—"

"పదే పదే ఆ విషయం చెప్పుకోవడంవల్ల మీ విలువ తగ్గుతుంది. మీ అబ్బాయి విలువ పెరగదు—"

"మనుషుల విలువ ముత్యాల విలువలా పెంచగలను— తగ్గించగలను. అంతా నా చేతుల్లో వుంది-" అన్నాడు శశికాంత్ తండ్రి.

"అయితే మీరు చేయగలిగింది చేయండి...."

"చేయాలనే వచ్చాను-" అన్నాడు నర్మగర్భంగా శశికాంత్ తండ్రి.

ఆ చూపులు కుమారస్వామికి అర్థమయ్యాయి. అతడికి కోపం వచ్చింది. ఆ చూపుల్లో ముత్యాల మేఘాలున్నాయి. తను రవంత చల్లబడితే ముత్యాలవాన కురుస్తుంది.

"మీరు చేయగలిగింది స్టేషన్ బయట చేయండి. లోపల చేసేదంతా మేము...."

అతడి మాటల్లో మేఘాలను తరిమే పెనుగాలి కరుకు దనముంది. శశికాంత్ తండ్రికి ఆ కరుకుదనం అర్థమయింది.

క్రమంగా మెత్తబడి—"మళ్ళీ యిలాంటి పొరపాటు జరుగదు. నేను హామీ ఇస్తున్నాను. మావాణ్ని వదిలి పెట్టండి—" అన్నాడు.

"అది నా చేతుల్లో లేదు...."

"మరెవరి చేతుల్లో ఉంది?"

"డిటెక్టివ్ కిల్లర్!"

"ఆయనెక్కడుంటాడు?"

కుమారస్వామి వివరాలు చెప్పాడు.

శశికాంత్ తండ్రి నళిని వుండే హోటలు గదికి వెళ్ళాడు.

అప్పుడు కిల్లర్ గదిలోనే వున్నాడు.

"నేను శశికాంత్ తండ్రిని—" అంటూ ఆయన తన్ను తాను పరిచయం చేసుకున్నాడు.

ఆయన కనులలో ముత్యాల మబ్బులు కదులుతున్నాయి.

కిల్లర్ ఆయన శశికాంత్ తండ్రి అయినందుకు జాలి పడ్డాడు.

"మావాడు మీకే మపకారం చేశాడు? మీరు కావాలని వాణ్ని ట్రాప్ చేసి పోలీసుల కప్పగించారు-" అన్నాడాయన యేడుపు గొంతుతో.

"నేను కావాలని ట్రాప్ చేయలేదు. మీవాడే కావాలని ట్రాప్‌లో పడ్డాడు—" అన్నాడు కిల్లర్

"అసలు ట్రాప్ ఎందుకూ?"

"ఆశానాథ్ కోసం...."

"ఆశానాథ్ ఎవరు?"

కిల్లర్ చటుక్కున—"ఆశానాథ్ యెవరో తెలియకుండానే మీరు ముత్యాల వ్యాపారంలో ఉన్నారంటే నేను నమ్మను—" అన్నాడు.

శశికాంత్ తండ్రి తడబడ్డాడు. కాసేపాగి—"ఆశానాథ్‌కీ మాకూ వైరమెందుకు?" అన్నాడు.

"దుష్టశిక్షణ..అంతే!" అన్నాడు కిల్లర్.

"ఆశానాథ్ కు బదులు మావాడిని పట్టుకున్నారేం?"

"మీవాడూ దుష్టుడే!"

"ఈ ప్రపంచంలో ఎందరో దుష్టులున్నారు. మీ క్కావలసిన దుష్టుణ్ని మీరు పట్టుకోవాలిగానీ.." అని ఆగాడాయన.

"మీవాడే ఆశానాథని నా అనుమానం" అన్నాడు కిల్లర్.

శశికాంత్ తండ్రి తెల్లబోయి—"అందుకు ఋజు వుందా?" అన్నాడు.

"కాదనడానికి ఋజువులేదు.."

శశికాంత్ తండ్రి వాదన మాని—తన కొడుకును వదిలి పెట్టమని బ్రతిమాలాడు.

కిల్లర్ లొంగలేదు.

"మావాడిని వదిలిపెడితే నేను మీకు ఆశానాథ్ ఆచూకీ చెప్పగలను—" అన్నాడు శశికాంత్ తండ్రి.

కిల్లర్ కళ్ళు మెరిశాయి—"చెప్పండి—"

"మీరు నన్ననుమానించకూడదు. నాపై నేరం మోప కూడదు. నా పేరు బయటకు రానివ్వకూడదు. నన్ను సాక్ష్యంగా ఉపయోగించుకోకూడదు.."

"షరతులు పెట్టాల్సింది నేను. మీరు కాదు.."

"నా కొడుకును రక్షించుకోవడం కోసం ఆశానాథ్ వివ రాలు చెప్పడంలో నా షరతులు నాకుంటాయి. లేకుంటే నా ప్రాణాలకే ప్రమాదం..." అన్నాడు.

కిల్లర్ ఒప్పుకున్నాడు.

"సరిగ్గా గంట తర్వాత మీకు నేను ఫోన్ చేసి వివ రాలు చెబుతాను. ఆ వివరాలు మీకు పనికివస్తే నా

కొడుకును వదిలిపెట్టండి—" అన్నాడాయన దీనంగా.

"సరే—" అన్నాడు కిల్లర్.

ఆయన వెళ్ళిపోయాడు.

సరిగ్గా గంట తర్వాత ఫోన్ వచ్చింది.

"నవరంగ్ లాడ్జి—రూం నంబరు దెబ్భైనాలుగులో ఆశావాథ్ వుంటున్నాడు—" అని చెప్పాడు శశికాంత్ తండ్రి.

## 7

ఇన్‌స్పెక్టర్ కుమారస్వామి, డిటెక్టివ్ కిల్లర్ నవరంగ్ లాడ్జికి వెళ్ళారు.

రిసెప్షనిస్టు వారికి నమస్కరించాడు.

"రూం నంబరు డెబ్బైనాలుగులో ఎవరుంటున్నారు?" అన్నాడు కుమారస్వామి.

రిసెప్షనిస్టు పుస్తకం తిరగేసి-"అతడి పేరు దీనానాథ్. ఇందులో చేరి నాలుగురోజులయింది. ఇంకా రెండురోజులుంటానని చెప్పాడు—" అన్నాడు.

"అతడిని కలుసుకోవాలి—" అన్నాడు కుమారస్వామి.

"బయటకు వెళ్ళి గంటయింది...."

"అయితే ఒకసారి అతడి గదిని సోదాచేయాలి...."

రిసెప్షనిస్టు తటపటాయించాడు. కుమారస్వామి అతణ్ణి పోలీసు పద్ధతిలో లాలించి బెదిరించాడు.

చివరకు రిసెప్షనిస్టు ఒప్పుకున్నాడు. తాళం తీసుకుని అతడూ వారికూడా వెళ్ళాడు.

గదిలో....

మంచంమీద ఒక బ్రీఫ్‌కేసుంది.

బ్రీఫ్‌కేసులో ఒక డైరీ — కత్తి — రివాల్వర్

వున్నాయి.

డైరీలో శ్రీనాథపురంలోని కొందరు ప్రముఖుల చిరునామాలున్నాయి.

అక్కడక్కడ అతడు దినచర్యకూడా రాసుకున్నాడు.

"ఈరోజు సదానంద్ నగలషాపులో — పదివేలు విలువ చేసే హారం కాజేశాను. దీంతో నామీద నాకు నమ్మకం పెరిగింది—" అని ఒకరోజుంది.

"రంగన్న పేటలో వేరుశెనక్కాయ లమ్ముకునే ముసలమ్మ దగ్గర రెండు కేజీల హీరాయిన్ మూట దాచాను. అందుకు పదిరూపాయిలిస్తే యెంతో సంబరపడింది. పార్టీ నుంచి డబ్బు రాగానే—ముసలమ్మనుంచి కలెక్టు చేసుకోమని చెప్పాలి-" అని ఇంకో రోజున వ్రాసి వుంది.

అన్నిటికంటే విచిత్రం డైరీమీద అశానాథ్, బి.ఏ.- అని స్పష్టంగా పేరు రాసి వుంది.

కుమారస్వామి, కిల్లర్—గదంతా వెతికారు.

వేరే సూట్‌కేసొకటుంది.

అందులో ఖరీదైన కెమేరా ఒకటుంది. ఒక చిన్న లెదర్ బ్యాగుంది.

లెదర్ బ్యాగులో శ్రీనాథపురంలోని దారులన్నీ వివరంగా తెలియబర్చే పటం వుంది. అందులో కొన్ని ప్రాంతాల ఎర్ర సిరాతో ఇంటూ మార్కులున్నాయి.

"దగ్గర్లో క్జిరాక్స్ సెంటరేదైనా వుందా?" అన్నాడు కిల్లర్.

"మా లాడ్జిలోనే ఒకటుంది—" అన్నాడు రిసెప్షనిస్టు.

అవసరమైన డాక్యుమెంట్సన్నింటికీ కాగితాలమీద

ఫోటో కాపీలు తీయించాడు కుమారస్వామి.

"ఈ విషయం—ఇంకెవరికీ చెప్పొద్దు రహస్యంగా వుంచు. దీనానాథ్‌కి తన గురించి పోలీసులు వచ్చి వెళ్లారని తెలియకూడదు—" అన్నాడు కిల్లర్.

రిసెప్షనిస్టు తల ఊపాడు.

వెళ్ళేముందు కుమారస్వామి ఆ గదిలో ఉన్న గాజు గ్లాసొకటి తీసుకున్నాడు జాగ్రత్తగా—

"వేలిముద్రలకోసం—" అన్నాడతడు కిల్లర్‌తో.

కిల్లర్ సాలోచనగా తలపంకించాడు.

రిసెప్షనిస్టుకు కృతజ్ఞతలు తెలుపుకొని ఇద్దరూ వెళ్ళిపోయారు. వాళ్ళు కనుమరుగయ్యేదాకా బయటకు వెళ్ళి చూసి—తర్వాత తన సీట్లో కూర్చున్నాడతడు.

అప్పుడతడి యెదురుగా ఓ వ్యక్తి ప్రత్యక్షమయ్యాడు.

అతణ్ని చూసి రిసెప్షనిస్టు ఉలిక్కిపడి "దీనానాథ్!" అన్నాడు.

"అంతా గమనిస్తున్నాను నేను—" అన్నాడతడు.

అతడి కళ్ళలో నిప్పులు కురుస్తున్నాయి.

## 8

సదానంద్ షాపులో పదివేల విలువచేసే హారం పోయింది—కానీ ఆ రోజే తిరిగి వచ్చింది. ఎవడో కుర్రాడది తెచ్చి యజమానికి అందించాడు.

హారంతోపాటు ఓ ఉత్తరముంది.

"జరిగింది మరిచిపో-ఇది నకిలీ హారంకాదు. కేవలం వార్మప్ కోసం నేనిది పట్టుకుపోయాను...." అని ఉన్న దందులో.

కుమారస్వామి, కిల్లర్ ఆ ఉత్తరం సదానంద్ చూపించగా చూసి థ్రిల్లయ్యారు. డైరీలోని దస్తూరితో

సరిపోతోందది,

వారా ఉత్తరాన్నడిగి తీసుకున్నారు.

రంగన్న పేటలో వేరుశెనక్కాయలమ్ముకునే ముసలమ్మ ఉంది. ఆమె తనకు పదిరూపాయలిచ్చి ఒకడొక మాట దాచుకొన్నాడని చెప్పింది. కొన్ని గంటలక్రితమే మరో వ్యక్తి వచ్చి ఆ మూటనడిగి తీసుకున్నట్లు ఆమె చెప్పింది.

"చాలా చిత్రంగా వుంది—" అన్నాడు కిల్లర్.

"ఏమిటి చిత్రం?" అన్నాడు కుమారస్వామి.

"ఆశానాథ్ ఆచూకీ ఇంత సులభంగా తెలియడం!"

"పెద్ద పెద్ద నేరస్థులు చాలా చిన్న తప్పులు చేసి దొరికిపోతారు. నా అనుభవంలో ఇదేమీ చిత్రంకాదు" అన్నాడు కుమారస్వామి.

"అలాగనుకుంటే అది నీ భ్రమ—ఇందులో యేదో ట్రాప్ వుంది...."

"ఏమిటి ట్రాప్!"

"హైదరాబాదులోని ఒక ముత్యాల వర్తకుడికి—కేవలం తన కొడుకును రక్షించుకునేందుకు—ఆశానాథ్ వివరాలు బయటపెట్టే అవకాశముందంటే నాకిది నమ్మతగ్గదిగా లేదు—" అన్నాడు కిల్లర్.

"స్వార్థం మనిషిచేత యెంతపనైనా చేయనిస్తుంది."

"ఆశానాథ్ నమ్మే స్వార్థపరులు—వారి ప్రాణాలు పోయినా అతడి వివరాలు బయటపెట్టని నమ్మకస్తులై వుంటారు. అందుకే ఎప్పటికీ అతడి ఆచూకీ తెలియడం లేదు. అలాంటిది శశికాంత్ కోసం అతడి తండ్రి ఆశానాథ్ వివరాలెలా బైటపెట్టాడు? ఆశానాథ్ తన వివరాలనంత సులభంగా ఎలా వదలిపెట్టాడు?" అన్నాడు కిల్లర్.

"నువ్వు చెబుతూంటే నాకూ అనుమానం వస్తోంది. అసలు శశికాంత్ విషయం మరీ అంత ప్రమాదకరమైన దేమీ కాదు. అతడు చేసిన నేరానికి పదే శిక్షకూడా పెద్దదికాదు. ఈవ్ టీజింగ్ నేరంగా — ఒకో సారి హెచ్చరిక చేసి పంపేయడం జరుగుతుంది—" అన్నాడు కుమారస్వామి.

"ఇందులో యేదో పెద్ద నాటకముంది. శశికాంత్ కారణంగానే మనకు క్లూలు దొరకాలి. అతణ్ని సులభంగా విడిచిపెట్టకూడదు...." అన్నాడు కిల్లర్.

"అతణ్ని వదలను. తండ్రినీ వదలను...." అన్నాడు కుమారస్వామి.

ఇద్దరూ స్టేషన్‌కు వెళ్లారు.

తను కూర్చుని అసహనంగా అటూ యిటూ తిరుగుతున్న కిల్లర్‌తో — "నువ్వూ కూర్చో!" అన్నాడు కుమారస్వామి.

"ఒకసారి అర్జంటుగా శశికాంత్‌తో మాట్లాడాలి" అన్నాడు కిల్లర్.

కుమారస్వామి కాన్‌స్టేబుల్ని పిలిచి—శశికాంత్‌ని తీసుకొని రమ్మన్నాడు.

కాన్‌స్టేబులు ఆశ్చర్యంగా—"ఆయన్ను వదిలిపెట్టేకాంగా...." అన్నాడు.

"వదిలిపెట్టేకారా? ఎవరు చెప్పారని!" అన్నాడు కుమారస్వామి. అతడి కళ్ళు కోపంతో ఎర్రబడ్డాయి.

"ఎమ్మెల్యే జనార్దనంగారు స్వయంగా ఫోన్ చేశారు. అప్పుడు మీరాయన పక్కనే వున్నారు. ఆయన మీ చేత కూడా చెప్పించారు...."

"నా చేతనా— నేనాయన్ను కలుసుకోనిదే!"

"కానీ...." అని గుటకలు మింగాడు కానిస్టేబులు.

"ఫోన్లమీద ఖైదీలను విడుదలచేయడం ఎప్పట్నించి మొదలయింది మన స్టేషన్‌లో...." అన్నాడు కుమారస్వామి కోపంగా.

"సార్ — అర్నెల్ల క్రితం...." అని ఆగాడు కాన్‌స్టేబులు.

"ఊఁ కళ్ళు.." అన్నాడు కుమారస్వామి కోపంగా.

"అర్నెల్ల క్రితం యేమయింది?" అన్నాడు కిల్లర్ కుతూహలంగా.

"ఎమ్మెల్యేగారు ఫోన్ చేసి చెబితే నేను నమ్మలేదు. స్వయంగా వచ్చి కాళ్ళు పట్టుకోవాలా — ఫోన్ చేస్తే చాలదా — నీ చుట్టూ తిరగడానికి నాకింక వేరే పనులుండవనుకున్నావా — అంటూ అగ్గిమీద గుగ్గిలమయ్యాడాయన...."

"అంటే ఫోన్ చేసి ఖైదీలను విడిచిపెట్టమనడం ఎమ్మెల్యేలకు మామూలన్నమాట...." అన్నాడు కిల్లర్.

"ఇది ప్రజారాజ్యం. వారు ప్రజాప్రతినిధులు. ఈ విషయం మనమెంత తక్కువ మాట్లాడితే అంత మంచిది" అన్నాడు కుమారస్వామి అయిష్టంగా.

"కానీ ఎమ్మెల్యేగారికి ఫోన్ చేసి ఆయనలా ఎందుకు చేశారో కనుక్కోవచ్చుగా —" అన్నాడు కిల్లర్.

"ఆయన ఒప్పుకోడు. తనకేం తెలియదంటాడు. వాళ్ళు చెప్పినట్లు చేయకపోతే మేము శంకరగిరిమాన్యాలు పట్టిపోతాం. వాళ్ళు చెప్పినట్లు చేస్తే పదిమందికీ సంజాయిషీ యిచ్చుకోవాల్సిన బాధ్యత మాదే!" అన్నాడు కుమారస్వామి.

"ఎవరైనా ఎమ్మెల్యే పేరుతో ఫోన్ చేస్తే?"

"వివరాలడగొద్దు. ఫోన్ చేసింది ఎమ్మెల్యేయే అన డానికి మా సాక్ష్యాలు మాకున్నాయి—" అన్నాడు కుమారస్వామి.

"అయితే అవి ఉపయోగించుకో...."

"అవి ఉపయోగించుకోలేనివి...."

"ఇంతకీ ఆశానాథ్ కేసులో నువ్వేం చేయదల్చు కున్నావు?"

"నువ్వే చెప్పు...."

"శశికాంత్‌ని మళ్ళీ అరెస్టుచేయి!"

"మనకతడు దొరుకుతాడా?"

"ఎందుకు దొరకడు? అతడి తండ్రి చిరునామా, ఫోన్ నంబరు మన దగ్గరున్నాయి. మనమతడికి టెలిగ్రాం కొట్టడంవల్లనే కదా యిక్కడకు వచ్చాడు....మళ్ళీ...." అని కిల్లర్ యేదో అనబోతూండగా బల్లమీద ఫోన్ మ్రోగింది.

కుమారస్వామి ఫోన్ తీశాడు. ఫోన్‌లోని కబురు వింటూనే అతడి ముఖం వివర్ణమైంది. అతడు ఫోన్ పెట్టేసి—"అంతా మోసం!" అన్నాడు.

"ఏమిటి?"

"హైదరాబాదునుంచి ముత్యాల వ్యాపారి శివకాంత్ ఫోన్ చేశాడు. తనకు శశికాంత్ పేరుగల కొడుకున్నాట్ట గానీ అతడు నాలుగు రోజుల్నించి అక్కడే వున్నాట్ట. అరెస్టయిన శశికాంత్‌తో తనకే సంబంధమూ లేదుట. మనమిచ్చిన టెలిగ్రాం పోస్టల్ డిపార్టుమెంటువారి గొప్పతనంవల్ల ఇప్పుడే అందిందట...."

కిల్లర్ సాలోచనగా—"అంటే టెలిగ్రాం చూసి

అతడు మనకు ఫోన్ చేశాడన్న మాట.... శశికాంత్ మనకు అబద్ధం చెబుతూండవచ్చు. లేదా మనం అరెస్టు చేసిన శశికాంత్ అబద్ధం చెప్పి వుండొచ్చు. ఏదియేమైనా శశికాంత్ తండ్రినంటూ మనని కలుసుకున్న వ్యక్తి అతడి తండ్రి కాడనడంలో సందేహం లేదు....." అన్నాడు.

"అంతా అయోమయంగా వుంది...." అన్నాడు కుమారస్వామి.

"ప్రస్తుతానికి మనం శశికాంత్ విషయం వదిలిపెట్టి ఆశానాథ్ విషయం ఆలోచించాలి.." అన్నాడు కిల్లర్.

"ఆశానాథ్ ఉనికికి ఆధారం శశికాంత్. శశికాంత్ గురించి మనకంతా తెలుసనుకున్నాం. ఏమీ తెలియదని తేలిపోయింది. ఇప్పుడేం చేయాలి?"

కిల్లర్ యేదో అనబోయాడు. మళ్ళీ ఫోన్ మ్రోగింది బల్లమీద.

కుమారస్వామి ఫోన్ తీశాడు. మళ్ళీ అతడి ముఖం వివర్ణమైంది. ఫోన్ పెట్టేసి — "నవరంగ్ లాడ్జి రిసెప్షనిస్టు ఫోన్ చేశాడు—" అన్నాడు.

"ఏమంటాడు?"

"దీనానాథ్ తిరిగి వచ్చేట్ట...."

"వెరీగుడ్—" అన్నాడు కిల్లర్.

"గుడ్ కాదు—వెరీబాడ్!" అన్నాడు కుమారస్వామి.

"ఎందుకని?"

"అతడు రిసెప్షనిస్టుని వాడలగొట్టేశాడు. కుటుంబాన్ని సర్వనాశనం చేస్తానన్నాడు. తక్షణం హోటలు ఖాళీ చేసి వెళ్ళిపోయాడు. పోతూ పోతూ ఒక ఉత్తరమిచ్చి మనకిమ్మన్నాడు...."

"అంటే అతడికి మనం వచ్చి వెళ్ళినట్లు తెలిసిందన్న మాట!"

"మనమిలా వెళ్ళగానే అలా వచ్చేట్ట....రిసెప్షనిస్టు బాగా బెదిరిపోయాడు. ఉత్తరం కలెక్టు చేసుకుందుకు మననే రమ్మన్నాడు.."

"ముందా ఉత్తరంలో యేముందో చూద్దాం పద." అన్నాడు కిల్లర్.

ఇద్దరూ లాడ్జికి వెళ్ళారు.

వాళ్ళను చూస్తూనే రిసెప్షనిస్టు వణికిపోతూ—
"మీరే నన్ను రక్షించాలి—" అన్నాడు.

"ఉత్తరం యేదీ?" అనడిగాడు కిల్లర్.

అతడో కవరందించాడు.

నీలిరంగు కవరు. లోపల తెల్ల కాగితం. కాగితంమీద ముత్యాలకోవలాంటి అక్షరాలు....

"డియర్ ఇన్స్పెక్టర్! పులిమీసాలతో ఆడుకుంటున్నావు. ఇది నీకే కాదు—నువ్వు రక్షించాల్సిన నీ నగరానికే ప్రమాదం. నీకు సరిగ్గా వారం రోజులు టైమిస్తున్నాను. నా గురించి నీకు లభించిన ఆధారాలు సర్వనాశనం చేయి. లేదా అనాథ్ విశ్వరూపం చూస్తావు నువ్వు. నేనీ ఊళ్ళోనే వున్నాననడానికి గుర్తుగా రోజు విడిచి రోజు ఒక ప్రాంతంలో బాంబు పేలుస్తాను. వారం రోజుల్లో ఆ కాగితాలను నువ్వు నాశనం చేయకపోతే—ఆ తర్వాతనుంచి రోజుకొక యింట్లో మానభంగం జరుగుతుంది. రోజుకొక బ్యాంకు దోపిడీ జరుగుతుంది. రోజుకో గొప్పవాడి గుట్టు బయటపడుతుంది. బాగా ఆలో

చించుకో.... ఇది నా హెచ్చరిక!"

ఆ ఉత్తరంలో సంతకం లేదు.

"ఇది డైరీలోని దస్తూరీలా లేదు—" అన్నాడు కిల్లర్.

"నన్ను సవాలు చేస్తున్నాడు. అనుభవిస్తాడు—" అన్నాడు కుమారస్వామి.

కిల్లర్ సాలోచనగా—"మనం బంధించిన శశికాంత్, అతడి తండ్రి—వీరిద్దరిలో ఒకరు తప్పక ఆశానాథ్ కావాలని నా అనుమానం—" అన్నాడు.

"కాకపోవచ్చు—" అన్నాడు కుమారస్వామి.

ఇద్దరూ రిసెప్షనిస్టుని పోలికల గురించి అడిగారు. అతడు పట్టాన చెప్పలేదు. తనకు పూర్తి పోలీసు రక్షణ లభిస్తుందని ఆశపెట్టి, లేకుంటే జైలుపాలు కావాలని బెదిరించి—కొన్ని పోలికలు రాబట్టారు వారు. అవి శశికాంత్ తండ్రికి సరిపోయాయి.

"ఇప్పుడేం చేస్తావు?" అన్నాడు కిల్లర్.

"శ్రీనాథపురంలోని ప్రజలందర్నీ పత్రికలద్వారా, రేడియోద్వారా హెచ్చరిస్తాను. ఆశానాథ్ వంటి స్మగ్లరుకిక్కడ స్థానంలేదు. ఇక్కడ అడుగు పెట్టినందుకు ఫలితమతడనుభవించాలి—" అన్నాడు కుమారస్వామి.

కిల్లర్ సాలోచనగా-"ఈ ఉత్తరం కూడా పత్రికల్లో వేయిస్తావా?" అన్నాడు.

"ఊఁ."

"నీ పనయ్యాక నాకీ ఉత్తరం యివ్వు—"

"ఎందుకు?"

"ఈ దస్తూరి నన్నాకర్షిస్తోంది...." అన్నాడు కిల్లర్.

ఆ రోజు ఆగస్టు ఎనిమిది.

శ్రీనాథపురంలో పెద్ద సంచలనం చెలరేగింది.

కుమారస్వామి ఆకాశనాథ్ వివరాలు, బెదిరింపు లేఖ స్థానిక దినపత్రికలోని మొదటి పేజీలో వచ్చేలా చేశాడు.

ఈ వార్త ప్రతివారి నోట్లోనూ నలుగుతోంది.

ఆ రోజు సాయంత్రం ఊరి పొలిమేరల్లో ఓ బాంబు పేలింది.

జననష్టం కలగలేదు కానీ ప్రజల్లో అది భయాన్నీ, ఉత్సుకతనూ పెంచింది.

రోజులు గడుస్తున్నాయి.

రోజు విడిచి రోజు శ్రీనాథపురంలో బాంబు పేలుతోంది. ఒక రోజున పార్కు ప్రాంతంలో, మరో రోజున బీచి పక్కన. ఇంకో రోజు బస్టాండుకు కాస్త దూరంగా.

ఆకాశనాథ్ అన్న ప్రకారం బాంబులు పేల్చాడు.

శ్రీనాథపురంలో ఆకాశనాథ్ వున్నాడన్న వార్త గుప్పుమని ఎందరో అక్కడకు చేరారు. వారిలో జర్నలిస్టులున్నారు. గూఢచారులున్నారు. రచయితలున్నారు. అడ్వెంచర్స్‌ను అభిమానించేవారున్నారు.

ఒక్కసారిగా శ్రీనాథపురం పేరు రాష్ట్రస్థాయి నుంచి, జాతీయ స్థాయికీ అక్కణ్నించి అంతర్జాతీయ స్థాయికీ తరలిపోయింది.

ఏ రోజున యే యింట్లో మానభంగం జరిగిపోతుందో యే రోజున యే గొప్పవాడి గుట్టు బయటపడుతుందో.... ఏ రోజున ఏ బ్యాంకు దోచబడుతుందోనని ప్రజలందరూ

హడలి పోతున్నారు.

అన్ని తరగతుల ప్రజలూ ఆశానాథ్ పేరే కలవరిస్తున్నారు.

ఎందుకంటే ఆశానాథ్ కుమారస్వామికిచ్చిన గడువు లేదీ అయిపోయింది.

ఆగస్టు పదిహేను వచ్చేసింది.

ఇన్‌స్పెక్టర్ కుమారస్వామి ఒక్కడే కాదు—యావత్తు పోలీస్ డిపార్టుమెంటూ ఊరంతా వలపన్ని ప్రజలను భయపడవద్దని ధైర్యం చెబుతోంది. అయినా బాంబుల పేలడంవల్ల ప్రజల్లో భయం తగ్గలేదు.

దేశంలోని దేశీయస్థాయి ఉన్న ప్రతి పత్రికా "శ్రీనాథపురం రిపోర్టు—" అని ఒక శీర్షికను మొదటి పేజీలోనే వేయసాగాయి. పేపరు కొనేవాళ్ళందరూ ఆ వార్తకోసమే చూసేవారు.

ఆగస్టు పదిహేను గడిచిపోయింది.

పదహారు.... పదిహేడు.... పద్దెనిమిది....

వారం రోజులపాటు శ్రీనాథపురంలో ఏ విశేషమూ జరుగలేదు.

ఆ తర్వాత ఒకరోజున కుమారస్వామికో ఉత్తరం వచ్చింది. అందులో ముత్యాలకోవవంటి దస్తూరీ ఉంది. మొదటిసారిగా తాను అనుకున్నది సాధించలేకపోయానని ఆశానాథ్ ఒప్పుకుంటూ—శ్రీనాథపురం పోలీసులను అభినందించాడు.

ఆ ఉత్తరం పేపర్లో పడ్డాక క్రమంగా ప్రజలలో శ్రీనాథపురం ఆకర్షణ తగ్గిపోయింది. పత్రికలు శ్రీనాథపురాన్ని మరిచిపోసాగాయి.

# 10

"ఎవరు నువ్వు....?" అన్నాడు శ్రీనాథపురం ఎమ్మెల్యే.

"నా పేరు కిల్లర్. నేనొక డిటెక్టివ్‌ను...."

"నాతో నీకేం పని?"

"స్మగ్లర్ ఆశానాధ్‌కీ మీకూ సంబంధమున్నట్లు నాకు అన్ని ఋజువులు లభించాయి—" అన్నాడు కిల్లర్.

ఎమ్మెల్యే అతడిమీద మండిపడ్డాడు.

"లాభంలేదు. నేను పోలీసు డిపార్టుమెంటు మనిషిని కాదు — మీరంటే భయపడడానికి...." అన్నాడు కిల్లర్.

"ఏమిటి నీ ఋజువులు?...." అన్నాడు ఎమ్మెల్యే చివరికి.

"ఆశానాధ్‌తో సంబంధమున్న వ్యక్తిని మీరు పోలీసుల నుంచి విడిపించారు—" అంటూ కిల్లర్ ఆ కథంతా చెప్పాడు.

ఎమ్మెల్యే తనకేమీ తెలియదని దబాయించాడు.

"జరిగింది యధాతథంగా పోలీసులకు తెలుసు. వారిది బైటపెట్టరు. కానీ సాక్ష్యాలు నా దగ్గర కూడా ఉన్నాయి. అవి పత్రికలో ప్రకటించి ఈ కథను వేస్తాను. అప్పుడు సంజాయిషీ మీరు ప్రజలకే యిచ్చుకోవాలి...."

ఎమ్మెల్యే కాస్త భయపడ్డాడు—"నీకు డబ్బు కావాలా?" అన్నాడు.

"కాదు....ఆశానాధ్ ఉనికి...."

ఎమ్మెల్యే అతణ్ని భ్రమలో పెట్టాలని విఫలుడై—

"అయితే అసలు సంగతి నీకు చెప్పక తప్పదు. నాకూ ఆజాద్‌కీ ఏ విధమైన సంబంధమూ లేదు. అయితే శశికాంత్ పేరుతో మీ చేత అరెస్టుకాబడ్డ వ్యక్తి నా మనిషి...." అన్నాడు.

"ఆ సంగతి నాకు తెలుసు..." అన్నాడు కిల్లర్ — "అసలు ఆజాద్ అన్నదే ఒక కల్పన. అతడే ఊరు వచ్చేడన్న భ్రమ కలిగించాలని మీ రనుకున్నారు. ఇందులో మీ వ్యూహముందని నాకు తెలుసు. కానీ మీరు సాధించదల్చుకున్న దేమిటో నాకు తెలియలేదు...."

"నీకు తెలిసిన ఆ విశేషాలను మాత్రం ఎలా ఊహించావు?" అన్నాడు ఎమ్మెల్యే.

కిల్లర్ నవ్వి—"ఆజాద్ వంటి స్మగ్లరు అజాగ్రత్తగా ఉండడు. అటువైన డైరీలో అతడు రాసుకున్న వివరాలు ముందుగా రాసి పెట్టుకున్నవి. అవి కేవలం పోలీసులను తప్పుదారి పట్టించడానికే ఉద్దేశించబడ్డాయి. ఒక హారం దొంగతనం. ఒక హీరాయిన్ మూటతో మమ్మల్నతడు నమ్మించాలనుకున్నాడు. కానీ అందులో ఉన్న యితర సమాచారాలన్నీ తప్పు.

అన్నింటికీ మించి ఆజాద్ కుమారస్వామికి వ్రాసిన లేఖ నన్ను బాగా అనుమానానికి గురిచేసింది. పోలీసులు వచ్చి తన గదిని శోధించి తన రహస్యాలు తెలుసుకుని వెళ్ళారని తెలిసేక ఏ మనిషీ ముత్యాలకోవ వంటి దస్తూరీలో లేఖను వ్రాయలేడు. అతడి దస్తూరీలో తడబాటు, కోపం, ఆవేశం వ్యక్తమవుతాయి. ఆ ఉత్తరాన్నతడు ముందుగానే వ్రాసుకొని ఉండాలి. ఆ వ్యక్తి నకిలీ ఆజాద్ అయినప్పటికీ—అతడి గదిలోని సాక్ష్యాల వల్ల అతడికేమీ ప్రమాదం లేకపోయినప్పటికీ—పోలీసు

వాళ్ళు వస్తారన్న కంగారువల్ల అప్పటికప్పు డతడా ఉత్త
రాన్ని అంత అందంగా రాయలేదు. కాబట్టి ఇదివరకో
ఆడుతున్న నాటకం. అది మీరే ననడానికి సాక్ష్యాలు
మీకే తెలుసు. ఇదంతా యెందుకు చేశారో చెప్పక
పోతే__నేనీ కథను బయటకు చెప్పక తప్పదు....”
అన్నాడు.

“నేనీ ఊరి ఎమ్మెల్యేని. ఏ పార్టీకీ చెందని స్వతం
త్రుణ్ని. అధికారపక్షం రెండు లక్షల రూపాయాల ఆశ
చూపించింది. ఇది చేశాను. ఇది ఋజువు చేయలేని
నేరం. నీ కుతూహలం తీర్చుకు నేందుకు నిజం చెబుతాను.
ఆ తర్వాత ఇది మర్చిపో. ఇందులో యే దుర్మార్గుడూ
విడిచిపెట్టబడలేదు. సామాన్యుడు నష్టపోలేదు....” అని
ఆగాడు ఎమ్మెల్యే.

“అవును. అసలిదంతా ఎందుకు?”

ఎమ్మెల్యే నవ్వి__“ఆగస్టు 15న ప్రతిపక్షాలు మనో
హర రెడ్డి ఆధ్వర్యంలో పెద్ద సమావేశం జరిపారు. దాని
గురించి యెన్నో చర్చలు వచ్చాయి. దేశ రాజకీయ
చరిత్రనే అది మార్చివేస్తుందని చాలామంది అను
కున్నారు....” అన్నాడు.

“అవును. ఆ సమావేశం జరిగిందిగా....” అన్నాడు
కిల్లర్.

“జరిగింది. కానీ ఆశానాథ్ ఊపులో దాన్ని పట్టించు
కున్నవారెవ్వరు? అటు ప్రజలు, ఇటు పత్రికలు....ఆశా
నాథ్ గురించే ఆలోచిస్తున్నారు. ప్రజల దృష్టిని
పూర్తిగా ఆ మహాసభ నుంచి మళ్ళించడానికే ఈ ఆశా
నాథ్ కల్పన! ఆ మహాసభ అనామకంగా ముగిసింది....
ప్రతిపక్షాల ఎత్తుకి ఇదొక రాజకీయపు పై ఎత్తు....ఇందులో

నీ వంటివారు వేలు పెట్టకూడదు—....." అన్నాడు ఎమ్మెల్యే!

కిల్లర్ అక్కణ్ణుంచి లేచాడు.

ఇది అతడూహించని విశేషం!

ఇప్పుడు తనేం చేయాలి?

నేరాన్ని దాచడం అతడి ప్రవృత్తి కాదు. కానీ ఈ నేరాన్ని ప్రజలముందుంచితే ఎవరు నమ్ముతారు? ఎవరు పట్టించుకుంటారు!

"ఒకసారి డిటెక్టివ్ వెంకన్నను కలుసుకుని సలహా అడగాలి!" అనుకున్నాడతడు. అతడేం సలహా ఇస్తాడో కిల్లర్‌కి తెలియదు గనుకనా!

—: అ యి పో యిం ది :—

# స్మగ్లింగ్ కింగ్

సుంకరి రాంప్రసాద్

గుజరాత్‌లోని కాండ్లా హార్బర్‌కు రెండు మైళ్ళ దూరంలో లంగరు వేయబడి ఉంది ఇండియన్ కార్గో షిప్ సముద్రగుప్త.

సింగపూర్ నుండి సరుకులను తీసుకువస్తున్న ఆ రవాణా నౌక కాండ్లా రేవును సమీపించేసరికి చీకటి పడిపోయింది.

ఆ రాత్రికి ఎలాగూ లోడింగ్, అన్‌లోడింగ్ ఉండవు కాబట్టి ఆ షిప్‌కు హార్బర్‌లోనికి ఎంట్రీ లభించలేదు.

అప్పటినుండి హార్బర్‌లోనికి ప్రవేశించడానికి అనుమతి కోసం నిరీక్షిస్తూ అక్కడే ఆగివుంది ఆ నౌక.

రాత్రి పన్నెండు గంటల సమయం. షిప్‌లోని సెయిలర్స్ అంతా మత్తుగా నిద్రపోతున్నారు.

నల్లని అరేబియన్ సముద్రజలాలపై తేలుకుంటూ రెండు పడవలు మెల్లగా ఆ షిప్‌ను సమీపించ

సాగాయి.

బలిష్ఠులైన దృఢకాయులు బలంగా తెడ్లు వేస్తూ ఆ పడవలను నడుపుతున్నారు.

నిజానికవి మామూలు కొయ్యపడవలు కావు. మోడరన్ పెట్రోల్ బోట్స్. కాని వాటి ఇంజన్లను ఆన్ చేస్తే వచ్చే శబ్దాన్ని ఆ షిప్‌లోని వారెవరూ పసిగట్టకుండా, వాటి ఇంజన్లను ఆఫ్ చేసి, తెడ్ల సాయంతో ఆ బోట్లను నడుపుకుంటూ ఆ షిప్‌ను చేరుకున్నారు వారు.

అంతవరకూ షిప్ డెక్ మీద పొంచివుండి ఆ బోట్లను గమనిస్తున్న ఇద్దరు సెయిలర్లు లేచినిలబడ్డారు. చుట్టూ ఒకసారి చూశారు. ఎవరూ తమను గమనించటం లేదని నిశ్చయించుకున్నాక ఒకడు చేతిలోని టార్చిలైటును క్రిందకు ఫోకస్ చేశాడు.

రెండు పడవలలోని మనుషులు రెండు బ్యానర్లను యెత్తిపట్టుకున్నారు. షిప్ మీదనున్న వ్యక్తులకు టార్చిలైటు ఫోకస్‌లో ఆ బ్యానర్స్ స్పష్టంగా కన్పిస్తున్నాయి.

ఆ బ్యానర్స్‌పైన ఉన్నవి రెండే రెండు అక్షరాలు. అవి.... హెచ్. ఎ.

ఆ అక్షరాలను చూసి షిప్‌లోని సెయిలర్స్ సంతృప్తిగా తలాడించారు.

పడవలోని ఒక వ్యక్తి జేబులోనుండి క్లిప్పులా వున్న పరికరం పైకి తీశాడు. అది చిన్నపిల్లలు ఆటలాడుకొనే వస్తువు.

దానిని ప్రెస్ చేస్తే టిక్....టిక్.... మని శబ్దం వస్తుంది.

దానిద్వారా వస్తున్నది పెద్ద శబ్దం యేమీ కాదు. కాని ఆ నిశ్శబ్ద నిశీధిలో....ఆ చిన్న శబ్దం సైతం డెక్ మీద నిలుచున్న వారికి స్పష్టంగా వినిపిస్తూంది.

టిక్ ... టిక్ ....టిక్ ....

మధ్య మధ్యలో ఆగుతూ....లయబద్ధంగా వినిపిస్తూంది ఆ శబ్దం.

పోస్టాఫీసులలో టెలిగ్రామ్స్‌ను పంపించడానికి ఇలాంటి శబ్దాలనే ఉపయోగిస్తారు. ఒక్కొక్క శబ్దానికి ఇంగ్లీషులో ఒక్కొక్క అక్షరమనే సాంకేతికముంటుంది. దానిని టెలిగ్రాఫిక్ కోడ్ అంటారు.

అలాంటి టెలిగ్రాఫిక్ కోడ్‌లో ఆ బోట్లలోని వ్యక్తులు షిప్ డెక్ మీద నిలుచున్న వ్యక్తులకు సందేశాన్ని పంపుతున్నారు.

డెక్ మీద నిలుచున్న ఒక సెయిలర్ జేబులో నుండి చిన్న పాకెట్ డైరీ తీసి శబ్దాలను నోట్ చేయసాగాడు.

అంతే బోట్స్‌లోని వ్యక్తులు పంపుతున్న మెసేజ్ పూర్తయిందన్న మాట.

ఆ శబ్దాలను లెక్కించి, డైరీలో నోట్ చేసిన వ్యక్తి చక చకా ఆ మెసేజ్‌ను డీకోడ్ చేశాడు.

"సీ ద సీ"

"పుష్ ద ఫిష్"

—హెచ్. ఎ.

ఆ మెసేజ్‌ను చదువుతుని సాలోచనగా తలలు పంకించారు ఆ సెయిలర్స్.

ఆ మెసేజ్‌లోని అంతరార్థం వారికి తెలుసు. వారి భాషలో ఫిష్ అంటే స్మగుల్డు గూడ్స్.

డెక్ పైన పెద్ద పెద్ద పీపాల చాటున దాచివుంచిన పార్సిల్స్‌ను పైకి తీశారు వారు. ఆ పార్సిల్స్ అన్నీ పెద్ద నైలాన్ త్రాడుతో ముడివేయబడి ఉన్నాయి.

ఆ త్రాడు సాయంతో ఆ పార్సిల్స్‌ను మెల్లగా క్రిందకు జార్చారు వారు. బోట్స్‌లోని వ్యక్తులు చప్పుడు కాకుండా ఆ పార్సిల్స్‌ను అందుకున్నారు.

కేవలం కొద్ది నిముషాలలో గుట్టుచప్పుడు కాకుండా ఆ స్మగుల్డు గూడ్స్ ఎక్స్‌ఛేంజ్ జరిగిపోయింది.

ఇలా కస్టమ్స్ అధికారుల కంటబడకుండా షిప్ సముద్రంలో ఉండగానే తమ సరుకులను రవాణా చేస్తుంటారు స్మగ్లర్స్.

వారు యిచ్చే కరెన్సీ కోసం కక్కుర్తిపడి షిప్ సిబ్బందిలోని కొందరు వారికి ఈ స్మగుల్డు గూడ్స్‌ను చేరవేయటంలో సహాయపడుతుంటారు.

## 2

కాండ్లా రేవుకు సుమారు ఒకటిన్నర మైళ్ళ దూరంలో నిర్మానుష్యంగా ఉన్న సముద్రతీరాన నిలబడి ఉన్నారు ఇద్దరు వ్యక్తులు.

వారికి కొన్ని గజాల దూరంలో నీలిరంగు స్టాండర్డ్ వాన్ ఒకటి ఆగివుంది.

నల్లని సముద్రపు ఒడ్డున తెల్లని కొండల్లాంటి ఇసుక దిబ్బలు తలలు విరబోసుకొన్న భూతాల్లా అక్కడక్కడ గుబురుగా పెరిగిన జీడి చెట్లు.

పట్టపగలు కూడా అక్కడ మానవ సంచారం ఉండదు.

ఆ ఇద్దరు వ్యక్తులూ అసహనంగా సముద్రంవైపు చూస్తున్నారు. వారి చేతులలో శక్తివంతమైన టార్చ్

లైట్లు ఉన్నాయి.

అయితే జీడిచెట్ల మాటున కొందరు వ్యక్తులు దాక్కొని, తమ చర్యలను గమనిస్తున్నారన్న సంగతి వారికి తెలియదు.

దాదాపు నలభయి నిముషాల తరువాత వారి నిరీక్షణ ఫలించింది. ముందుగా ఏవో మోటారు బోట్లు వస్తున్న శబ్దం వినిపించింది వారికి.

వారు ఎలర్ట్ అయ్యారు. తమ చేతులలోని టార్చ్ లైట్స్‌ను వెలిగిస్తూ, ఆర్పుతూ ఆ బోట్లలోని వారికి సిగ్నల్స్ పంపారు.

ఆ టార్చ్‌లను వెలిగిస్తూ, ఆర్పటంలో ఒక ప్రత్యేకత ఉంది.

ఒక పద్ధతిలో....ఒక లయలా ...

"వన్....వన్ ....టూ ....టూ ....వన్ ...." అంటూ రిధమిక్‌గా వారు ఆ టార్చ్‌తో వెలుగును ఫోకస్ చేశారు.

సముద్రంలోని బోట్లలో నుండి కూడా సరిగ్గా అలాంటి సిగ్నల్స్ వచ్చాయి.

వారు సంతృప్తిగా ఒకరి నొకరు చూసి నవ్వుకున్నారు.

మరపడవలు మెల్లగా ఒడ్డుకు చేరుకున్నాయి. అది....సముద్రగుప్త షిప్ నుండి స్మగుల్డుగూడ్స్ తెస్తున్న బోట్.

పార్సిల్స్‌ను పదిలంగా తలల కెత్తుకుని మెల్లగా క్రిందకు దిగారు పడవలోని వ్యక్తులు.

ఒడ్డున నిలబడ్డ వ్యక్తులవంక చూసి పలకరింపుగా నవ్వారు వారు.

"అన్నీ వాచీలేనా?"

"ఊహు .. టూ....ఇన్ వన్‌లు కూడా."

"మరి వి.సి.ఆర్.లు?"

"పదో. పన్నెండో ఉన్నట్లున్నాయి."

వారు మెల్లగా మాట్లాడుకుంటూ సరుకులను వాన్‌లో లోడ్ చేయసాగారు.

బోట్‌లో నుండి పెద్ద రెడ్ పార్సిలొకటి మోసుకు వచ్చాడొక వ్యక్తి. ఒడ్డున నిలబడ్డ వ్యక్తి కేసి వంక చూసి సన్నగా నవ్వుతూ అన్నాడు.

"పెరల్స్. మంచి ముత్యాలు."

పార్సిల్స్ అన్నీ వాన్‌లో ఎక్కించేశారు వారు. వాన్‌ను స్టార్టు చేయడానికి తలుపును తెరిచాడు డ్రయివర్.

ఇంతలో బిలబిలమంటూ జీడి చెట్ల చాటునుండి పరుగెత్తుకుంటూ వచ్చారు పదిహేనుమంది వ్యక్తులు. వారి చేతులలో తుపాకులు ఉన్నాయి.

వారి బూట్ల శబ్దం వినగానే....రాతిమీద పడ్డ కుండ పెంకుల్లా నలుదిక్కులా పారిపోయారు ఆ స్మగ్లర్స్.

"పోలీస్....పోలీస్!" అంటూ వారి గొంతులు ఆ జీడితోపులో వికృతంగా ప్రతిధ్వనించాయి.

అందరికంటే ముందుగా వచ్చిన సర్కిల్ ఇన్‌స్పెక్టర్ వరుణ్ .... పారిపోబోతున్న డ్రయివర్ మోకాళ్ళపై రివాల్వర్‌తో గురిచూసి కాల్చాడు.

ఒక నిప్పుకణం తాకినట్లు బాధతో విలవిలలాడాడు ఆ డ్రయివర్. కెవ్వున కేక వేస్తూ కుప్పకూలిపోయాడు. వెంటనే యిద్దరు కానిస్టేబుల్స్ అతడిని కదలకుండా బంధించారు.

చాలామంది స్మగ్లర్లు తెలివిగా సముద్రంవైపు పరుగెత్తి ...అక్కడ ఆపివుంచిన తమ మోటార్ బోట్లలో పారిపోయారు.

అయితే.... పోలీసుల కాల్పుల్లో వారిలో కొద్దిమందికి తీవ్రమయిన గాయాలే తగిలాయి.

పోలీసులకు పట్టుబడింది ఆ డ్రయివర్ ఒక్కడే. అయినా, కొన్ని లక్షల రూపాయలు విలువచేసే స్మగుల్డు గూడ్స్ చిక్కాయి.

ముఖ్యంగా ఆ వాన్.

"ఆ వాన్ యెవరిదో తెలుసుకుంటే ఆ ఆధారంతో ఈ స్మగ్లింగ్ గాంగ్ యొక్క మరికొన్ని వివరాలను తెలుసుకోవచ్చు."

ఆ వాన్ వంక సాలోచనగా చూస్తూ అనుకున్నాడు ఇన్‌స్పెక్టర్ వరుణ్.

ఆ వాన్ నెంబరు జి.ఎ.క. 420.

## 3

"జి.ఎ.క. 420 నెంబరుగల స్టాండర్డ్ వ్యాన్ మీదే కదూ!"

"యస్ ఇన్‌స్పెక్టర్!"

"అది నీలిరంగు వాన్!"

"అఫ్‌కోర్స్!"

"ఆ వాన్ నిన్న రాత్రి స్మగ్లింగ్ సరకులతో మాకు పట్టుబడింది. దీనికి మీరిచ్చే సంజాయిషీ ఏమిటి?"

"వాన్‌ను వెతికి పట్టుకున్నందుకు కృతజ్ఞాణి ఇన్‌స్పెక్టర్."

"నేను అడుగుతున్నది సంజాయిషీ."

"కాని నేను చెబుతున్నవి కృతజ్ఞతలు. పోయిన వాన్‌ను వెతికి పట్టుకున్నారు కదా—అందుకు."

అతడివంక నమ్మలేనట్లు చూశాడు ఇన్‌స్పెక్టర్ వరుణ్.

"యస్ మిస్టర్ వరుణ్!

నా వాన్ పోయిందని....ఎవరో దానిని దొంగలించారని నిన్న రాత్రి ఏడుగంటల ప్రాంతంలో నే పోలీస్ రిపోర్టు యిచ్చాను. మీకు వాన్ పట్టుబడింది రాత్రి పన్నెండు తరువాత కదూ!

మీకు సందేహంగా ఉంటే, ఒక్కసారి త్రీ టవున్ పోలీసుస్టేషన్‌లో ఎంక్వయిరీ చేయండి.

అక్కడ నేనిచ్చిన కంప్లెంట్ కాగితం మీకు సాక్ష్యం యిస్తుంది."

ఎర్రబడ్డ ముఖంతో అతడివంక కోపంగా చూశాడు వరుణ్. అది యేమీ చేయలేని ఉక్రోషం.

"మిష్టర్ ఆలీ...."

"నో....నో....నో....హాసన్ ఆలీ" ఒక్కొక్క అక్షరానే వత్తి పలుకుతూ అన్నాడతడు.

"ఓకే....మిస్టర్ హాసన్ ఆలీ. నేరం ఎవరు చేశారో ఈ స్మగ్లింగ్ ముఠా నాయకుడు ఎవరో తెలుసుకోనే రోజు త్వరలోనే వస్తుంది. ఆ రోజు....చట్టం ఉక్కు సంకెళ్ళ నుండి ఎవ్వరూ తప్పించుకోలేరు."

ఇన్‌స్పెక్టర్ వరుణ్ గొంతు ఆ హాలులో కంచులా మ్రోగింది.

వరుణ్ వంక నవ్వుతూ చూశాడు అతడు.

"ఐ దిబై వాన్ కోసం యెప్పుడు రమ్మంటారు ఇన్‌స్పెక్టర్."

విసురుగా వెనుతిరిగి వెళ్ళిపోతున్న ఇన్ స్పెక్టర్, అతడి మాటలకు టక్కున ఆగాడు.

"అది అంత త్వరగా తేలే వ్యవహారం కాదు మిస్టర్ హాసన్ అలీ" అన్నాడతడు కటువుగా.

వరుణ్ వంక కూల్ గా చూశాడు హాసన్ అలీ.

హాసన్ అలీ....

కాండ్లా పట్టణానికి మకుటంలేని మహారాజు అతడు. గుజరాత్ రాష్ట్రంలో అతడి పేరు తెలియనివారు లేరు....

అతడి యిల్లు ఒక పెద్ద రాజప్రాసాదంలా ఉంటుంది. ఆ ప్యాలెస్, అందలి ఫర్నిచరూ, ఫర్నిషింగ్సూ అన్నీ కలసి కొన్ని మిలియన్ల విలువ చేస్తాయి.

పదిహే నేళ్ళ క్రితం....

అతడు కాండ్లా రేవులో పనిచేసుకొనే చిన్న కూలీ అన్న నిజం ఏ ఒకరిద్దరికో తెలుసు.

పదిహేనేళ్ళలో అలాంటి గరీబు ఇంతటి నవాబుగా ఎలా మారగల్గాడు? ఇన్ని కోట్ల రూపాయల ఆస్థిని ఎలా సంపాదించగల్గాడు?

స్మగ్లింగ్....!

పేవ్ మెంట్లమీద ముష్టెత్తుకునేవాడిని ఒక్క రాత్రిలో మహారాజు చేయగల చీకటి వ్యాపారం.

ద కిన్లీ కింగ్ బిజినెస్ దట్ క్రియేట్స్ కింగ్ ఆఫ్ కింగ్స్.

హాసన్ అలీ అలాంటి ఒక కింగ్,

అతడు స్మగ్లర్ అని ప్రజలకు తెలుసు. ప్రభుత్వానికి తెలుసు.

కాని అతడింతవరకూ కనీసం అనుమానంపైన కూడా

అరెస్టు కాబడలేదు.

పచ్చగా గీతాల పలుకుబడితో చట్టాన్ని, అధికారులనూ తన స్వప్రయోజనం కోసం ఎలా వాడుకోవాలో అతడికి బాగా తెలుసు.

అయితే ఇప్పుడతడికి వరుణ్ ఒక సమస్యలా తయారయ్యాడు.

## 4

సాయంత్రపు నీరెండలో నల్లని తారురోడ్డు తళతళా మెరుస్తోంది. సన్నగా కూనిరాగం తీస్తూ హుషారుగా లారీని నడుపుతున్నాడు చాంద్ రామ్.

దాదాపు నిర్మానుష్యంగా వున్న ఆ రోడ్డుమీద, జోరుగా, హుషారుగా సాగిపోతోంది అతడి లారీ.

సరుకును అన్ జార్ లో దించేస్తే చాలు, సరుకును దింపినచోటే నాలుగువేలు యిచ్చేస్తారని చెప్పాడు కాండ్లాలో లారీలో సరుకును వేసిన పెద్దమనిషి. వేయి రూపాయలు అడ్వాన్స్ కూడా యిచ్చాడతడు.

మొత్తం అయిదువేల కిరాయి. కాండ్లా నుండి అన్ జార్ కు యెవరూ రెండువేలకు మించి కిరాయి యివ్వరు. అలాంటిది ఒక్కసారిగా మూడువేలు యెక్కువంటే మాటలా?

కాకుంటే అతడు చిన్న కోరిక కోరాడు.

సాధారణంగా కాండ్లా నుండి గాంధీగ్రామ్ మీదుగా, అన్ జార్ కు వెళ్తారు. అది మెయిన్ రూట్.

కానీ ఆ పెద్దమనిషి తనను గాంధీగ్రామ్ మీదుగా కాకుండా యింకో రూట్ లో అన్ జార్ కు వెళ్ళమన్నాడు.

అది....కాస్త చుట్టు తిరుగుడు త్రోవ. రోడ్డు

మంచిదే. పక్కా. తారురోడ్డు. కాకుంటే ఆ రూట్
అంతా నిర్మానుష్యంగా వుంటుంది.

రోడ్డు కిరువైపులా ఏపుగా పెరిగిన తోటలూ,
పొలాలూ, కొండలమీద పరచుకున్న చిక్కని అడవీ,
అక్కడక్కడ ఒకటి. రెండు కుగ్రామాలు. అంతే!

నిర్మానుష్యంగా వుండే ఆ రూట్లో ప్రయాణించ
డానికి లారీ డ్రయివర్లు ఎవరూ ఇష్టపడరు.

మామూలు బేరమే అయితే చాంద్ రామ్ కూడా
చచ్చినా ఆ కిరాయికి ఒప్పుకోనేవాడు కాదు.

కాని, చూస్తూ చూస్తూ మూడువేల రూపాయలు
అదనంగా వస్తుంటే, ఎలా వదులుకోగలడు?

అందుకే.... కాస్త కష్టమయినా ఆ రూట్లో
ప్రయాణించడానికి అంగీకరించాడు అతడు.

అతని మనసులోని ఆలోచనల లాగానే లారీ కూడా
శరవేగంగా దూసుకుపోతోంది.

ఇంతలో....

రోడ్డుకు అడ్డంగా వున్న చెక్ పోస్టును చూసేసరికి
అతడి ఆలోచనకూ, లారీకీ ఒకేసారి టక్కున బ్రేకులు
పడ్డాయి.

అతడు అనుమానంగా చెక్ పోస్టువంక చూశాడు.
అతడికి తెలిసినంతలో ఆ రూట్లో ప్రభుత్వం ఏ చెక్
పోస్టును పెట్టలేదు.

మరి ఇది....?

అతడు సి బుక్, లోడింగ్ డాక్యుమెంట్స్ తీసు
కొని క్రిందకు దిగాడు. చెక్ పోస్టు గేటు ప్రక్కనే ఆగి
వున్న పోలీస్ జీపును చూసేసరికి ఆశ్చర్యంతో అతడి కళ్ళు
పెద్దవయ్యాయి.

చెక్ పోస్టు క్లర్కు స్థానంలో ప్రత్యక్షమయిన ఇన్‌స్పెక్టర్ వంక నివ్వెరపోతూ చూశాడతడు.

చాంద్ రామ్ అందించిన సి బుక్ నూ, లారీ చలానా, వే బిల్ వగైరా లోడింగ్ డాక్యుమెంట్స్‌ను పరిశీలనగా చూశాడు ఆ ఇన్‌స్పెక్టర్.

"అయితే అన్ జార్ వెళ్తున్నావా చాంద్ రామ్?"

"జీ ... సాబ్!"

ఇన్‌స్పెక్టర్ చూసి, యిచ్చేస్తున్న కాగితాలను వినయంగా అందుకుంటూ అన్నాడతడు.

"మరి మెయిన్ రోడ్డును వదలి యిలా అడ్డదారులు పట్టావేం?"

అనుమానంగా చూస్తోన్న ఇన్‌స్పెక్టర్ వంక సూటిగా చూడలేక తల వాల్చేశాడు చాంద్ రామ్.

"అది ... అది .... దారిలోని గ్రామంలో మా చుట్టాలు వున్నారు సాబ్. వారికో చిన్న కబురు చెప్పాలి. అందుకని ...." మెల్లగా నసుగుతూ చెప్పాడతడు.

దారిలో ఎవరైనా అడ్డుతగిలి, ఈ రూట్ లో ఎందుకు వెళ్తున్నావని అడిగితే .... పై విధంగా సమాధానం చెప్పమని చెప్పాడు కాండ్లాలో సరుకును వేసిన పెద్దమనిషి.

అతడి మాటలను తూ.చ. తప్పకుండా యిక్కడ ఇన్‌స్పెక్టర్‌కు అప్పజెప్పాడు చాంద్ రామ్.

అతడివంక సాలోచనగా చూశాడు ఇన్‌స్పెక్టర్. ఇంతలో ముగ్గురు కానిస్టేబిల్స్ వారి దగ్గరకు వచ్చారు.

"లారీ అంతా చెక్ చేశాం సర్. లోపల పత్తిబుట్టలు తప్ప యింకేమీ లేవు."

వినయంగా సెల్యూట్ చేస్తూ చెప్పాడొక కానిస్టేబుల్.

'ఆ రూట్‌లో నల్లమందు రవాణా అవుతోందని వారికి ఇన్ఫర్మేషన్ వచ్చింది. అప్పటినుండీ అక్కడ కాపు కాసారు వారు.

కాని, గత అయిదారు గంటలుగా ఆ రూట్‌లో వచ్చినది ఆ లారీ ఒక్కటే. తీరా అందులో చెక్ చేస్తే పళ్ళబుట్ట లున్నాయని తేలింది.

అంటే తమకు వచ్చింది రాంగ్ ఇన్ఫర్మేషనా? కాదు. నిజమే అయితే యింకా యెన్ని గంటలు కాపలా కాయాల్సి వుంటుంది?'

అతడు ఆలోచిస్తున్నాడు.

ఇన్‌స్పెక్టర్‌కు మరోసారి నమస్కరించి మెల్లగా బయటకు నడిచాడు చాంద్‌రామ్. అతడిని అనుసరించారు ఆ ముగ్గురు కానిస్టేబుల్లూ.

"ఏం పళ్ళు డ్రయివర్ భాయ్?" ఆశగా అడిగాడు ఒక కానిస్టేబుల్.

'పోలీసు బుద్ధి' అనుకున్నాడు చాంద్‌రామ్. కాని, మనసులోని భావాన్ని పైకి రానీకుండా ముఖాన యింత చిరునవ్వు పులుముకొని....

"అంజీర్ భాయి. అత్తిపళ్ళు" అన్నాడతడు.

"అన్‌జార్‌కు అంజీర్లను పంపుతున్న తెలివితక్కువ దద్దమ్మ ఎవరు భాయ్?" అన్నాడొక కానిస్టేబుల్ ఫక్కున నవ్వుతూ. అతడు వాగుడుకాయ.

అతడివంక ఆశ్చర్యంగా చూశాడు చాంద్‌రామ్.

"అసలు....ఆ ఊరికి అన్‌జార్ అన్న పేరు యెలా వచ్చిందంటావ్? అంజీర్లు యెక్కువగా పండుతాయి కాబట్టే. గుజరాత్ రాష్ట్రానికే అత్తిపళ్ళ పంటకు అన్‌జార్ ప్రసిద్ధి. ఇన్నాళ్ళు అన్‌జార్ నుండి యితర

పట్టణాలకు అంజీర్ ఫలాలు ఎగుమతి కావడమే తెలుసు నాకు. కాని, ఈ రోజుకి కాండ్లా నుంచి అంజీర్లు అస్ జార్‌కు దిగుమతి అవుతున్నాయంటే చిత్రమే మరి"

గడ గడా ఆగకుండా చెప్పుకుపోతున్నాడు ఆ కానిస్టేబుల్.

కానిస్టేబుల్ మాటలకు ఉలిక్కిపడ్డాడు ఇన్స్పెక్టర్.

"నిజమే! ఎగుమతి కావాల్సిన అత్తిపళ్ళు అస్ జార్‌కు యెందుకు దిగుమతి అవుతున్నట్లు? సంథింగ్ రాంగ్" అనుకున్నాడతడు.

వెంటనే అతడు లారీ దగ్గరకు నడిచాడు.

అతడు చేసైగ చేయగానే రెండు పళ్ళబుట్టలను క్రిందకు దించారు కానిస్టేబుల్స్.

సన్నని వెదురుబుట్టలలో గడ్డి వేసి, వాటి మధ్య నీట్‌గా పేర్చబడి వున్నాయి నిగ నిగ లాడుతున్న అత్తి పళ్ళు.

బుట్టలలోని పండ్లను క్రిందకు వంచాడు. జల జల మంటూ క్రిందకు రాలాయి ఆ పళ్ళు. బుట్ట అడుగున గాని, గడ్డి మధ్యగాని యేమీ కనిపించలేదు అతడికి.

అతడు విసుగ్గా లేచి నిలబడ్డాడు.

కానిస్టేబుల్స్ క్రిందపడ్డ అత్తిపళ్ళను బుట్టల్లో నింపుతున్నారు. ఇంతకు క్రితం డ్రయివర్‌తో మాట్లాడిన కానిస్టేబుల్ ఒక పండును చేతిలోకి తీసుకున్నాడు. జేబులో నుండి కర్చీఫ్ తీసి శుభ్రంగా ఆ పండును తుడవసాగాడు.

ఇన్స్పెక్టర్ అసహనంగా పచార్లు చేస్తున్నాడు. అతడిలో యేదో అనుమానం కొట్లాడుతోంది.

“ఆ రూట్‌లో ఆ లారీ రావడం, లేకూడని అత్తి పళ్ళు లేవడం అంతా అసహజత్వమే కనిపిస్తూంది. కాని యెంత వెతికినా అనుమానించేదగ్గదేమీ కనిపించటం లేదు.”

కానిస్టేబుల్ మెల్లగా ఆ పండును తినడం ప్రారంభించాడు. రెండు ముక్కలను కొరికి హాయిగా తిన్నాడతడు.

‘పుల్ల పుల్లగా, తీయ తీయగా భలే రుచిగా వుందిలే’ అనుకున్నాడతడు.

సరిగ్గా మూడవ ముక్కను కొరికే సమయానికి అతడి నాలుకకు సోకింది ఒక విచిత్రమైన రుచి. మామూలుగా, మెత్తగా ఆ పండులో దిగాల్సిన అతడి పళ్ళు యేదో మైనం ముద్దలో ఇరుక్కున్నట్లు బిగువుగా దిగాయి.

అతడు ఆశ్చర్యంగా ఆ పండువంక చూశాడు. లోపల....ఆ పండు గుజ్జు మధ్య యేదో నల్లని ముద్ద కనిపించింది అతడికి.

“సార్!” అంటూ కేక వేస్తూ ఆ పండును తీసుకొని ఇన్‌స్పెక్టర్ దగ్గరకు పరుగెత్తాడు.

ఇన్‌స్పెక్టర్ ఆ ముద్దవంక పరిశీలనగా చూశాడు. చూసిన మరుక్షణమే అదేమిటో గ్రహించాడు అతడు.

అది....నల్లమందు.

అతడు వెంటనే మిగిలిన పండ్లను పరీక్షించి చూశాడు.

ప్రతి బుట్టలో అడుగున అయిదారు పండ్లలో నల్లమందు వుండలు లభించాయి. అత్తిపళ్ళను జాగ్రత్తగా మధ్యకు కోసి, మధ్య కొంతమేర గుజ్జును తొలగించి, ఆ స్థానంలో నల్లమందు ఉండలను పెట్టి, మళ్ళీ జాగ్రత్తగా

ఆ రెండు ముక్కలను అతికించారు.

పైకి చూడటానికి అవి మామూలు పండ్లలాగానే ఉన్నాయి. ది క్లవరెస్ట్ స్మగ్లింగ్ ఆఫ్ ఓపియమ్.

వెంటనే ఆ సరకును లారీతో సహా సీజ్ చేయించాడు ఆ ఇన్ స్పెక్టర్.

కోటిరూపాయల పైన విలువచేసే ఆ నల్లమందును పట్టుకున్నది ఎవరో కాదు.

కాండ్లాలోని దొంగవ్యాపారాలను, అక్రమ రవాణాలను ఎవరు కంట్రోల్ చేశారో!

ఎవరి పేరు చెబితే కాండ్లాలోని స్మగ్లర్ల సింహస్వప్నమో!

ఎవరి పేరు చెబితే కాండ్లాలోని నేరస్థులు గజ గజలాడిపోతారో!

అతడు.... ఆ నల్లమందును పట్టుకున్నది.

అతడు.... ఇన్ స్పెక్టర్ వరుణ్.

# 5

అది విశాలమయిన గది. డెకోలం పెయింట్ తో ఆ గది గోడలు తళతళ లాడుతున్నాయి. ఖరీదయిన, ఎర్రని కాశ్మీర్ కార్పెట్ ఆ గది నేలమీద పరచబడి ఉంది.

గది పైకూరు నుండి వ్రేలాడుతున్న షాండిలర్స్ కాంతి ఆ గదంతా చిక్కగా పరచుకుంది.

రివాల్వింగ్ ఛెయిర్ లో కూర్చుని విలాసంగా అటూ, యిటూ ఊగుతున్నాడు హాసన్ అలీ. అతని చేతిలో పొగలు క్రక్కుతున్న బంగారు పైపు నుండి విరజిమ్ముతున్న కమ్మని సెంటెడ్ పొగాకు పరిమళం ఆ గదంతా వ్యాపిస్తూంది.

అతడి ఎదురుగా ముగ్గురు వ్యక్తులు కూర్చుని వున్నారు.

వారి చేతులలోని గ్లాసెట్స్‌లో బంగారు రంగు ద్రవం నింపబడి వుంది. వారు నెమ్మదిగా ఆ మద్యం సిప్ చేస్తూ మాట్లాడుకుంటున్నారు.

"అలీ సాబ్! ఇలా అయితే మరి మనం స్మగ్లింగ్ బిజినెస్ చేయలేం."

"గత మూడు నెలలలో సుమారు పదికోట్లు విలువ చేసే మన స్మగ్లింగ్ వస్తువులను పోలీసులు స్వాధీనం చేసుకున్నారు."

"ఇదంతా ఆ ఇన్‌స్పెక్టర్ వరుణ్ వలనే. అతడి నిఘా నుండి తప్పించుకోవడం మనకు అసాధ్యమయి పోతోంది."

అంతవరకూ మౌనంగా వారి మాటలను వింటూన్న హాసన్ అలీ మెల్లగా పెదవులను విప్పాడు.

"అందుకే.... నేను స్మగ్లింగ్‌ను ఆపేద్దామనుకుంటు న్నాను."

అతడి మాటలకు ప్రక్కలో బాంబు పడ్డట్లు ఉలిక్కి పడ్డారు వారు.

'స్మగ్లింగ్ కింగ్ హాసన్ అలీ స్మగ్లింగ్‌ను మానేయ డమా? అదీ ఆఫ్టరాల్ ఒక్క మామూలు ఇన్‌స్పెక్టర్‌కు భయపడి!'

ఆశ్చర్యంగా తన వంక చూస్తున్న వారిని చూసి నవ్వాడు హాసన్ అలీ.

"అవును ఫ్రెండ్స్! నిజంగానే ఆపేద్దామనుకుంటు న్నాను—ఒక్క పదిరోజులపాటు."

గుండెలమీద నుండి పెద్ద బండను తొలగించినట్లు తేలిగ్గా నిట్టూర్చారు వారు.

"ఒక్క పదిరోజులపాటు మన స్మగ్లింగ్ కార్య

కలాపాలన్నీ పూర్తిగా కట్టిపెట్టండి. చాలు. ఆ తరువాత మన యిష్టం.”

“ఈ పదిరోజులలో యేం జరుగుతుంది అలీ సాబ్!” కుతూహలంగా అడిగా డొక వ్యక్తి.

“మీరే చూస్తారుగా!” నవ్వాడు హాసన్ అలీ.

‘ఏం జరగబోతోంది? ఈ పదిరోజులలో హాసన్ అలీ యేం చేయబోతున్నాడు?’

వారందరి మనస్సులలోనూ అదే ప్రశ్న. కానీ అలీ దగ్గర నుండి ఆ ప్రశ్నకు సమాధానం లభించదని వారికి తెలుసు. అతడు చేయబోయేది చెప్పడు.

అలీకి నమస్కరించి ఆ గది నుండి మౌనంగా నిష్క్రమించారు వారు.

రివాల్వింగ్ ఛెయిర్‌లో వెనక్కు వాలి వున్నాడు అలీ. అతడి మెదడు నిండా ఆలోచనలు సుళ్ళు తిరుగుతున్నాయి.

అతడి ఆలోచన....

ఈ పదిరోజులలో యేం చేయాలన్నదాని గూర్చి కాదు. దాని గూర్చిన ఒక పటిష్టమైన పథకం అతడి దగ్గర సిద్ధంగా వుంది.

అతడి ఆలోచన....

ఇన్‌స్పెక్టర్ వరుణ్ గురించి.

‘ఎంతో రహస్యంగా జరిగే తమ స్మగ్లింగ్ కార్యకలాపాల గురించి ఇన్‌స్పెక్టర్ వరుణ్‌కు యెలా తెలుస్తోంది?

సరిగ్గా ఆ సమయానికి, ఆ ప్రదేశంలో అతడు యెలా రెయిడ్ చేయగల్గుతున్నాడు?

ఎవరో అతనికి ఇన్‌ఫర్‌మేషన్ యిస్తూవుండాలి.

ఎవరు? ఎవరా కల్ప్రిట్?

తమ స్మగ్లింగ్ ముఠాలోని మనిషేనా? అదే నిజమయితే ఆ యింటి దొంగ యెవరో తెలుసుకోవాలి. అంతదరకూ తమ స్మగ్లింగ్ బిజినెస్‌కు రక్షణలేదు.'

ఇప్పుడతని ఆలోచనంతా ఆ అజ్ఞాత వ్యక్తిని గురించే.

## 6

ఆ రోజు కృష్ణాష్టమి.

కాంగ్డా పట్టణంలోని ఆ శ్రీకృష్ణుని మందిరం భక్తులతో కళకళ లాడుతోంది.

పచ్చని పందిళ్ళతో, అలంకరింపబడ్డ అరటి స్తంభాలతో, రంగు రంగుల తోరణాలతో ఆ దేవాలయ ప్రాంగణం కన్నుల పండుగ చేస్తోంది.

"మీరా కే ప్రియ్ హృదయ విహారీ....
గోవర్ధన్ గిరి ధారీ...."

మైకులలో నుండి వాణీజయరామ్ పాడిన మీరా భక్తిగీతాలు శ్రావ్యంగా వినిపిస్తున్నాయి.

చేతులలో పూజాసజ్జలతో బారులుతీర్చి ఉన్నారు భక్తజనం. అయితే.... దేవాలయాల్లో ప్రవేశించేవారిలో ఉండాల్సిన ప్రశాంతత, భక్తిభావం వారి ముఖాల్లో మచ్చుకయినా కన్పించటంలేదు.

చిరాకుతో వారి కనుబొమలు ముడివడి వున్నాయి. ఏదో దుర్గంధం వస్తున్నట్లు వారు ముక్కులకు కర్చీఫ్‌లను అడ్డం పెట్టుకున్నారు. వారి చూపులు అసహనంగా వున్నాయి.

వారంతా భరించలేనంత అసహ్యంగా చూస్తున్నది ఒకే ఒక ప్రదేశాన్ని.

అది....గుడికి యెదురుగా నున్న పశు మాంస విక్రయ శాలను.

ఆ షాపు క్రొత్తగా ఆ రోజునుండే తెరవబడింది. చర్మం ఒలిచి, వ్రేలాడదీయబడ్డ గో కళేబరాలు ఎర్రగా రక్తపు ముద్దల్లా భయంకరంగా కన్పిస్తున్నాయి. ఓ ప్రక్క చిన్న చెక్కబల్లపై కోయబడ్డ ఆవుల, ఎద్దుల తలలు పేర్చబడి వున్నాయి. పెద్ద వేటకత్తితో ఆ మాంసాన్ని ముక్కలు ముక్కలుగా తరుగుతున్నాడు ఆ షాపులోని ఒక ముస్లిమ్.

అత్యంత జుగుప్సాకరంగా కన్పిస్తున్న ఆ మాంసపు దుకాణం వంక చూడలేక కొందరు భక్తులు బాధగా కళ్ళు మూసుకుంటున్నారు.

"ఇదేమి అన్యాయం? దేవాలయానికి ఎదురుగా గోవధ శాలా?"

"హిందువులు పరమపవిత్రంగా పూజించే గోవులను చంపి, ఆ మాంసాన్ని ఒక హిందూ దేవాలయం యెదురుగా అమ్ముతారా? ఎంత కండకావరం?"

"గోవులను ప్రేమించి, పశువులను పాలించిన ఆ గోపాలుని దేవాలయం ముందే గో మాంసాన్ని అమ్ముతున్నారంటే వారెంతకు తెగించారో అర్థం అవుతూంది."

"ఏం తెగింపు. మనకేనా లేనిది? మనం యేమైనా గాజులు తొడిగించుకున్నామా?"

"పదండి....ఈ రోజు అటో యిటో తేలిపోవాలి."

ఎవరు ఈ చర్చను లేవదీసారో, ఎవరు వారిని రెచ్చగొట్టారో, యెవరు ఆవేశంగా ముందుకు కదిలారో యెవరికీ తెలియదు.

కాని, ఒకరి వెనుక ఒకరుగా మూక ఉమ్మడిగా ఒక్కసారిగా ఆ షాపుమీద పడ్డారు వారు.

"దేవాలయం ముందు అలాంటి దుకాణాన్ని పెట్టడం తప్పనీ ... వెంటనే తీసేయామని" ఒక వృద్ధుడు షాపులోని ముస్లింతో సౌమ్యంగా చెబుతున్నాడు.

ఇంతలో...."ఇంకా ఆ కసాయివాడితో మాటలేమిటండీ....పట్టుకొని రెండు తన్నక!" అంటూ యెవరో ఆవేశంగా అరిచారు.

అంతే!

గట్లు తెగిన నదిలా కొందరు షాపులోనికి ప్రవేశించారు ఆ ముస్లింను చావబాదారు కొందరు ఆ మాంసాన్ని కాళ్ళతో తమ్మి, షాపు వెనుక నున్న మురికి కాలువలోకి విసిరిపారేశారు మరి కొందరు.

వారిని వారించాలనీ, అడ్డుకోవాలనీ విఫలప్రయత్నం చేశారు కొందరు భక్తులు. కాని అప్పటికే వారు ఆ దుకాణాన్ని ధ్వంసం చేసేశారు.

'ఈ సంఘటనపై పరిణామా లెలా ఉంటాయో నని' వాపోతూ కొందరు భక్తులు తిరుగుముఖం పట్టారు.

"భగవంతుని దయవల్ల ఇది హిందూ-ముస్లింల మధ్య కొట్లాటగ దారితీయకపోతే చాలు" అనుకొన్నారు మరి కొందరు భక్తులు.

కాని.... వారు భయపడినట్లే ఈ సంఘటనతో దుష్ఫలితాలు ప్రారంభమయ్యాయి.

మారణహోమం ప్రారంభమయింది.

మతం అనే మత్తులో పిశాచాల్లా ప్రవర్తించసాగారు కొందరు విద్రోహులు.

హిందూ దేవాలయాలు కొల్లగొట్టబడ్డాయి. ముస్లింల

మసీదులు కూల్చి వేయబడ్డాయి. దోపిడీలు, గృహ దహనాలూ, హత్యలూ, మానభంగాలూ....

ఒక్క లేమిటి....మత కల్లోలాలతో కాండ్లా పట్టణం అట్టుడికిపోయింది.

ఎప్పుడు, ఎక్కడ లూటీ జరుగుతుందో....

ఎప్పుడు, ఎవరి ప్రాణాలమీదకు వస్తుందో....

ఏ క్షణం ఎలా ఉంటుందోనని కాండ్లా పట్టణప్రజలు తల్లడిల్లి పోసాగారు.

## 7

హాసన్ అలీ ఒక క్రొత్త పథకాన్ని వేశాడు.

అది....స్మగ్లింగ్ కోసం వేయబడ్డ పథకం కాదు. తమ స్మగ్లింగ్ రహస్యాలను పోలీసులకు అందిస్తున్న ఇన్ ఫార్మర్ యెవరో తెలుసుకోడానికి వేయబడ్డ పథకం.

అతడి ముఖ్య అనుచరులు ముగ్గురు.

ఎప్పుడు, ఎక్కడ, ఎవరితో హాసన్ అలీ స్మగ్లింగ్ చేసేదీ ఖచ్చితంగా తెలిసేది ఆ ముగ్గురికి మాత్రమే.

పోలీసులకు తమ రహస్యాలు తెలుస్తున్నాయంటే, ఆ ముగ్గురిలో ఎవరో ఒకరు పోలీసుల ఇన్ ఫార్మర్ అయి వుండాలి.

ఎవరా వ్యక్తి? అది తెలుసుకోడానికే అతడు వేస్తున్న ఈ ప్లాన్.

హాసన్ అలీ తన ముగ్గురు ముఖ్య అనుచరులనూ విడి విడిగా పిలిచాడు.

మరునాడు జరుగబోతున్న తమ స్మగ్లింగ్ వ్యవహారం గురించి వారితో మాట్లాడాడు.

అయితే....ఆ ముగ్గురికీ మూడు వేరు వేరు ప్రదేశాలను చెప్పాడు. ఆ మూడూ ప్రపంచంతో సంబంధం లేని

నిర్జన ప్రదేశాలు.

నిజానికి మరువాడు ఆ ప్రదేశాలలో ఏ స్మగ్లింగూ జరగటంలేదు. ఆ ప్రదేశాలపై రహస్యంగా నిఘా వేసి వుంచమని కొందరు అనుచరులను నియమించాడు అతడు.

అతడి అనుమానం నిజమయితే, ఆ మూడు ప్రదేశాల్లో ఒకదానిపై పోలీసులు దాడి చేస్తారు!

నిర్జనమైన ఆ స్థలంలోనికి పోలీసులు ఎందుకు వస్తారు? వారికేదో ఇన్‌ఫర్మేషన్ అందివుండాలి. ఎవరు చెప్తారు? ఆ ముగ్గురిలో ఒకరు చెప్పాలి.

అంటే.. తన ముగ్గురు అనుచరులలో ఎవరితో....ఆ ప్రదేశంలో స్మగ్లింగ్ జరుగుతూందని చెప్పడిందో....ఆ అనుచరుదే అసలైన ద్రోహి అన్నమాట.

అదీ హాసన్ అలీ ఆలోచన.

అయితే ...హాసన్ అలీ అనుమానిస్తున్నట్లుగా అతడి ముగ్గురు అనుచరులలో ఏ ఒక్కరు కూడా నమ్మకద్రోహి కారు. పోలీసులకు ఇన్‌ఫర్మేషన్ యిస్తున్నది వారు కాదు ....రీటా!

రీటా ఒక క్లబ్ డాన్సర్.

అలీ ముఖ్య అనుచరులలో ఒకరైన అక్బర్ ఆమె ప్రియుడు.

ఆమె అతడిని మత్తులో ముంచి, తన అందంతో కై పెక్కించి, కోరికతో అతడు సల సల కాగేవేళ .... అతడిని ఊరించి, బుజ్జగించి. అతడిద్వారా ఆ స్మగ్లింగ్ వ్యవహారాలను తెలుసుకొంటోంది.

రీటా అందానికి అక్బర్ బానిస.

అయితే....రీటా తనపై పోలీసులచే ప్రయోగింపబడ్డ

మనిషని అతడికి తెలియదు.

ఆ రోజు రాత్రి కూడా....

మామూలుగా అక్బర్ ద్వారా తెలుసుకున్న స్మగ్లింగ్ ఇన్ ఫర్ మేషన్ను ఇన్ స్పెక్టర్ వరుణ్ కు అందించింది ఆమె.

అయితే....ఇన్ స్పెక్టర్ వరుణ్ ఆమె ఇచ్చిన ఇన్ ఫర్ మేషన్ ప్రకారం ఆ ప్రదేశానికి వెళ్ళిన మరుక్షణం తన గుట్టు బయటపడుతుందని ఆమెకు తెలియదు.

తనూ, అక్బరు నమ్మకద్రోహులుగా అలీకి తెలిసి పోతుందని ఆమె ఊహించలేదు.

స్మగ్లింగ్ లాంటి చీకటి వ్యాపారాలలో నమ్మక ద్రోహానికి శిక్ష....మరణశిక్ష.

# 8

మళ్ళీ కల్లోలాలు కార్చిచ్చుల్లా లేచిని. ఒకసారి అంటు కున్నాక, ఓ పట్టాన ఆరవు. ఎక్కడో ఏ మూలో ఏదో ఒక చిన్న సంఘటన జరుగుతుంది.

తక్షణం దానికి మతం రంగుపులిమి గూండాలు రంగం లోనికి దిగుతారు. కొట్లాట ప్రారంభమవుతుంది.

నగర రక్షణకు పోలీసు బలగాలన్నీ రంగంలోనికి దింపబడ్డాయి. అయినా యెక్కడో, యే మారుమూలో ఒకటి, రెండు చెదురు మొదురు సంఘటనలు జరుగుతూనే వున్నాయి.

ఇన్ స్పెక్టర్ వరుణ్ కు క్షణం కూడా తీరిక చిక్కడం లేదు. నగరంలో శాంతిభద్రతలను పర్యవేక్షించడంలోనే అతడికి కాలమంతా సరిపోతోంది.

అతడి ఆధ్వర్యంలో పోలీసు దళాలు రాత్రీ, పగలూ భేదం లేకుండా నగరంలో కాపలా తిరుగుతున్నాయి.

స్మగ్లింగ్ వ్యవహారాల గూర్చి ఆలోచించడానికి అతడికి తీరిక లేకుండా పోయింది.

అదీగాక కొన్ని రోజుల నుండి యే ఇన్ ఫర్ మేషనూ రావటంలేదు.

కొన్నిరోజుల క్రితం....

అతడికి రీటా వద్ద నుండి ఒక ఫోన్ కాల్ వచ్చింది. ఆమె యిచ్చిన సమాచారం ప్రకారం ఆ రహస్య ప్రదేశానికి పోలీసుబలగంతో వెళ్ళాడు అతడు.

కాని....నిర్మానుష్యంగా, నిర్జనంగా ఉన్న ఆ ప్రదేశం అతడిని వెక్కిరిస్తూ కనిపించింది. రెయిడ్ చేయడానికి వెళ్ళిన పోలీసులు ఫూల్స్‌లా వెనుతిరిగి వచ్చేశారు.

అతడి అనుభవంలో రీటా యిచ్చిన సమాచారం మొదటిసారిగా తప్పయింది. అదే....రీటా దగ్గర నుండి వచ్చిన చివరి సమాచారం కూడా.

సరిగ్గా అప్పటి నుండే రీటా యెవ్వరికీ కనిపించలేదు. విచిత్రంగా అదృశ్యమయింది. ఆమెతో పాటు ఆమె ప్రియుడు అక్బర్ కూడా.

అయితే....మాయమైన రీటా గురించి ఇన్వెస్టిగేట్ చేయడానికి సైతం తీరికలేని స్థితిలో వున్నాడు ఇన్‌స్పెక్టర్ వరుణ్.

ఊబిలో చిక్కుకున్న మనిషిలా ఈ మత కల్లోలాల వలయంలో ఊపిరి కూడా అందక సతమతమవుతున్నాడతడు.

అయితే అతడికి తెలియని నిజం ఒకటుంది. అది రీటా గురించి:

ఏ రోజైతే అతడు రీటా యిచ్చిన సమాచారం

ప్రకారం ఆ రహస్య స్థలంలో రెయిడ్ చేశాడో....
ఆ నోట

పోలీసులకు తమ స్మగ్లింగ్ రహస్యాలను అందజేస్తున్నది అక్బర్, రీటాలని హాసన్ ఆలీకి తెలిసిపోయింది'
అతడి ఎత్తు ఫలించింది.

వెంటనే అక్బర్, రీటాలు బంధించబడ్డారు. ఆ రోజు రాత్రి....

ఆకలిగొన్న మొసళ్ళకు ఆహారంగా వేయబడ్డారు అక్బర్ రీటాలు.

వారి నగ్నదేహాలను కోరలతో కరచి, గుహల లాంటి నోళ్ళు తెరచి, వారి కండరాలను కర కరమని నములుతూ ఆ మొసళ్ళు మ్రింగుతుంటే వారిద్దరూ అనుభవించిన బాధ, నరకం కళ్ళారా చూసిన హాసన్ ఆలీ అనుచరులు....

"పగవాడికి కూడా ఆ నరకయాతన, అంతటి నికృష్టమైన చావు రాకూడదని" అనుకున్నారు.

ఆ భయంకరమైన దృశ్యం చూసిన వారెవరూ భవిష్యత్ లో తమ మురా రహస్యాలను పోలీసులకు చెప్పే సాహసం చేయలేరు.

హాసన్ ఆలీకి కావలసింది కూడా అదే! అందుకే తన అనుచరులందరి సమక్షంలో....అక్బర్ రీటాలను అంత క్రూరంగా శిక్షించాడు.

ఇప్పుడతడికి తమ స్మగ్లింగ్ రహస్యాలు పోలీసులకు అందజేయబడతాయనే భయం లేదు.

తనకు కాస్త అడ్డంకి అనుకునే ఇన్ స్పెక్టర్ వరుణ్ మత కల్లోలాలను అదుపు పెట్టటంలో తలమునకలుగా మునిగివున్నాడు.

ఇక....అతడికి అడ్డేముంది?

మళ్ళీ....యధావిధిగా, తన స్మగ్లింగ్ కార్యకలాపా లను, స్వేచ్ఛగా కొనసాగించడం ప్రారంభించాడు హాసన్ ఆలీ.

అయితే అక్బర్ మరణంతో అతడి సమస్య తీరి పోలేదు.

అక్బర్ బతికివున్న రోజులలో తీసుకున్న ఒక నిర్ణయం హాసన్ ఆలీ పునాదులనే కదిలించివేసింది.

అది....అక్బర్ వ్రాసిన ఉత్తరం.

అక్బర్ ప్రాణస్నేహితుడు కరమ్‌చంద్. అతడికి ఒక బ్రౌన్ కలర్ కవర్‌ను దాయమని యిచ్చాడు అక్బర్.

ప్రతి ఆదివారం అక్బర్ యే పరిస్థితులలోనైనా కరమ్‌చంద్‌ను కలిసితీరతాడు. ప్రత్యక్షంగా కలిసే అవ కాశం లేకపోతే కనీసం ఫోన్‌లోనైనా మాట్లాడు తాడు. అది వాళ్ళమధ్య ఒప్పందం.

ఆ అలవాటును తప్పే ప్రసక్తే లేదు.

వరుసగా రెండు ఆదివారాలు గనుక అక్బర్ తన మిత్రుడికి కనిపించకపోతే, ఫోన్ కూడా చేయక పోతే అక్బర్‌కు ఏదో ప్రమాదం జరిగిందన్నమాట.

'వెంటనే ఆ బ్రౌన్ కవర్‌ను ఆ కవరుమీద వ్రాయ బడ్డ ఎడ్రస్‌కు పోస్టు చేయమని' తన మిత్రుడు కరమ్ చంద్‌కు చెప్పాడు అక్బర్.

అప్పటికి రెండు వారాలుగా అక్బర్ తనను కాంటాక్ట్ చేయకపోవడంతో, తన మిత్రుని కిచ్చిన వాగ్దానాన్ని సిన్సియర్‌గా పాటించాడు కరమ్‌చంద్.

ఆ కవర్ మీద వ్రాయబడ్డ ఎడ్రస్....

"ఇన్‌స్పెక్టర్ వరుణ్ ది."

# 9

ఆచార్య సత్యభూషణ్ రంగంలోనికి దిగటంతో కాండ్లా పట్టణ పరిస్థితి చక్కబడింది.

పోలీసుల లాఠీలు చేయలేని పనిని అతని శాంతిప్రవచనాలు సాధించాయి.

కాండ్లాకు నలభయి కిలోమీటర్ల దూరంలో వుంది గాంధీగ్రామ్. స్వాతంత్ర్యోద్యమ కాలంలో గాంధీజీచే స్థాపించబడింది సేవాగ్రామ్‌గా పిలువబడే ఆ ఆశ్రమం.

ఆ ఆశ్రమ నిర్వాహకుడు ఆచార్య సత్యభూషణ్.

ఏ మత వైషమ్యాలు పూజ్య బాపూజీ ప్రాణాలను సైతం బలి తీసుకున్నాయో... ఆ మత కల్లోలాలతో కాండ్లా పట్టణం రక్తసిక్తమవుతుందని తెలిశాక అతడు చేతులు ముడుచుకుని ఉండలేకపోయాడు.

తన ఆశ్రమవాసులతో కాండ్లా బయలుదేరాడతను.

"ఈశ్వర అల్లా తేరేనాం
సబ్ సంతన్ కో కరే ప్రణామ్!
ఏసుక్రీస్తు అతి పావన నాం
సబ్ కో సన్మతి దే భగవాన్!
రఘుపతి రాఘవ రాజారామ్
పతిత పావన సీతారామ్!"

జాతిని చైతన్యవంతం చేసిన ఆ గాంధీజీ ప్రవచనాన్ని భక్తిపూరిత గళాలతో గానం చేస్తూ.... కాండ్లా పుర వీధులలో శిష్యులతో సహా పాదయాత్ర చేశాడు అతడు.

"భగవంతుడు ఒక్కడేనని. సర్వ మతములు ఆ భగవత్ సాన్నిధ్యాన్ని చేరడం కోసం ఏర్పరచబడ్డ రహదారులేనని."

ప్రజలకు బోధచేస్తూ మతవైషమ్యాలను విడనాడమని వారికి విజ్ఞప్తి చేశాడు.

అతివ అధ్వర్యంలో హిందూ దేవాలయాలను ముస్లింలు, మహమ్మదీయుల మసీదులను హిందువులు మరమ్మత్తులు చేశారు. కలిసికట్టుగా పనిచేశారు.

"హిందూ....ముస్లిమ్ భాయి భాయి" అన్న నినాదాలతో కాండ్లా పట్టణం మారుమ్రోగిపోయింది.

అలా అర్థంతరంగా మత కలహాలు ఆగిపోవటంతో గొంతులో పచ్చి వెలక్కాయ పడినట్లయింది హాసన్ అలీకి.

ఈ క్రొత్త అవరోధాన్ని ఎలా తొలగించుకోవాలా అని తీవ్రంగా ఆలోచిస్తున్నాడతడు.

అతడి దృష్టి యిప్పుడు ఆచార్య సత్యభూషణ్ పైన వుంది.

# 10

'అంత సఖ్యంగా సమైక్యంగా కలిసి మెలిసి ఒకరికొకరు సహకరించుకుంటున్న హిందూ, ముస్లింల మధ్య కొట్లాటలు ఎలా ప్రారంభమయ్యాయో!" ఇన్‌స్పెక్టర్ వరుణ్‌కు అర్థంకాలేదు.

అతడిప్పుడు క్రొత్త ఆలోచనల్లో పడ్డాడు.

'అంటే ఇవి సహజంగా యేర్పడ్డ కొట్లాటలు కావా? యెవరో తమ స్వార్థంకోసం ఈ మత కల్లోలాలను రేపివుంటారా?

ఎవరు ఎవరై వుంటారు?'

ఈ మధ్య స్మగ్లింగ్ వ్యవహారాలు ముమ్మరమయాయని అతడికి నమ్మకంగా తెలిసింది.

మతకల్లోలాలు ప్రారంభం కాకముందు కాండ్లాలో

స్మగ్లింగ్ వ్యవహారాలను తొంభయిళాతం వరకూ అతడు అరికట్టగలిగాడు.

'మళ్ళీ యిప్పుడు స్మగ్లింగ్ పుంజుకుంటుందంటే....

కేవలం అతని దృష్టిని మరల్చడానికి, తను ఈ మత కల్లోలాలను అణచడంలో నిమగ్నుడయి ఉండగా.... తమ స్మగ్లింగ్ వ్యవహారాలను చక్కబెట్టుకోవడానికి ఎవరో దుర్మార్గులు పన్నిన పన్నాగమా ఇది?

తన అనుమానమే నిజమయితే ఈ దుర్మార్గంలో ముఖ్య హస్తం హసన్ అలీది అయివుంటుంది.'

సాలోచనగా తలను పంకించాడు వరుణ్.

"హసన్ అలీ....ఇందరు అమాయకుల మానప్రాణా లను బలి తీసుకున్న నిన్ను మాత్రం నేను విడిచి పెట్టను...." ఉద్రేకంగా అనుకున్నాడతడు.

అదే సమయంలో కరమ్‌చంద్ ద్వారా పోస్టు చేయ బడ్డ అక్బర్ వ్రాసిన ఉత్తరం అతడికి అందింది.

అతడు ఆత్రంగా ఆ కవర్‌ను తెరచి ఉత్తరాన్ని పైకి తీశాడు.

లేత గులాబిరంగు లేపర్ కాగితాల పై ఎడంచేతి వైపు అక్బర్ .. పేరూ, అడ్రస్ ముద్రింపబడి ఉన్నాయి.

అతడు ఉత్తరం చదవటం ప్రారంభించాడు:

ఇన్ స్పెక్టర్ వరుణ్ గారికి,

పాకిస్తాన్ మాజీ ప్రధాని జుల్ఫికర్ అలీ భుట్టో వ్రాసిన 'ఇఫ్ ఐ యామ్ ఎసెసినేటెడ్' అన్న ఆత్మకథను చదివాక.... నా కెందుకో ఇలాంటి ఉత్తరం వ్రాయాలనిపించింది.

ఆడుగడుగునా ప్రమాదాలు పాముల్లా పొంచి

ఉండే వృత్తి మాది. ఎప్పుడు చావు వరిస్తుందో చెప్పలేని బ్రతుకు మాది.

ఏ క్షణం పోలీసులకు పట్టుబడిపోతామో! ఏ ముఠా తగాదాలలో శత్రువర్గాల తుపాకీ గుళ్ళకు ప్రాణాలు కోల్పోతామో! మాకే తెలియని స్థితి....

ఒక్కొక్కసారి, మామీద నమ్మకం నశించిన మా నాయకుడే మమ్మల్ని తుపాకీ గుళ్ళకు ఆహారంగా వేసినా వేయవచ్చు!

దిన దిన గండం నూరేళ్ళాయుష్షు అంటారే. అలా వుంటాయి మా జీవితాలు.

'ఒక వేళ, ఏ దురదృష్ట క్షణాన్నయినా నేను అర్థాంతరంగా మరణిస్తే, లేమా మా నాయకుడే నన్ను చంపేస్తే....' అన్న ఊహే ఈ ఉత్తరానికి ప్రేరేపణ.

నా నూరేళ్ళ జీవితం అలా అకస్మాత్తుగా అంతరించిపోతే నాతో పాటుగా నాలోని రహస్యాలన్నీ ఎందుకు అంతరించి పోవాలి?

నేనొక్కడిని మాత్రమే బ్రతుకుకు దూరమై, మా నాయకుడు, నా తోటి సహచరులు అంతా హాయిగా ఎందుకు బ్రతకాలి?

వారు మాత్రం ఎందుకు సుఖపడాలి?

అందుకే మా నేరాలను, మా రహస్యాలను, బట్టబయలు చేస్తున్నాను.

మా ముఠాలోని వ్యక్తుల పేర్లు, వారి ఎడ్రస్ లతో సహా యిక్కడ వ్రాస్తున్నాను. మా స్థావరాల చిరునామాలు టెలిఫోన్ నెంబర్లతో సహా

యిక్కడ పొందుపరుస్తున్నాను.

మా స్మగ్లింగ్ కోడ్స్, మా ఆచార, వ్యవహారాలూ, మేము తిరిగే ప్రదేశాలూ, మా సరకులు దాయబడే గోడౌన్లూ....అన్నింటి వివరాలూ ఈ ఉత్తరంలో వ్రాయబడ్డాయి.

నాతో పాటుగా, ఈ స్మగ్లింగ్ రాకెట్ అంతా నాశనమవ్వాలన్నది నా కోరిక.

నేను ఒక స్వార్థపరునిలాగానో, సాడిస్టులాగానో మీకు కనిపించవచ్చు.

నేను లేకపోయాక, ఈ నీతి నియమాలతో నాకు పనేమిటి? నా పిచ్చి నాకు ఆనందం.

నాతో పాటుగా నా ముఠా కూడా అంతరించబోతున్నదన్న ఆత్మతృప్తి కోసం ... ఈ ఉత్తరాన్ని వ్రాస్తున్నాను.

ఇది యెవరికి ఎడ్రస్ చేయాలా అని చాలా రోజులు ఆలోచించాను.

ఇంతలో మీరు కనిపించారు.

హసన్ ఆలీ....ఐ మీన్ మా బాస్. ఎర చూపించిన ధనానికి, అతడి పలుకుబడికి లొంగని నిజాయితీగల పోలీస్ ఆఫీసరు మీరు.

మీరే ఈ ఉత్తరాన్ని అందుకొని, దీనికి న్యాయం చేకూర్చగల సమర్థులు. ఆ నమ్మకంతోనే మీకే ఉత్తరం అందే ఏర్పాటు చేస్తున్నాను.

ఇఫ్ ఐ యామ్ ఎ సేనీ నే బెడ్
"అక్బర్".

ఆ ఉత్తరాన్నీ, అందులో వ్రాయబడ్డ స్మగ్లర్ల వివ

రాలనూ చదువుతోన్న ఇన్‌స్పెక్టర్ కళ్ళు విచిత్రంగా మెరిసాయి.

"థాంక్యూ! థాంక్యూ సోమచ్ అక్బర్" అనుకున్నాడతడు ఆనందంగా ఆ ఉత్తరాన్ని గుండెలకు హత్తుకుంటూ.

## 11

హాసన్ ఆలీ ఊడలు విస్తరించుకున్న విశాలమైన వట వృక్షం లాంటివాడు.

ఊడలను నరకకుండా మర్రిచెట్టును ఎలా కూల్చలేమో అతడి అనుచరులందరినీ అతడికి దూరం చేయకుండా హాసన్ ఆలీని కూడా యేమీ చేయలేం.

ఆ నిజం ఇన్‌స్పెక్టర్ వరుణ్‌కి బాగా తెలుసు.

అందుకే తన దగ్గరున్న, అక్బర్ ఉత్తరం సహాయంతో హాసన్ ఆలీ అనుచరులను ఒక్కొక్కరినీ చాప క్రింద నీరులా చుట్టుముట్టాడు అతడు.

పోలీస్ కమెండో దళం రంగంలోనికి దింపబడింది.

ఒక అద్భుతమైన వ్యూహంతో.... వారి రహస్య స్థావరాలూ, వారి స్మగ్లింగ్ గోడౌన్స్ అన్నీ ఒక్కరాత్రిలో ముట్టడించబడ్డాయి.

కమెండోదళాలు చేసిన మెరుపు దాడుల్లో హాసన్ ఆలీ అనుచరులంతా పోలీసుల చేతికి చిక్కారు.

అత్యంత రహస్యంగా ఈ దాడులన్నీ నిర్వహింపబడ్డాయి. చివరకు హాసన్ ఆలీకి కూడా అనుమానం రానంత రహస్యంగా.

ఇక మిగిలింది హాసన్ ఆలీ, అతడి ముఖ్య అనుచరులు యిద్దరూ అంతే!

అయితే మిగిలిన అనుచరులులా హాసన్ ఆలీపై రెయిడ్ చేయడం అంత సులువైన పనేమీ కాదు.

అతనిని నేరస్థునిగా రెడ్ హాండెడ్ గా పట్టుకొంటే గాని, చట్టరీత్యా అతడిని శిక్షించడం సాధ్యం కాదు. సంఘంలో అతడికున్న హోదా, పలుకుబడి అలాంటివి.

కాని ఎలా?

ఇన్ స్పెక్టర్ వరుణ్ ను వేధిస్తున్న ముఖ్య సమస్య అదే!

హాసన్ అలీ యొక్క అతి ముఖ్యమైన స్థావరాన్ని సర్చ్ చేస్తుండగా లభించిన ఒక అతిముఖ్య సమాచారం....అతనిని వేధిస్తున్న సమస్యకు ఒక పరిష్కారాన్ని చూపించింది.

ఆ క్షణమే....ఇన్ స్పెక్టర్ మెదడులో ఒక అద్భుతమైన వ్యూహం రూపుదిద్దుకొంది.

"యూ ఆర్ ఫినిష్డ్ హాసన్ అలీ!" అనుకున్నాడతడు ఆనందంగా.

# 12

తెల్లవారుఝాము నాలుగుగంటల వేళ.

సన్నగా కురుస్తోన్న పొగమంచులో కాండ్లా వీధులన్నీ నిర్మానుష్యంగా వున్నాయి. నగరం యింకా నిద్ర లేవలేదు.

అందమైన ఇంపాలా కారొకటి బాణంలా దూసుకొని వచ్చి ఒక సందు మొదలులో ఆగింది. కారు డోర్ తెరుచుకొని హాసన్ అలీ క్రిందకు దిగాడు. అతడి వెనుకే అతడి ముఖ్య అనుచరు లిద్దరూ రెండు బరువైన సూట్ కేస్ లతో క్రిందకు దిగారు.

వారు ముగ్గురూ చకచకా నడుచుకుంటూ ఆ ఇరుకు సందులోని ఒక చిన్న పెంకుటిల్లు ముందు ఆగారు.

కాండ్లా రేవులో కూలీనాలీ చేసుకొని జీవించే అలగా

జనం ఉండే వీధి అది.

హాసన్ ఆలీ లాంటి ఖరీదయిన మనుషులు ఆ వీధిలోకి అడుగు పెట్టడం రొఖరికైనా అనుమానం కల్గిస్తూంది. కాని, అలగా జనంగా చలామణీ అయ్యే ఆ రేవు కూలీ అంతా హాసన్ ఆలీ అనుచరులే.

అందుకే అతడంత నిస్సంకోచంగా ఆ వీధిలోనికి అడుగు పెట్టగలిగాడు.

ఆ యింటి తలుపులు మూసివున్నాయి. మునివ్రేళ్ళతో టక టప మంటూ మెల్లగా ఆ తలుపులపై తట్టాడొక అనుచరుడు.

వెంటనే ఆ తలుపులు తెరచుకున్నాయి. ఆలీకి, అతని వెనుకనున్న యిద్దరు అనుచరులకూ వంగి సలామ్ చేశాడు తలుపులు తెరచిన వ్యక్తి.

ఆలీ హుందాగా నడుచుకుంటూ లోపలకు పోయాడు. అతనిని వెన్నంటారు అతని అనుచరులు.

అది పైకి చూడటానికి చిన్న పెంకుటిల్లులా వున్నా లోపల చాలా విశాలంగా వుంది. నాలుగయిదు చిన్న చిన్న గదులున్నాయి అందులో.

వారు ఒక గదిలోనికి ప్రవేశించారు.

"వారు ఈపాటికి హోటల్ నుండి బయలుదేరి వుంటారు బాస్!" అన్నాడొక అనుచరుడు.

ఔనన్నట్లు మెల్లగా తలాడించాడు ఆలీ....ఆ గది లోని ఒక కుషన్డ్ ఛైయిర్‌లో రిలాక్సవుతూ.

"మరి సత్యభూషణ్ విషయం యేం చేశారు బాస్?" అన్నాడు యింకొక అనుచరుడు.

"సత్యభూషణ్ రేపు చనిపోబోతున్నాడు."

"బా....స్?"

ఆశ్చర్యంతో నోళ్ళు వెళ్ళబెట్టిన వారివంక చూశాడు అలీ.

"స్వాతంత్ర్యం వచ్చాక, ఇండియా, పాకిస్తాన్‌ల విభజన జరిగిన తొలిరోజులలో ఇలాగే హిందూ, ముస్లింల మధ్య మతకల్లోలాలు చెలరేగాయి.

వాటిని అరికట్టడానికి విశ్వప్రయత్నం చేశాడు గాంధి. ఏమయ్యాడతను? గాడ్సేచే కాల్చి చంప బడ్డాడు. సత్యభూషణ్ కూడా అంతే!

రేపు సాయంత్రం పబ్లిక్ గ్రౌండ్స్‌లో బ్రహ్మాండ మయిన బహిరంగసభ జరగబోతుంది. ఆచార్య సత్య భూషణ్....హిందూ, ముస్లింల సమైక్యత గురించి అక్కడ ఉపన్యసించబోతున్నాడు.

సభ జరుగుతూ వుండగా ప్రేక్షకుల మధ్య కూర్చున్న మన అనుచరులు చిన్న గలాటా సృష్టిస్తారు. అందరి దృష్టిని వారివంకకు మళ్ళించుకుంటారు.

అదే సమయంలో....

మరో దిక్కునుండి సైలెన్సర్ అమర్చిన రివాల్వర్‌తో సిద్ధంగావున్న మన అనుచరుడు ఆచార్య సత్యభూషణ్‌ను కాల్చి చంపుతాడు.

హాహాకారాలతో ప్రజలంతా గగ్గోలెత్తే సమయంలో మన అనుచరులు చల్లగా ఆ ప్రదేశం నుండి బయటకు జారుకుంటారు.

ఆచార్యులను హత్య చేసింది ఒక ముస్లిం అన్న గాలి వార్తను మెల్లగా ప్రజలలోనికి ప్రచారం చేస్తాం.

ఇక....అరిపోబోతోన్న నిప్పు రాజుకుంటుంది. మళ్ళీ మతకలహాలు మొదలవుతాయి.

ప్రజలూ, పోలీసులూ ఆ మతకలహాలలో కొట్టుకు

పోతూంటే... మనమట్టుకు మనం హాయిగా, ప్రశాంతంగా మన స్మగ్లింగ్ వ్యవహారాలను చక్కబెట్టుకుంటాం!"

ఆలీ మాటలు వింటూ అతడి వంక ఆరాధనగా చూశారు అతడి ఇద్దరు అనుచరులూ.

వారు యిలా మాట్లాడుకొంటూ ఉన్న సమయంలో....

ఆ సందు మొదలులో మరో టాక్సీ ఆగింది. అందులో నుండి ఇద్దరు అరబ్ షేక్‌లు క్రిందకు దిగారు. నేరుగా ఆ పెంకుటింటి ముందుకు వచ్చి, మునివ్రేళ్ళతో తలుపుపై శబ్దం చేశారు.

ఓరగా తలుపులను తెరచిన అనుచరుడికి ఒక విజిటింగ్ కార్డు నిచ్చారు వారు.

అది మామూలు విజిటింగ్ కార్డు కాదు. తెల్లని వెండి బిళ్ళమీద హాసన్ ఆలీ అన్న బంగారు అక్షరాలు పూత పూయబడి వున్నాయి.

ఆ విజిటింగ్ కార్డు వంక సంతృప్తిగా చూశాడు ఆ అనుచరుడు.

తనను ఆ రహస్యస్థలంలో కలుసుకోబోయే వారికి హాసన్ ఆలీ యిచ్చే విజిటింగ్ కార్డు అది. ఆ యింటిలోకి క్రొత్తవారు ప్రవేశించడానికి అనుమతి పత్రంలాంటిదిఅది.

ఆ అరబ్ షేక్‌లను తీసుకొని అతడు హాసన్ ఆలీ వున్న గదివైపు నడిచాడు. వారిని గదిలోనికి సాదరంగా ఆహ్వానించాడు ఆలీ.

వారు తాము తెచ్చిన సూట్ కేసులను తెరచి ఆలీ ముందు ఉంచారు. పచ్చని బంగారు బిస్కట్లు మిల మిల మెరుస్తూ ఆలీ కన్నులను చెదరగొట్టాయి.

ఆ బంగారం వంక నవ్వుతూ చూశాడతడు.

అతడు చేసైగ చేయగానే అతడి అనుచరులిద్దరూ తమదగ్గరున్న రెండు సూట్ కేస్ లనూ తెరచి ఆ షేక్ ల ముందు పెట్టారు.

"పపావర్ సామ్నిఫెరమ్ నుండి ఉత్పత్తి అయిన అసలు సిసలైన హెరాయిన్ ....ఇది...."

ఆ సూట్ కేస్ లలో నీట్ గా పేర్చబడ్డ హెరాయిన్ పేకట్లవంక గర్వంగా చూస్తూ అన్నాడు అలీ.

ఆ షేక్ లు అతడివంక మెచ్చుకోలుగా చూశారు. ఆ సూట్ కేసులను క్లోజ్ చేసి చేతులలోనికి తీసుకున్నారు.

"ఓకే అలీసాబ్! వస్తాం. వచ్చేనెల మళ్ళీ మేం వచ్చేసరికి సరుకు సిద్ధంగా ఉంచండి" అన్నాడొక షేక్ అలీతో కరచాలనం చేస్తూ.

వారు ముందుకు అడుగు వేశారు. వారికి వీడ్కోలు నివ్వడానికి అలీ కూడా ముందుకు నడిచాడు.

అంతలో....

మూసివున్న తలుపులు భళ్ళున తెరుచుకున్నాయి. చేతిలో రివాల్వర్ తో కాల యముడిలా ఆ గదిలోనికి ప్రవేశించాడు ఇన్ స్పెక్టర్ వరుణ్.

అతని వెనుకే బిల బిలమంటూ నలుగురు పోలీసు ఆఫీసర్లు ఆ గదిలోనికి చొచ్చుకొని వచ్చారు. వారి చేతులలో రివాల్వర్స్ ఆ గదిలోనివారికి గురి పెట్టబడి వున్నాయి.

ఈ హఠాత్పరిణామానికి హసన్ అలీతో సహా ఆ గదిలోని వారంతా తెల్లబోయారు.

"ఇక నీవు తప్పించుకోలేవు అలీ. ఐయామ్ సారీ

హసస్....అలీ కదూ!"

ఇన్‌స్పెక్టర్ వంక హేళనగా చూస్తూ నవ్వాడు అలీ.

"కోర్టులో నా నేరాన్ని నిరూపించగలవా మిస్టర్ వరుణ్? ఈ స్మగ్లింగ్ గూడ్స్ అన్నింటినీ యెక్కడో సీజ్ చేసి, నామీద వ్యక్తిగతమైన కక్షతో నామీద ఈ నేరాన్ని మోపారంటాను. అప్పుడు యే సాక్ష్యంతో నన్ను దోషిగా నిలబెడతారు?"

"నాకు తెలుసు అలీ. నీవు అంత మేధావివే. కాని, నీకు తెలియని నిజాలు కొన్ని విను:

ఈ గదిలో మీరు మాట్లాడుకున్నదంతా టేప్ రికార్డర్‌లో రికార్డు చేయబడింది.

ఈ గదిపైన గల వెంటిలేటర్ ద్వారా మీ రీ గదిలో ప్రవేశించినప్పటి నుండీ జరిగిన వ్యవహారం అంతా వీడియో కమేరాతో షూట్ చేయబడింది.

ఇక ప్రక్కగదిలో కూర్చుని, నీ అసలు స్వరూపాన్ని స్వయంగా చూసిన ఆ ముగ్గురు వ్యక్తులవంకా ఒక్కసారి చూడు."

గుమ్మంవైపు తర్జని చూపిస్తూ అన్నాడు వరుణ్.

గుమ్మంవద్ద నిలబడిన కాండానగర్ మేయర్, మేజిస్ట్రేట్, కమీషనర్ ఆఫ్ పోలీసులను, వారి వెనుక వీడియో కమేరా, టేప్ రికార్డర్‌లు పట్టుకొని నిలబడ్డ పోలీసు ఆఫీసర్లను చూసేసరికి నిశ్చేష్టుడై పోయాడు అలీ.

"నీ స్థావరాలూ, గోడౌన్లూ అన్నీ మా స్వాధీనంలోకి

వచ్చాయి. నీ అనుచరులంతా అరెస్టు చేయబడ్డారు. నీ కోసం నీ ప్రాకారంలో నే మాటు వేశాం.

ఈ క్షణం నీవు ఏకాకివి.

యూ ఆర్ ఫినిష్డ్ అలీ!”

వరుణ్ గొంతు కఠినంగా పలికింది.

అయితే హాసన్ అలీ పంచేంద్రియాలు అప్పటికే పని చేయడం మానేశాయి.

—:అ యి పో యిం ది:—

# వజ్రాల గనులు

## భీమవరపు పురుషోత్తం

విచిత్రమైన శబ్దాలతో నిండిపోయి వుంది ఆ ప్రాంత మంతా!

గాలి వేగంగా వీస్తూంది. అక్కడ స్థిరంగా వున్న ఒక బోర్డు 'ఇండియన్ సదరన్ డైమండ్స్ ఇన్వెస్టిగేషన్ సెంటర్' అక్షరాల్ని స్పష్టంగా చూపుతోంది!

కొండప్రాంతం అదంతా! బోర్డుకి బాగా వెనగ్గా విశాలమైన పర్వతం కొద్దిగా భూమిలోకి క్రుంగిపోయినట్టు కనిపిస్తూంది. నిజానికి అది పూర్తిగా రాతిపర్వతం కాదు. చాలా భాగం నల్లమట్టి కలసివుంది. అందులో వజ్రాల కోసం ప్రభుత్వం త్రవ్వకాలు సాగిస్తున్నది.

బోర్డుకి ఎదురుగా వున్న మైదానంలో చింతపిక్క రంగు వేన్ ఆగింది. ఎక్కడినుండో వచ్చి బిల బిల మంటూ అందులో నుండి పాతికమంది కార్మికులు దిగారు. అంతా కొద్ది ప్రక్కగా సెర్చింగ్ గదివైపు నడిచారు. నలుగురు గార్డులు సెర్చి చేశారు వాళ్ళందరినీ ఫార్మా

లిటీగా!

సర్వింగ్ వేళాప్ కి వున్న గ్లాస్ డోర్స్ వెనుక జరిగేది తేలిగ్గా చూస్తూ, ఇన్ స్పెక్టర్ రఘువీర్ తో మాట్లాడు తున్నాడు ఇన్ ఫార్మర్ జగదీష్.

"ఇన్ స్పెక్టర్! పదిహేనవ తారీఖున నేను ప్రోగ్రస్ అందజేయాలి. ఈ రెండురోజులు మీరు కాస్త ప్రొటెక్షన్ ఇచ్చారంటే నాకే ప్రాబ్లమ్ వుండదు" అన్నాడు జగదీష్.

ఇన్ స్పెక్టర్ రఘువీర్ తాపీగా నవ్వి చెప్పాడు "జగదీష్, మేమెప్పుడూ ఎలెర్ట్ గానే వుంటాం! సరేనా!"

జగదీష్ తృప్తిగా నిట్టూర్చాడు.

సెర్చి పూర్తవడంతో కార్మికులు పక్కగదిలో వున్న తమ యూనిఫాం దుస్తులు, సామాన్లు ధరించి వేళాప్ లో నుండి బయటికి వచ్చారు. అక్కడ మరో చెకింగ్ పోస్టు ఉంది! నలుగురు గార్డులు చూస్తూన్నారు. కార్మికులు దగ్గరవ రాగానే వాళ్ళు, ఒక ఆకారంలో అమర్చబడిన నాలుగు ఊచలను అడ్డు తొలగించారు.

కార్మికులు నల్లగా కనిపిస్తూన్న నిలువెత్తు గుహలాంటి మార్గంలోనికి ప్రవేశించారు. ఆ పర్వత ప్రాంతానికి, అలాంటివి మొత్తం ఐదు గుహలు యేర్పాటు చేసింది డిపార్టుమెంట్. మూడు గుహల్లోపల అప్పటికే పని ప్రారంభమైంది. ఆ శబ్దాలు బయటికి వినబడుతున్నాయి. అక్కడ ఒక దీపం వెలుగుతోంది! రాతికి బిగించబడిన చెక్కలపై వున్న స్విచ్ లు నొక్కారు.

చీకటిలో రెండు లైట్లు వెలిగాయి మార్గంగా! అవి అటువైపు ఫోకస్ చేయబడి వుండడంవల్ల ఆ ప్రదేశ

మంతా వెలుగుతో నిండిపోయింది. నల్లటి గోడలు మొన దేలిన అంచులవద్ద తెల్లగా మెరుస్తున్నాయి.

కార్మికులు లోపలికి నడిచారు. మొత్తం ఎనిమిది మార్గాలుగా చీలిపోయి వుంది అక్కడ సొరంగం. రెండు మార్గాలు మేకులు కొట్టబడిన పొడవాటి చెక్కలతో మూసివేయబడి వున్నాయి. అక్కడ త్రవ్వకాలు జరపడంవల్ల ఫలితంలేదని ఇంజనీర్లు ధృవపరిస్తే, వాటిని అలాగే సీల్ చేసేస్తారు.

మిగతా ఆరుమార్గాలలోనికి కార్మికులు విడిపోయారు. కుడివైపు చివరి నుండి రెండోమార్గంలోనికి ఐదుగురు కార్మికులు ప్రవేశించారు. అక్కడ అమర్చబడిన స్విచ్ నొక్కడంతో మార్గాన్ని చూపుతూ పైన 'రూఫ్'లో వున్న లైట్ వెలిగింది. చాలావరకూ వుంది మార్గం.

ఆర్కియాలజిస్టుల వివరాల ప్రకారం, నిపుణులు డైమండ్స్ లభించగలవని అంచనా వేసిన ప్రదేశాలను సర్కిల్ చేస్తుంది డిపార్టుమెంట్. తర్వాత ఆ ప్రాంతంలో మట్టిని లేదా రాతిమట్టిని స్క్రూయింగ్ జరిపిస్తారు. ఈ స్క్రూయింగ్ ద్వారానే దాదాపు రాతిలో కలిసిపోయిన డైమండ్స్‌ని కార్మికులు వెలికి తీస్తారు.

తర్వాత వాటిని శుద్ధిచేసి ప్యూర్‌గా వున్న వజ్రాన్ని బయటికి తీయడం మరో పని!

ముందు త్రవ్వకాల ద్వారా తొలగించివేసిన మట్టిని రియాలైజేషన్ జరిపిస్తారు. ఈ ప్రక్రియ నుండి కూడా వజ్రాలు లభించడానికి ఆస్కారం వుంది. కాని అది బాగా అరుదు.

కార్మికులు ఐదుగురూ ఉదయం యెవరెక్కడ పని

చేశారో ఆ యా చోట్లకు విడిపోయారు!!

ఎడం మణికట్టు కున్న హేండిల్ కి బిగించబడిన స్క్రూని పొజిషన్ లోకి అమర్చి దానికి అడుగున నలుపలకల ఆకారంలో ఉన్న బ్యాటరీ కనెక్షన్ దగ్గర చిన్న బటన్ నొక్కారు!

స్క్రూ జోరీగల గుంపు చేస్తున్న రొద లాంటి శబ్దంతో ఆన్ అయింది. దానికి ముందున్న పదునైన రోల్ ఊహించనంత వేగంగా తిరుగుతోంది. ఎడం చేతుల్లో ఉన్న బ్రష్ లతో గోడ అంచుల్ని రబ్ చేస్తూ, స్క్రూని ఆపరేట్ చేస్తున్నారు కార్మికులు. స్క్రూ రోల్ గోడను తాకగానే నింపాదిగా లోపలికి తొలుస్తూ చిన్న పెచ్చులు క్రిందికి రాలుస్తోంది!

స్క్రూకి మెషీన్ కి మధ్యలో కార్మికుడికి కనిపించేటట్టు వున్న గ్లాస్ లో రెండు లైట్లలో, పచ్చలైటు స్క్రూ ఆన్ లో ఉన్నప్పటి నుండి వెలుగుతోంది. ఎర్రలైటు వెలిగితే స్క్రూకి తగులుతున్న మెటల్ మారినట్టు లెక్క! అది నిశ్చయంగా వజ్రాలు కలిసున్న మెటల్ కానక్కరలేదు. సాధారణంగా తగిలే మెటల్ కాకుండా యే కొద్దిపాటి తేడా వున్న మరో మెటల్ అయినప్పుడు తప్పనిసరిగా ఎర్రలైటు వెలుగుతూంది!!

ముందే కొంతదూరం తవ్వి వుంచబడిన సొరంగం కాంతి కనిపించినంత మేరకు మార్గం కనిపిస్తూ ఆపైన నల్లగా చీకటి అలుముకొన్నట్టుంది! అందరికీ దూరంగా వున్న కార్మికుడు బ్రష్ తో తుడుస్తూ జాగ్రత్తగా స్క్రూయింగ్ చేస్తున్నాడు!!

శిరస్సును కప్పేస్తూ, కళ్ళదగ్గర పల్చటి పోలిథిన్ పేపర్ గ్లాస్ తో ఒకరకమైన క్లాత్ ముసుగులా ఉండడం

వల్ల స్ప్రేయింగ్ వల్ల రాలుతున్న మట్టిపొడి అతడిని యేమీ యిబ్బంది పెట్టకుండా మీదపడి క్రిందికి రాలి పోతోంది.

కాసేపు గడిచింది. బ్రషింగ్ చేద్దామని ఎడమచేయి ముందుకి కదిపిన అతడు ఆశ్చర్యపోయాడు! ఎర్రలైటు వెలుగుతోంది!?

ఒక్కొక్క కార్మికుడికి మూడు నాలుగు నెలలకు గానీ ఏవరేజ్‌గా ఎర్రలైటు వెలగదు! స్ప్రేని కాస్త ముందుకి వత్తేడతడు. లైట్ వెలుగుతూనే వుంది. మెటల్ మారిందని అతనికి నిర్ధారణ అయింది.

పేపర్ గ్లాస్ వెనుకవున్న తన కళ్ళను తేలిగ్గా అటూ యిటూ తిప్పాడు. మిగతా నలుగురూ దీక్షగా పని చేసుకుపోతున్నారు.

అతడు స్ప్రే ఆఫ్ చేసి నాలుగు అడుగులు ముందుకు వేసి మళ్ళీ అక్కడ ప్రారంభించాడు!! ఈసారి పచ్చ లైటు మాత్రమే వెలుగుతోంది! ఏమీ తెలీనట్టు అతడు అక్కడే బ్రషింగ్ చేస్తూ తన పని తను చేసుకొంటూ పోసాగాడు.

ఆ సమయంలో అతడి చర్యను నలుగురిలో యే ఒక్క కార్మికుడు గమనించినా గార్డుకి రిపోర్టు చేయడం తర్వాత అతడిని కస్టడీలోకి తీసుకోవడం జరిగేది!!

## 2

సాయంత్రం ఐదు దాటింది—

ఐ.యస్.డి.ఐ.సి. కాలనీలో నుండి 187 నెంబరు గల యింటిలో నుండి పాల్ బయటికి వచ్చాడు మోటారు సైకిలుమీద. ఉదయం కావాలని ఎర్రదీపాన్ని నిర్లక్ష్యం చేసిన కార్మికుడు అతడే!

కాలనీ దాటి మెయిన్ రోడ్ పై మూడు కిలోమీటర్ల దూరం వెళ్ళి, ఎడంవైపుకి దిగి చిన్న బాటగుండా ప్రయాణించాడు!

దాదాపు అరగంట తర్వాత ఊరికి దూరంగా విసిరి వేసినట్టున్న ఒక ఇంటిలో....

"పాల్! 'బి కేవ్'లో రాతిపొర అంతా ఫవర్ ఫుల్ గా వుందని ఈ రిపోర్టు ముందే చెప్పింది మనకు!" అన్నాడు పల్చటి గడ్డంవున్న వ్యక్తి, చేతిలో కాగితాన్ని టేబుల్ మీద వుంచుతూ. అతడి పేరు అరవిందం. మిగతా ముగ్గురికీ నాయకుడు: అతడు టేబుల్ మీద వుంచిన కాగితాన్ని పాల్ అందుకున్నాడు!

"అరవిందం సాబ్! శ్రమకు తగిన ఫలితం దక్కింది. ప్రాణాలకు తెగించి మన రాక్ సన్ తీసుకొని వచ్చిన ఆ కాగితంవల్ల వజ్రాలు యే ప్రాంతంలో దొరుకుతాయో తెలియడం ఒక అదృష్టమయితే, ఆ ప్రాంతంలో పని చేసే పాల్ మనతో చేయి కలపడం అసలైన అదృష్టం" అన్నాడు జనార్ధన్ వినయంగా విస్కీ తాగుతూ.

అతడి మాటలు విని రాక్ సన్ నవ్వి ఊరుకున్నాడు అదోలా. అతడు మితభాషి. మనిషి మాత్రం ఎత్తుగా కండలు తిరిగి చాలా దృఢంగా వుంటాడు.

మళ్ళీ చెప్పాడు జనార్ధన్ "పాల్ సాబ్! మీరు మాత్రం యేం బెంగపెట్టుకోవద్దు. మేం చెప్పినట్టు చేయండి చాలు—వజ్రాలు మన సొంతమవుతాయి. మీకే ప్రమాదమూ వుండదు!"

అరవిందం పాల్ వంక కొద్ది క్షణాలు పరీక్షగా చూశాడు. ఇంతకు ముందులా భయంగా లేదు పాల్ ముఖం. రిలీఫ్ గా నిట్టూర్చాడు. ముఖాన్ని గంభీరంగా

మార్చి చెప్పాడు అరవిందం "ఇప్పుడు నెక్ట్స్ ప్రొసీజర్ చెబుతాను!"

జనార్ధన్, పాల్ ఆసక్తిగా చూశారు. రాక్సన్ మామూలుగానే నవ్వాడు.

చెప్పాడు అరవిందం!?

# 3

రోడ్డు పై మోటారుసైకిల్ పై పోతున్నాడు పాల్. వెలుతురు చాలావరకూ తగ్గిపోయి మసగ్గా వుంది.

మోటారుసైకిలు శబ్దంలో తేడా రావడంతో స్లో చేశాడు. క్రమంగా ఆగిపోయిందది! క్రిందకు దిగి స్టాండు వేసి ప్రయత్నించాడు. లాభం లేకపోయింది.

స్టాండ్ తీసి నడిపించుకుంటూ వెళ్ళసాగాడు. దూరంగా సిటీలో లైట్లు వెలగడం అతడికి కనిపిస్తోంది. నిర్మానుష్యంగా వున్న ఆ రోడ్ పై కొద్దిదూరం నడవగానే అతడికి కాళ్ళు పీక్కుపోసాగాయి. అప్పుడప్పుడూ వెనక్కి రోడ్ మీదికి చూస్తూ నడిపిస్తున్నాడు నిస్సహాయంగా.

ఇంతలో దూరంగా ఒక అంబాసిడర్ రావడం గమనించి, గబగబా మోటారుసైకిల్ కు స్టాండ్ వేసి, రెండడుగులు ముందుకి నడిచి చేయి ఊపసాగాడు. కారు అతడిని సమీపించింది! దాటుకొంటూ వెళ్ళి ఆగింది నెమ్మదిగా కారు.

పాల్ పరుగున కారుదగ్గరికి వెళ్ళి చెప్పాడు. వెంటనే మళ్ళీ తిరిగివచ్చాడు! మోటార్ సైకిల్ తీసుకొని కారు దగ్గరికి వెళ్ళి డిక్కీ తెరిచి దాన్ని అందులో సద్దాడు. ఫ్రంట్ డోర్ తెరుచుకొని కూర్చున్నాడు. కారులో ఒకే వ్యక్తి వున్నాడు డ్రైవ్ చేస్తూ!!

కారు వేగం పుంజుకొని సాగిపోతోంది.

"మిమ్మల్ని యెక్కడ దింపాలి?" అడిగాడు డ్రైవ్ చేస్తున్న వ్యక్తి.

"ఐ.యస్.డి.ఐ.సి. కాలనీ దగ్గర" నెమ్మదిగా చెప్పాడు పాల్, ఆ వ్యక్తి వంక చూస్తూ.

కనుబొమలు దగ్గరగా సాగగా ఆ వ్యక్తి పాల్ వంక చూసి అడిగాడు "డిపార్టుమెంట్‌లో పని చేస్తున్నారా మీరు!?"

"అవును!"

"నేనూ డిపార్టుమెంట్‌కు సంబంధించిన ఉద్యోగి నే!" చెప్పాడు అతను.

పాల్ త తరపడ్డాడు కొద్దిగా!

"మీరేం పని చేస్తున్నారు?...." అడిగాడా వ్యక్తి ఆసక్తిగా.

అదే మరొకరు అడిగివుంటే తప్పకుండా అబద్ధం చెప్పివుండేవాడు పాల్. ప్రస్తుతం అతడు విద్రోహులతో చేయి కలపడంవల్ల, తన పేరూ ఉద్యోగం యెవరికీ తెలియకుండా వీలయినంత జాగ్రత్త పడడం మంచిదని అతడికి తెలుసు. కానీ, ఆ వ్యక్తి తనుకూడా డిపార్టుమెంటులో ఉద్యోగినని అంటున్నాడు! అలాంటి వాడితో అబద్ధం చెబితే, తర్వాత అతడది తెలుసుకొంటే మొదటికే మోసం వస్తుంది.

"స్కాన్నింగ్ మన్‌ని!" చెప్పాడు పాల్ చేసేది లేక.

"ఏ 'వే'లో అడిగాడా వ్యక్తి.

"ఫస్ట్ వే."

"మీ పేరు?"

అనీజీగా కదిలి చెప్పాడు పాల్, తన పేరు.

తర్వాత ఆ వ్యక్తి డ్రైవింగ్‌లో నిమగ్నమయ్యాడు. కాసేపాగి హెడ్ లైట్స్ వెలిగించాడు, చీకట్లు ముసురుకోవడం గమనించి!

పాల్ జేబులో చెయ్యిపెట్టి సిగరెట్ పాకెట్ తీశాడు!

ఒక సిగరెట్ తీసి వెలిగించుకొన్నాడు. పొగ విండోలో నుండి ఊదుతూ ఉండిపోయాడు.

కాలనీ సమీపించాక కారు ఆపాడు ఆ వ్యక్తి.

"థాంక్స్!" అని చెప్పి పాల్ కారు దిగాడు. డిక్కీలో నుండి వాహనం తీసుకొని, నడిపించుకుంటూ కొద్దిదూరంలో కనిపిస్తూన్న కాలనీవైపు వెళ్ళిపోయాడు.

ఆ వ్యక్తి మౌనంగా కారు స్టార్టుచేసి పోనిచ్చాడు! చాలాసేపటి తర్వాత, సిటీలో ఒక ఇంటిముందు ఆగింది కారు. లైట్ల వెలుతురులో కనిపిస్తూన్న చిన్న స్థలంలో కారును ఆపి, డోర్ తెరుచుకొని దిగబోతూ ఆగిపోయాడు క్రిందికి చూస్తూ!!?

ఏదో మడతపెట్టబడిన కాగితం పడింది క్రింద? చటుక్కున అతడికి తను లిఫ్టు యిచ్చిన మనిషి గుర్తొచ్చాడు! ఆ కాగితం అతనే చూడకుండా పడేసుకున్నాడని గ్రహించి వంగి దాన్ని తీసుకొన్నాడు!

అతడు జగదీష్!!

## 4

బెల్ నొక్కాడు జగదీష్.

తలుపు తెర్చిన పరిమళ నవ్వింది అతడిని చూసి.

జగదీష్ నవ్వుతూ లోపలకు అడుగుపెట్టి మేడపైకి వెళ్ళి, ఆఫీస్ రూమ్ తలుపు తెర్చుకొని లోపలికి వెళ్ళాడు.

స్విచ్చులు నొక్కాడు. తెల్లటి కాంతితో గదిని నింపేస్తూ వెలిగింది. ఎదురుగా గోడకు తెల్లగా గుండ్రంగా ఉన్న దీపం. ఫాన్ స్పీడందుకుంది.

నీట్ గా సర్దినట్టు కనిపిస్తూన్న ఆ రూమ్‌లో ఫర్నిచర్స్ యెక్కువగా వుండడంతో, ఒకటి రెండుచోట్ల చిందర వందరగా వున్నట్టుంది! చేతిలో కాగితం సన్నటి గోధుమ రంగు చారలతో వున్న సన్‌మైకా టేబుల్ మీద వుంచాడు. కిటికీ గ్లాస్ డోర్స్ బార్లా తెరిచి షర్టు విప్పేసి, లూజుగా వున్న పల్చటి చారల జుబ్బా ధరించి మెత్తటి కుషన్ చైర్లో రిలీఫ్ గా కూర్చున్నాడు.

చల్లగాలి మందంగా వీచడంతో హాయిగా కళ్ళు మూసుకున్నాడు, కొద్దిసేపు.

“టీ తీసుకురానా!” సన్నని స్వరం వినిపించింది.

జగదీష్ కళ్ళు తెరిచి, పరిమళ వంక చూసి “ఓ.కె” అన్నాడు చురుగ్గా. ఆమె వెళ్ళిపోయింది.

ఎదురుగా వున్న కాగితం అందుకొని క్యాజువల్ గా మడతలు విప్పాడు. ఏవో టైప్ చేసిన అక్షరాలు సంతకాలు, ముద్రలూ కనిపించడంతో, వాటిమీదికి దృష్టిని పోనిచ్చాడు—ఫోన్ మ్రోగింది ఇంతలో!

కాగితాన్ని మడతపెట్టేసి, టేబుల్ మీద మూలగా వున్న బుక్స్ మధ్య వుంచాడు!! ఫోన్ అందుకొని “హలో, జగదీష్ హియర్?” అన్నాడు.

“జగదీష్, నేను ఇన్‌స్పెక్టర్ రఘువీర్‌ను మాట్లాడుతున్నాను!” అవతలినుండి వినిపించింది.

ముందుకు వంగి అడిగాడు జగదీష్ “ఏమయింది?”

“నైట్ షిఫ్టు జరుగుతూంది! ఖర్డువేలో పద్ధెనిమిది కిలోల బరువుగల మెటల్ బయటికి తీసారు. డైమండ్స్

వెలుపలికి తీయడానికి పంపిస్తున్నారు. గార్డ్స్ లేట్ వరకూ వస్తారు. తర్వాత లేట్ దగ్గర కొంత మా ప్రొటెక్షన్ తీసుకుంటున్నారు!"

"థాంక్యూ! మరి ఇతర 'వే'ల్లో యేమీ న్యూస్ లేదా? ఇన్‌స్పెక్టర్, ఐ. యస్. డి. ఐ. సి. లెక్కల ప్రకారం నిన్నటివరకూ జరిగిన డ్రాయింగ్‌లో రాతి పొర పోతుంది. ఆపైన డ్రాయింగ్ జరిగే మెటల్‌లో రెండుచోట్ల మొత్తం యాభై కిలోల వరకూ మెటల్ బయటపడాలి!?" చెప్పాడు. పరిమళ ట్రేలో బిస్కట్స్ టీ, తీసుకొని వచ్చి టేబుల్ పై వుంచింది.

అవతలినుండి రఘువీర్ యేమీ మాట్లాడలేదు.

రిసీవర్ పెట్టేశాడు జగదీష్. చిరుచెమటలు పట్టి వున్న అతడి ముఖాన్ని చూస్తూ అడిగింది పరిమళ, "వాట్ హేపండ్ డియర్?"

ట్రే ముందుకు లాక్కొని బిస్కట్ ఒకటి తీసుకుని తిన్నాడు నెమ్మదిగా, ఆమెను చూస్తూ. టీ మగ్ అందు కొని కొద్దిగా సిప్ చేసి చెప్పాడు, "డిపార్టుమెంట్ ఇచ్చిన డిటైల్స్‌లో యేదో తేడా వచ్చినట్టు అనుమా నంగా వుంది!?"

అది విని "పాసి వెరిఫికేషన్ రిపోర్టు టైప్ చేసి పంపించనా?" అడిగింది పరిమళ.

"వద్దు. రేపుకూడా చూద్దాం. ఫలితం లేకపోతే నేనే చీఫ్‌తో కన్సల్టు చేస్తాను. నా అభిప్రాయం ప్రకారం సాధారణంగా డిపార్టుమెంటు డిటైల్స్‌లో యే విధమైన పొరపాటు జరగడానికి ఆస్కారంలేదు!" చెప్పాడు జగదీష్ టీ సిప్ చేస్తూ.

"ఓ.కె!" అని నిష్క్రమించింది పరిమళ. ఆమె

అతడి భార్యే కాదు, పి.యే. కూడా.

టీ అయిపోయి పొడి పెదాలకు తగలడంతో మగ్ ను మెల్లగా టేబుల్ మీద వుంచాడు. అతడి తల వేడెక్కి పోతోంది! డిటైల్స్ లో పొరపాటు జరగడం అసాధ్యం! ఒకవేళ ఆ పొరపాటు ఇక్కడే వుంటే?! లక్షల విలువ గల వజ్రాలు యేమయ్యాయో ఐ.యస్.డి.ఐ.సి.కి తను ఒక ఇన్ ఫార్మర్ గా తగిన సంజాయిషీ ఇవ్వవలసి వుంటుంది.

వ్యవహారం అంతదాకా పోదని అతడు సరిపెట్టు కుంటున్నా అతడి మనసు మాత్రం కీడునే శంకిస్తూంది. ఏం జరగబోతుందో అతడికి అర్థం కావడంలేదు యెంత ఆలోచించినా?!?

# 5

"రెండవసారి రాత్రి పార తొలగించాలా?!" కళ్ళ నిండా ఆశ్చర్యాన్ని నింపుకొని ఎదుటి వ్యక్తి కంక చిత్రంగా చూస్తూ అడిగాడు ఐ.యస్.డి ఐ.సి. చీఫ్. అతడి చేతిలో చేతివ్రాతతో యేదో వ్రాసి వున్న పొడు గాటి కాగితం వుంది.

"ఎస్ సర్!" వినయంగా చెప్పాడు పాల్.

చీఫ్ యెదురుగా చిన్న కుర్చీలో కూర్చుని వున్నా డతడు.

అతడి పే, నెంబరు, రెసెన్సు మరోసారి పరిశీలించాడు చీఫ్.

అది ఐ.యస్.డి.ఐ.సి. చీఫ్ ఆఫీసరు కార్యాలయం. త్రవ్వకాలు జరిగే ప్రాంతానికి రెండు కిలోమీటర్ల దూరంలో వుందది.

మళ్ళీ ఓసారి కాగితాన్ని చదివాడు చీఫ్. ఫస్టువేలో

వున్న ఆరు కేవ్స్‌లోనూ 'బి' కేవ్‌లో వట్టి రాతిపొర శాతం ఎక్కువగా వుండడంవల్ల, డిపార్టుమెంట్ నిపుణులద్వారా అక్కడ ఒక అడుగు మందం పొర కొట్టించివేయాలని, కార్మికునిగా పాల్ దాఖలుచేసిన మెన్సన్ పేపరు అది!

డిపార్టుమెంటులో పనిచేసే ప్రతి కార్మికునికి అలాంటి పేపరు పెట్టటానికి హక్కులున్నాయి. తగిన కారణాల్ని చూపుతూ కార్మికుడు దాఖలుచేసిన 'మెన్సన్'ను స్వీకరించి తగిన రీతిన ఆ మెన్సన్ పాటించడం అక్కడి అధికార్ల విధి!

పేపర్లో పాల్ సూచించిన కాజుల్ని కొట్టివేయలేక పోతున్నాడు చీఫ్. మొత్తం రెండు కాజులవి!

1. ఫస్టు వేలో, 'బి' కేవ్స్‌లో గత తొమ్మిది నెలలుగా యేవిధమైన న్యూస్ (డైమండ్స్ వున్న మెటల్ లభించడాన్ని న్యూస్ అంటారు) వెలువడలేదు.
2. డిపార్టుమెంట్ నిపుణులు ఫస్టు వేను తనిఖీచేసిన పిదప, మొత్తం ఎనిమిది కేవ్స్‌లలో, రెండు కేవ్స్‌లలో ఇక 'మెటల్' లభించే అవకాశం లేదని నిర్ధారించాక, ఇక వాటిని మూసివేయ వచ్చని సలహా యిచ్చారు. (డిపార్టుమెంట్ అది అమలు జరిపింది కూడా!)

దాదాపు ఫస్టు వేలో కార్మికులంతా పాల్ మెన్సన్ సమంజసంగా వుండడంవలన, తమ అభిప్రాయం కూడా అదేనంటూ సంతకాలు చేశారు!

"కాజులు ఓకే" అన్నాడు చీఫ్, కాగితంపై పేపర్ వెయిట్ పెట్టి, మెత్తటి ఈజీచైర్‌లో బరువుగా వెనక్కి

వాలుతూ.

ముఖంలోనికి తన్నుకువస్తూన్న ఆనందాన్ని జాగ్రత్తగా నిగ్రహించుకుంటూ, "థాంక్యూ సర్!" అన్నాడు పాల్. ఎక్కువగా మాట్లాడదల్చుకోలేదు అతడు.

నాలుగు క్షణాలాగి చీఫ్ ముందుకు వంగి పెన్ పాడ్‌లో నుండి ఆకుపచ్చరంగు సిరా గల పెన్ తీసి, మెస్సేన్ పేపరు క్రింద సంతకం చేసి దానిపై ఆఫీసు డిజిగ్నేషన్ ముద్ర వేసి చెప్పాడు. "ఇవాళ ఈవినింగ్ డిస్పాచ్‌లో దాన్ని హెడ్‌కి పంపిస్తాను—ఎల్లుండే నువ్వు కోరినట్టు ప్రత్యేకం జరిపిద్దాం!"

ఐ.యస్.డి.ఐ.సి.లో యే వ్యవహారం ఆలస్యంగా జరగదు.

పాల్ మెరిసే కళ్ళతో "థాంక్యూ సర్, థాంక్యూ యొగైన్!" అని నమస్కారం పెట్టి బయటకు వచ్చేశాడు.

చీఫ్ కార్యాలయం నుండి బయటికి వచ్చాక అన్యమనస్కంగా నడవసాగాడు పాల్. ఆ రోజు తను అర విందం ముతాను కలిసినప్పుడు, వాళ్ళిచ్చిన పేపరు పోయినట్టు యింటికి వెళ్ళిన పదినిమిషాలకు గ్రహించాడు. అది యెలా మాయమయిందో ముందు అర్థం కాలేదతడికి. కాసేపటికి గుర్తొచ్చింది తనకు లిఫ్ట్ యిచ్చిన కారు.

కాగితం మడత పెట్టి చొక్కా జేబులో వేసుకున్నాడు! సిగిరెట్ పెట్టి కూడా అదే జేబులో ఉండడంతో, అది బయటికి తీసినప్పుడు కాగితం క్రింద పడిపోయి వుంటుంది! మెస్సేన్ పేపరు వ్రాయడానికి ముఖ్యమైన మేటర్ కావాలి (పేపర్లో సూచించడానికి!) అందుకు ఆ కాగితం

తనకిచ్చాడు అరవిందం. అది రాస్తా పోవడంలో తిరిగి అరవిందం దగ్గరకు వెళ్ళి చెప్పాడు పాల్, ఆ మర్నాడు.

అరవిందం పాల్ మీద కోప్పడి, తర్వాత ఆ కాగితం జెరాక్స్ కాపీ యిచ్చాడు. దానిలో ని మెస్సేజ్ పేపర్ పూర్తిచేసి, చీఫ్ కి అందజేశాడు, పాల్.

అయితే, పోగొట్టుకున్న ఆ కాగితంలో ఎంత ముఖ్యమైన మేటర్ వుందో గుర్తొచ్చేసరికి, అతని వళ్ళంతా జలదరించింది భయంతో!

సాధారణంగా యెవరికీ అర్థంకాదు ఆ కాగితం! దురదృష్టవశాత్తు అర్థమయితే మటుకు చాలా ప్రమాదం?! పాల్ తనకు లిఫ్ట్ యిచ్చిన వ్యక్తిని ఒకసారి గుర్తుకు తెచ్చుకున్నాడు....

తెల్లగా వుందతడి ముఖం. కనుబొమ్మలు దట్టంగా వుండి. కళ్ళచుట్టూ చర్మం కొద్దిగా నల్లగా వుంది. వెడల్పాటి పెదాలు దాటి క్రిందికి వాలినట్టున్న మీసాలు.... ఏది యెలా వున్నా జగదీష్ కాయ్ మాత్రం పాల్ మెదడులో ముద్రపడిపోయింది. ఆ కాయ్ అతనికి బాగా గుర్తుంది!!

ఆ వ్యక్తి ఐ.ఎన్.డి ఐ.సి.లో ఉద్యోగినని చెప్పాడు తనతో!

కాని ఉద్యోగం యేమిటో అడగలేదు తను. ఆ కాగితం అతని చేతికి చిక్కడంవల్ల యే ప్రమాదమూ లేకపోతే సరే! అలా కాకుండా ఏదయినా తేడా జరిగితే అరవిందం తనను క్షమించడని పాల్ కు తెలుసు!?!

# 6

17 వ తారీఖు —

టైమ్ సాయంత్రం నాలుగవుతోంది.

"సారీ మిస్టర్ జగదీష్! నా అంచనా కూడా తప్పింది" అన్నాడు ఇన్స్పెక్టర్ రఘువీర్. పోలీసు జీపులో వెళుతున్నారు వాళ్ళు. పనిమీద డిపార్టుమెంట్ బ్రాంచ్ కి వెళ్ళి తిరిగివచ్చేస్తున్నారు.

నిట్టూర్చి చెప్పాడు జగదీష్ "ఇన్స్పెక్టర్! దానికి మీరేం చేస్తారు? డిపార్టుమెంటు అంచనా తప్పయిందనే మనం అనుకోవాలి. మొన్న సాయంత్రం పద్దెనిమిది కిలోల మెటల్ మాత్రమే లభించిందని ఇన్ఫర్మేషన్ డిస్పాచ్ చేసేశాను!"

తర్వాత యిద్దరూ మౌనంగా వుండిపోయారు!

కాసేపటికి జగదీష్ యింటి ముందు ఆగింది జీపు. "థాంక్యూ రఘువీర్, మళ్ళీ కలుస్తాను!" అంటూ లోపలికి నడిచాడు జగదీష్.

"ఓకే. బై!" అని వేగంగా పోనిచ్చాడు రఘువీర్ జీపును.

జగదీష్ తన దగ్గరున్న డూప్లికేట్ తాళంతో తలుపు తెరుచుకుని లోపలికి నడిచాడు. తలుపు మళ్ళీ లాక్ చేసి, మేడమీది తన గదికి వెళ్ళాడు. పరిమళ లేదు. కారు తీసుకొని స్నేహితురాలి దగ్గరకు వెళ్ళిందామె ఒంటరిగా!!

అతడు తన గది తలుపు తీసేటప్పటికే ఫోన్ మ్రోగుతోంది. త్వరగా వెళ్ళి రిసీవర్ ఎత్తాడు. అవతలి నుండి వి.యస్.డి.ఐ.సి. చీఫ్ కంఠం వినిపించింది.

"చెప్పండి సర్!" అడిగాడు జగదీష్.

"ఫస్ట్ వేలో 'బి' కేవ్ లో రాతిపొర శాతం ఎక్కు—

వగా వుందని, యెంత స్క్రూయింగ్ జరిపినా శ్రమ వృధా అవుతుందే గానీ ఫలితం వుండడం లేదని ఒక అడుగు త్రవ్వకానికి ఆ వేలో పనిచేసే ఒక కార్మికుడు 'మెన్సన్' పెట్టుకొని ఆర్డర్ పొందాడు!" చీఫ్ బొంగురు కంఠం స్పష్టంగా వినిపించింది ఫోన్లో.

"అలాగా!" అన్నాడు జగదీష్.

"ఉదయం షిఫ్టులో ప్రారంభమయింది త్రవ్వకాల పని, సాయంత్రం షిఫ్టుకి పూర్తయిపోతూంది" చెప్పాడు చీఫ్.

"ఇట్సాల్ రైట్ సర్!" నిరాసక్తతగా చెప్పాడు జగదీష్.

అవతల చీఫ్ ఫోన్ పెట్టేయబోతుండగా అడిగాడు జగదీష్. "కార్మికుడి పేరూ, నెంబరూ సర్?"

"పాల్ — నెంబర్ 18" చెప్పాడు చీఫ్. తర్వాత ఫోన్ పెట్టిన శబ్దం.

జగదీష్ మెల్లగా రిసీవర్ పెట్టేసి, తన కుర్చీలో కూర్చున్నాడు. ఏదో కన్ఫ్యూజింగ్ గా వున్నట్టుంది అతనికి!?!

'పాల్!' ఆ పేరు యెక్కడో విన్నట్టుంది. క్రమంగా గుర్తొచ్చింది అతనికి!! మోటార్ వెహికల్ పాడయిందని తనను లిఫ్టు అడిగిన అపరిచితుడి పేరు పాలే! ఐ.యస్. డి.ఐ.సి.లో స్క్రూయింగ్ మన్ గా పని చేస్తున్నాడని చెప్పాడు. అందుకే తనకు గుర్తుండిపోయింది! ఫస్టు వే అని చెప్పినట్టు కూడా గుర్తు! ఆ అపరిచితుడే చీఫ్ చెప్పిన పాల్ అని నిర్ధారణ అయిందతడికి!!

అకస్మాత్తుగా యేదో విషయం స్ఫురించిందతనికి!!

అది! పాల్ తన కారులో పడేసుకున్న కాగితం

గురించి. ఆ కాగితం చూడాలన్న ఆసక్తి కలిగిందతనికి. వెంటనే దానిని తను ఎక్కడ పెట్టాడో గుర్తుకు తెచ్చుకున్నాడు జగదీష్.

అరనిమిషం తర్వాత పైకి లేచి టేబుల్ మీద పుస్తకాల్లో వెదకడం ప్రారంభించాడు. ఒక పుస్తకం మధ్య పేజిలో వుందది మడత పెట్టి. బయటికి తీశాడు.

త్వరగా మడతలు విప్పి కాగితం చదివాడు జగదీష్!?

కొన్ని క్షణాలవరకూ యేమీ అర్థం కాలేదతనికి. క్రమంగా ఆ కాగితంలో మేటర్ అర్థం కావడంతో అతని శరీరంలో అణుఅణువూ టెన్షన్‌తో నిండిపోయింది! ముఖాన్నిండా చెమట బిందువులు పట్టడంతో, అవి నీళ్ళుగా మారి క్రిందికి కారసాగాయి.

జగదీష్ కర్చీఫ్ తీసి ముఖం తుడుచుకుని, కాగితం చదవడం పూర్తిచేసి, క్రింద సంతకాలు ముద్రలూ తుణ్ణాగా చూసి కుర్చీలో కూలబడ్డాడు. చాలాసేపు అలాగే వుండిపోయాడు.

పదిహేనవ తారీఖు వరకూ జరిగే న్యూక్ల్యయింగ్‌ను బట్టి మొదటి వేలో మొత్తం యాభై కిలోల మెటల్ బయల్పడుతుందని ప్రత్యేక నిపుణులు అంచనా వేసిన ఎస్టిమేషను పేపర్ అది!

ఇన్‌ఫార్మ్ చేయమని పై అధికార్లు తనకు పంపిన ఆర్డర్స్‌లోని మేటర్ లోనిదే! అయితే 'వే'లు లీక్ చేయకూడదు. కనుక ఆర్డర్స్‌లో ఏ 'వే'లలో మెటల్ దొరకబోతూంది సూచించలేదు.

డిపార్టుమెంట్‌కి బొంబేలో వున్న హెడ్ ఆఫీస్‌లో సీల్డ్ పేపర్ అది! అప్రయత్నంగా తనలో తనే గొణు

అన్నాడు జగదీష్. "ఇది....ఇది... పాల్ దగ్గర కెలా వచ్చింది?!"

అతని మెదడు మిషన్ కంటే వేగంగా ఆలోచిస్తూ పోతోంది. పాల్ పొందిన ఆర్డర్ ప్రకారం ఘస్టు వేలో అడుగు మేరకు త్రవ్వకాలు జరుగుతున్నాయి ఈ రోజు. ఘస్టు 'వే లో! ఘస్టు వేలో నే మెటల్ లభిస్తుందని నిపుణులు అంచనా వేశారు. పాల్ ఘస్టు వేలో కార్మికుడే! అతడే మెస్సన్ చేశాడు. అధికార్లకు త్రవ్వకాలు జరిపించమని? ఈ పేపర్ అతని దగ్గరనుండి వచ్చింది....

"మెగాడ్!?" గట్టిగా అర్చినట్టు అని, ఆ యిల్లు పునాదులతో సహా కూలిపోతున్నంత కంగారుగా లేచి ఫోన్ ఎత్తి రింగ్ చేశాడు జగదీష్!

"హలో, ఇన్ స్పెక్టర్ రఘువీర్ హియర్!" అని వినిపించగానే చెప్పాడు జగదీష్. "ఇన్ స్పెక్టర్! మీ కో సంగతి చెప్పాలి. ఘస్టు వేలో న్యూక్లియింగ్ మన్ గా పనిచేసే పాల్ అనే వ్యక్తి గేంబ్లింగ్ ఆడుతున్నాడు. రాంగ్ మెస్సన్ యిచ్చి ఆర్డర్స్ పొంది, ఘస్టు వే 'బి' కేవ్ లో అడుగు మందం మెటల్ చెక్కించేస్తున్నాడు!!" అంతకంటే యెక్కువ చెప్పలేకపోయాడు జగదీష్ ఆత్రుతలో.

స్వరాన్నిబట్టి అతడు పడుతున్న ఆదుర్దాను, కంగారును అంచనా వేసుకొంటూ వెంటనే "కారు వచ్చిందా? లేకపోతే నేను రానా అక్కడికి?" అడిగాడు రఘువీర్.

"ప్లీజ్! త్వరగా రండి!"

అవతల రిసీవర్ క్రెడిల్ చేసిన శబ్దం వినిపించింది. జగదీష్ రిసీవర్ పెట్టేసి క్రిందికి వెళ్ళి తలుపు లాక్

తీసి మళ్ళీ పైకి వచ్చాడు. సరిగ్గా పదినిమిషాలకు ఆ గది తలుపులు తెరుచుకొని లోపలకు వచ్చాడు రఘువీర్.

జగదీష్ కళ్ళు మెరిశాయి, అతనిని చూడగానే! చేతిలో పేపర్ అందించాడు. రఘువీర్ దానిని చదివిన తర్వాత చెప్పాడు, చీఫ్ ఫోను చేసి చెప్పిన విషయాలు, తను పాల్‌కు లిఫ్ట్ యిచ్చిన సంగతి.

పై పెదవితో అడుగు పెదవి కొరుకుతూ సాలోచనగా వుండిపోయాడు రఘువీర్ "అతని పేరేమిటన్నారు?" అడిగాడు.

"పాల్, నెంబరు 18."

రఘువీర్ టైమ్ చూశాడు. ఐదున్నర అవుతోంది అప్పటికే!

"జగదీష్! కమాన్ క్విక్! స్పాట్‌కి వెళ్ళి చూద్దాం" అంటూ చురుకుగా కదిలాడు రఘువీర్. జగదీష్ కాగితాన్ని జాగ్రత్తగా మడతపెట్టి జేబులో పెట్టుకొని, త్వరగా రఘువీర్ వెంట కదిలాడు.

ఐ.యస్.టి.ఐ.సి. వద్దకు చేరుకున్నారు ఇద్దరూ.

ఐడెంటిఫికేషన్ చూపుతూ సెక్యూరిటీ హౌస్ ప్రక్కనున్న గైడ్ రూమ్‌లోనికి వెళ్ళి అడిగారు. ఈవినింగ్ షిఫ్టుతో ప్రత్యేకాలు పూర్తయ్యాయని చెప్పారక్కడ!

జగదీష్ అడిగాడు "ఎని రఫ్ మెటల్?"

"దానిని వ్యాన్‌లో పంపించివేశాం, రియలైజేషన్‌కు" చెప్పాడు ఎంక్వైరీ అధికారి,

రియలైజేషన్ యెక్కడ జరుగుతుందో తెలుసు జగదీష్‌కు. "ఎంత సేపయింది పంపి?" అడిగాడు.

"పది నిమిషాలవుతోంది!" ఆఫీసర్ చెప్పాడు.

తిరిగి ఇద్దరూ బయల్దేరారు!

సరిగ్గా అదే సమయానికి—

చింతపిక్కరంగు వ్యాన్ వేగంగా పోతోంది. రియ లైజేషన్ సెంటర్, మూడు కిలోమీటర్ల దూరంలో ఉంది ఇంకా! వ్యాన్‌కి అమర్చివున్న తొట్టిలో, పెద్ద పెద్ద రాళ్ళుగా చెక్కివేయబడిన ఫసుట్వే, 'బి' కేవ్ రాతిపొర నల్లగా మెరుస్తూ కనబడుతోంది. వ్యాన్‌లో డ్రైవర్, ఇద్దరు గార్డులు మాత్రమే వున్నారు! రియలై జేషన్‌కు పంపే మెటల్‌కు అంతగా ప్రాధాన్యత ఇవ్వదు డిపార్టుమెంటు.

కొద్దిగా నీలంరంగు కలసినట్టున్న పల్చటి తారురోడ్డు అద్దంలా వుంది సాఫీగా. రోడ్డుకు ఇరువగా అటూ ఇటూ కొద్దిగా ఎర్రరంగులో వున్న మోకాలు ఎత్తు గడ్డి గాలికి కొద్దిగా వంగుతూ, కలసికట్టుగా ఒంపులు తిరుగుతోంది.

చటుక్కున ముందుకు చూసి కంగారుపడ్డాడు డ్రైవర్. ఎదురుగా జీప్ ఒకటి వస్తోంది. పక్కకు తొలగడం లేదది, హారన్ కొట్టినా సరే! డ్రైవర్ గేరు మార్చాడు. వ్యాన్ స్పీడ్ తగ్గిపోయింది.

ఎదురుగా జీపు అలాగే వస్తూంది. గార్డులు ఒకరివంక ఒకరు చూసుకొన్నారు ఆశ్చర్యంగా! జీపు దగ్గరకు రావడంతో డ్రైవర్ బ్రేకు వేసి వేన్ ఆపేశాడు వెంటనే.

దాదాపు వేన్‌ని కుద్దినంత దగ్గరగా వచ్చి ఆగింది జీవ్!

డ్రైవర్ తికమకపడేటట్టు చూడసాగాడు జీపులోని వ్యక్తుల వంక. "ఏయ్!" అని అరుస్తూ ఒక గార్డు క్రిందికి దిగాడు. మరో గార్డు రైఫిల్ సర్దుకుంటున్నాడు.

అప్పటికే జీప్ దిగిన రాక్‌సన్, గార్డు చేతిలో

రైఫిల్ లాక్కొని దాన్ని తిప్పి మడమతో కొట్టాడు గార్డుని బలంగా! 'ట్టీగా కేక పెట్టి క్రిందికి వాలిపోయాడు గార్డు

వెంటనే పెద్దగా రైఫిల్ పేలిన చప్పుడుతో పాటు రాక్ సన్ చెవి ప్రక్కగా దూసుకుపోయిన బుల్లెట్ ఖంగుమన్న శబ్దంతో జీపు అంచుకు తగిలింది. డ్రైవర్ కంగారుగా వేన్ దిగాడు.

"రాక్ సన్ బి కేర్ ఫుల్!" జీపులోనుండి అరవిందం చెప్పాడు అర్చి.

రాక్ సన్ చేతిలో వున్న రైఫిల్ తిప్పి ముందుకి గురిపెట్టి కాల్చాడు. బళ్ళున వేన్ అద్దం పగిలింది! రెండవతూటా కాల్చబోతున్న గార్డు రొమ్ముపై తగిలింది, అద్దాన్ని చీల్చుకొని వచ్చిన బులెట్. గార్డు ముందుకి జారిపోయాడు.

డ్రైవర్ మీద కలబడడంతో పిడికిలి బిగించి అతడి ముఖంమీద గుద్దాడు రాక్ సన్. పెదాలనుండి రక్తం కారుతూండగా డ్రైవర్ వెనక్కిపడ్డాడు.

జీపులోనుండి జవారన్, దిగి వాన్ కేబిన్‌లో పడి వున్న గార్డుని బయటికి లాగి, ఎక్కి. కూర్చున్నాడు. రాక్ సన్ డ్రైవింగ్ సీట్లో కూర్చుని స్టార్టు చేశాడు! తర్వాత వెనక్కి తిప్పి వేగంగా పోనివ్వసాగాడు దానిని! వెనుక అరవిందం జీపు స్టార్టు చేసి వేన్‌ను అనుసరించాడు. అతడి ప్రక్కన పాల్ కూడా వున్నాడు.

# 7

దూరంగా కనిపిస్తూన్న వేన్ ను చూసి రఘువీర్ వేగంగా వెళ్తున్న జీపును కొద్దిగా స్లో చేశాడు. క్రమంగా వేన్ వాళ్ళను సమీపించి దూసుకొని

పోయింది ముందుకు!!

"ఇన్‌స్పెక్టర్ స్టాప్!" గట్టిగా చెప్పాడు జగదీష్.

చటుక్కున ఆగింది జీపు. ఇంతలో యెదురుగా వస్తూన్న మరో జీపు ప్రక్కనుండి వెళ్ళిపోయింది సర్రున!

జీపులో అరవిందం పక్కన కూర్చున్న పాల్‌ని చూశాడు జగదీష్! వెంటనే రఘువీర్‌తో చెప్పాడు. "ఇప్పుడు వెళ్ళిన జీపులో తెల్లచొక్కావాడే పాల్. ముందు వెళ్ళిన వేన్ త్రవ్వకాలు జరిపి వేరుచేసిన రాతి పొరను తీసుకొని వెళుతుంది—త్వరగా ఫాలో అవాలి మనం. లేకపోతే దాటిపోతారు రాస్కెల్స్!"

జీపు వెనక్కి తిప్పి ఏక్సిలేటర్ తొక్కాడు రఘువీర్. ముందు వెళ్ళిన వాహనాలను వేగంగా వెంబడించింది జీపు. పల్చగా చీకట్లు వ్యాపిస్తున్నాయి అప్పటికి!

ముందు వాహనాలు స్పీడ్ పెరగడం చూసి చెప్పాడు రఘువీర్. "నేను యూనిఫాంలో వున్నానుకదా! వాళ్ళు చూశారు. మనం వెంబడిస్తున్నామని అర్థమయ్యే వుంటుంది!"

జగదీష్ యేదో చెప్పబోయాడు. ఇంతలో ముందు వెళుతున్న జీపు స్పీడ్ కొద్ది తగ్గి, హఠాత్తుగా అందులో నుండి రివాల్వర్ పేలిన శబ్దం వినిపించింది!!

"రాస్కెల్స్! తెగించేశారు. వీళ్ళను వదలకూడదు!" దృఢంగా చెప్పాడు రఘువీర్. తర్వాత మరోసారి శబ్దం వినిపించింది. జీపు ఇంజను పైభాగాన టంగుమంది!

కాసేపు గడిచింది. చీకట్లు చిక్కబడ్డాయి. ఇద్దరూ జాగ్రత్తగా ఒరిగి కూర్చున్నారు.

దూరంగా కుడివైపుకు మలుపు తిరిగివున్న రోడ్డుకి

యెడం వయిపుకి మరో దారి కనబడుతూంది చీకట్లో అస్ప ష్టంగా!

ముందు రెండు వాహనాలు మలుపు తిరిగి ఎడంవైపు బాటలోనుండి సాగిపోతున్నాయి వేగంగా. వాటి హెడ్‌లైట్ల కాంతి కనిపిస్తూంది.

“ఇటువైపెక్కడో వాళ్ళ స్థావరం వున్నట్టుంది?” అన్నాడు జగదీష్.

ఇన్‌స్పెక్టర్ రఘువీర్ జీపు కొద్దిగా స్లో చేసి ఎడం వైపుకి తిప్పాడు.

మళ్ళీ వినిపించింది రివాల్వర్ శబ్దం! మూడుసార్లు, వరసగా పేలినట్టు! కంగుమని శబ్దం వినిపించింది. తర్వాత అతి కష్టంమీద స్టీరింగ్‌ను కంట్రోల్ చేస్తూ బ్రేక్ వేసి ఆపాడు రఘువీర్.

“ఏమయింది?” కంగారుగా అడిగాడు జగదీష్.

“టైరుకి తగిలినట్టుంది!” చెప్పాడు రఘువీర్. వెంటనే ఇద్దరూ జీపు దిగి చూశారు. కుడివైపు టైరు అణిగిపోయి వుంది. డీలా పడిపోయారిద్దరూ.

“ఏమయినా సరే వాళ్ళను వదలకూడదు” అన్నాడు రఘువీర్! జగదీష్ తల పంకించాడు.

రఘువీర్ ఇంజన్ ఆపి తాళాలు జేబులో వేసుకొన్నాడు. హెడ్‌లైట్స్ ఆరిపోవడంతో చీకటి వ్యాపించిందక్కడ! దూరంగా వాహనాలు పోతున్న చప్పుడు కనబడుతూంది.

“వాళ్ళు ఇక్కడే ఎక్కడో ఆగుతారని నా అనుమానం! మన ప్రయత్నం మనం చేద్దాం. కొంతదూరం వెళ్ళి చూడడం మంచిదనిపిస్తూంది నాకు!” అన్నాడు రఘువీర్ మెల్లగా పరుగు అందుకొంటూ. జగదీష్ కూడా

వెంట పరిగెత్తసాగాడు.

ఆయాసపడుతూనే పదినిమిషాల పైనే పరిగెట్టారిద్దరూ!

వాహనాలు బాగా దూరం అయ్యాయి. శబ్దం కూడా వినిపించడంలేదు. కాసేపాగి మరో ఐదునిమిషాలు పైనే పరిగెట్టారు చీకట్లోనే! ఒకచోట ఆగి ఆయాసం తీర్చుకో సాగారు.

దూరంగా యేదో షెడ్‌లాంటిది చూశారు వాళ్ళు! చీకట్లో సల్లగా మసగ్గా కనబడుతూందది! రఘువీర్ వంక చూసి "అక్కడికి వెళ్ళి చూద్దాం?" అన్నాడు జగదీష్ మళ్ళీ పరిగెడుతూ.

ఇద్దరూ పరుగులాంటి నడకతో ఆ ప్రాంతానికి చేరుకున్నారు. వేన్, జీపు అక్కడ ఆపివుండడం గమనించి ఇద్దరి కళ్ళు మెరిశాయి! ఒకటి కాదు, రెండు షెడ్‌లు వున్నాయక్కడ యెదురెదురుగా. బాగా పొడుగ్గా గోడౌన్స్‌లా వున్న రేకుల షెడ్‌లవి!?

మొదటి షెడ్ వెనుక భాగానికి చేరారిద్దరూ. గోడ వారగా ముందుకు నడిచారు. రఘువీర్ లెదర్ కేసులో నుండి రివాల్వర్ తీసి పొజిషన్‌లో పట్టుకున్నాడు.

జగదీష్ అడిగాడు "ఇన్స్పెక్టర్! ఈ షెడ్ యేమిటి?"

"బహుశా, రైస్‌మిల్లర్స్ ఉపయోగించే గోడౌన్స్ అనుకుంటా స్టాక్ తక్కువగా వున్నప్పుడు కాపలా పెద్దగా వుండదు. ఈ దుర్మార్గులు వీటిని తమ అవసరాలకు వాడుకొంటూ వుండవచ్చు!" చెప్పాడు రఘువీర్.

ఇంతలో షెడ్ చివర యేదో చప్పుడయింది?!

అప్పటికే ఇద్దరూ దాదాపు చివరికి వచ్చేశారు. అక్కడ ప్రదేశమంతా నిలువెత్తు గుబురుగా పెరిగి

వున్నాయి యేవేవో మొక్కలు. ఎక్కడో లైట్ వెలుగుతున్నట్టు పల్చటి వెలుతురు పడుతూంది. ఏదో నీడపడడం గమనించి చటుక్కున పక్కకు తప్పుకున్నాడు జగదీష్. రఘువీర్ ముందుకొచ్చాడు రివాల్వర్ ముందుకు పట్టుకొని.

నీడ కదిలింది! ఏదో మసక ఆకారం అటువైపు వచ్చింది. నిశ్శబ్దంగా ముందుకు నడిచారిద్దరూ! ఇప్పుడా ఆకారం ముఖం కొద్దిగా కనబడుతూంది?!

రఘువీర్ అడుగు కదిపాడు చురుగ్గా! ఆకారం మాత్రం నిశ్చలంగా నిలబడి వుంది! అతడి చేతిమీద పడింది దెబ్బ. భారంగా మూలిగాడు రఘువీర్ చెయ్యిపట్టు కొని. జగదీష్ క్రిందికి వంగాడు.

"డోంట్ మూవ్!" తాపీగా వినిపించింది ఆకారం స్వరం.

చేతిలో కర్ర క్రిందపడేసి, కుడి చేతిలో రివాల్వర్ జగదీష్‌కి గురిపెట్టి సన్నగా నవ్వుతూ నిల్చున్నాడు రాక్‌సన్.

ఇద్దరూ తెల్లబోయి చూడసాగారు? ఆకారం పూర్తిగా వెలుగులోకి వచ్చింది! అతడు అరవిందం.

# 8

"ఊఁ! నడవండి!" చెప్పాడు అరవిందం అదిలింపుగా.

రాక్‌సన్ ఇద్దర్నీ ముందుకు నెట్టాడు. నిస్సహాయంగా నడిచారిద్దరూ.

రఘువీర్‌కి చిరాగ్గా వుంది అంత తేలిగ్గా తాము మోసపోవడం! క్రిందపడిన తన రివాల్వరు ఊహించ నంత వేగంగా తీసిన పొడవాటి ఆ దృఢకాయుడు చాలా

బలశాలి అని గ్రహించాడు. యూనిఫాంలో వున్న తనను స్పష్టంగా చూసి వాళ్ళు కించిత్తుకూడా బెదరకపోవడం ఆశ్చర్యాన్ని కలిగిస్తూంది రఘువీర్ కు!!

ముందు అరవిందం నడవగా వెనగ్గా జగదీష్, రఘువీర్ లను నడిపించుకుంటూ వెళ్ళాడు రాక్ సన్.

షెడ్ల మధ్య కొద్ది ఖాళీస్థలం వుంది ఒక్కొక్క షెడ్ కు చాలా ద్వారాలున్నాయి. వాళ్ళు వచ్చిన వైపు షెడ్ తలుపులు అన్నీ లాక్ చేయబడి వున్నాయి. దానికి ఎదురుగా వున్న మరో షెడ్ మొదటి ద్వారం తెరిచే వుంది! లోపల కాంతివంతంగా వుంది!

అరవిందం ముందు లోపలి నడిచాడు. రఘువీర్, జగదీష్ ఆశ్చర్యంగా చూస్తూ నడిచారు లోనికి!

లోపల చాలాచోట్ల బస్తాలు పేర్చివున్నాయి. కిటికీలు కూడా మూసివుండడం వలన వెలుతురు బయటికి రావడంలేదు. రాక్ సన్ రివాల్వరు అరవిందానికి అందించాడు!!

జగదీష్, రఘువీర్ ముఖంలోనికి చూశాడు. ఊహించని విధంగా వురికాడు రఘువీర్, అరవిందం పైకి! తత్తరపడ్డాడు అరవిందం రివాల్వరు జారిపోయింది.

జగదీష్ అదే క్షణంలో పిడికిలి బిగించి రాక్ సన్ మీదికి విసిరాడు. చిన్నగా మూలిగి జగదీష్ ను, దూరంగా నెట్టేశాడు రాక్ సన్. అతడు తోసిన తోపుకి అంత దూరంగా పడతానని జగదీష్ కూడా అనుకొని వుండడు! విసురుగా వెళ్ళి బస్తాల పక్కనున్న యినుప స్తంభాన్ని గుద్దుకొన్నాడు. ముందు భుజం తర్వాత తల వరసగా కొట్టుకొన్నాయి స్తంభానికి!! నిస్త్రాణంగా వాలిపోయాడు జగదీష్!

అప్పటికి రివాల్వరు అందుకున్న రఘువీర్‌ను చూసి అరవిందం రెండడుగులు కంగారుగా వెనక్కి వేసి "రాక్‌సన్!" అని అర్చాడు.

రాక్‌సన్ రఘువీర్ వైపు లాఘవంగా కదిలాడు. మరొక్క క్షణం ఆలస్యమైతే, రఘువీర్ చేతిలో రివాల్వరు అతని చేతిలో కొచ్చేదే! కానీ, రఘువీర్ దృఢంగా రివాల్వరు పట్టుకొని కాల్చాడు రాక్‌సన్ వైపు!!

కీచుమని అర్చాడు రాక్‌సన్ చాలా బాధగా. అతని భుజంమీద నుండి రక్తం పొంగుతూంది! అరవిందం కళ్ళు తేలవేసి చూస్తున్నాడు.

రఘువీర్ జాగ్రత్తగా అరవిందాన్ని కవర్ చేస్తూ, జగదీష్ దగ్గరకు నడిచాడు. అతడు మూలుగుతున్నాడు తప్ప, లేవలేకపోతున్నాడు. మోకాళ్ళు వంచి కూర్చుని జగదీష్ వైపు పూర్తిగా తలవంచి, అతని తల దగ్గర గాయాన్ని పరిశీలించాడు. కొద్దిగా రక్తం ఉందక్కడ!

"జగదీష్.... మిస్టర్ జగదీష్....?" పిల్చాడు రఘువీర్.

తల కొద్దిగా అటూ ఇటూ వూపాడు జగదీష్. అతనిని జాగ్రత్తగా క్రిందికి దింపి పైకి లేచి చూశాడు రఘువీర్.

అరవిందం లేడక్కడ! రాక్‌సన్ మాత్రం క్రిందికి ఒంగుని బలహీనంగా మూలుగుతున్నాడు. గాయం తగిలిన చోట చింపిన షర్టు ముక్కను వణికే చేతులతో కట్టు కట్టుకొంటున్నాడు రక్తం కారకుండా. రఘువీర్ చుట్టూ చూశాడు! అరవిందం ఎక్కడా కనిపించలేదు! అప్పుడు వినిపించిందతనికి, దూరంగా వాహనాలు స్టార్టయిన చప్పుడు!!

అరవిందం మిగతా వాళ్ళతో పారిపోతున్నాడని గ్రహించాడు రఘువీర్. రాక్ సన్ వద్దకు నడిచాడు! అతడు కోలుకొంటే చాలా ప్రమాదం అని తెలుసతడికి! రివాల్వరు తిప్పి అతని తలపై బాదాడు! నిస్సత్తువగా అలాగే క్రిందికి వాలిపోయాడు రాక్ సన్.

రఘువీర్ పొడుగాటి ఆ షెడ్‌లో చివరికంటూ పరిగెత్తుకొంటూ వెళ్ళాడు. అక్కడ ఒక ద్వారం తెరిచి వుంది కొద్దిగా. అలా వెలుపలికి వెళ్ళాడు.

బయట వ్యాన్, జీపు లేవు!? దూరంగా లైట్లు కనబడుతున్నాయి వేగంగా ప్రయాణిస్తున్నట్లు. శబ్దం క్రమంగా మూరమయింది!!

"ఇడియట్స్!" తిట్టుకున్నాడు.

తిరిగివచ్చాడు. రాక్ సన్ని చేతులు వెనక్కి విరిచికట్టి పడేశాడు అక్కడ దొరికిన తాడుతో. వాడి షర్టు పూర్తిగా చించి బయట నీళ్ళతొట్టిలో ముంచి జగదీష్ తలకు చుట్టాడు జాగ్రత్తగా!

కాసేపటికి లేచాడు జగదీష్. రఘువీర్ జరిగింది చెప్పాడు.

బలహీనస్వరంతో చెప్పాడు జగదీష్ "ఇన్స్పెక్టర్! వీడిని స్టేషనుకి తీసికెళదాం! అక్కడ వీడితో సులభంగా ఆ ముఠా గురించి కక్కించవచ్చు!"

"కానీ, ప్రస్తుతం మనకు వెహికల్ ఏదీ లేదు తెల్లవారితేగానీ సిటీ చేరడం కష్టం" కొద్ది నిరాశగా చెప్పాడు రఘువీర్.

కాసేపాగి చెప్పాడు జగదీష్ "ఈ షెడ్స్‌లో టెలిఫోను ఎక్కడయినా ఉండేమో చూడండి!"

"గుడ్!" అని చురుగ్గా కదిలాడు రఘువీర్. చివరికి

షెడ్ మధ్యలో ఎత్తయిన వరుసలుగా పేర్చబడిన బస్తాల మధ్యలో కనిపించింది ఫోన్. గోడకు కొట్టబడిన చిన్న చెక్క పై వుందది. తాళం వేసివుంది!

తాళాన్ని పట్టుకొని ఉన్న ప్లాస్టిక్ గ్లాస్‌ను విరిచేసి తాళాన్ని క్రింద పడేశాడు రఘువీర్. నెంబరు డయల్ చేశాడు....

హెడ్ కానిస్టేబుల్ స్వరం విని చెప్పాడు. "నేను రఘువీర్‌ని మాట్లాడుతున్నాను!"

హెడ్ స్వరం సిన్సియరుగా వినిపించింది. "యస్ సర్! చెప్పండి!"

"ఇన్‌ఫార్మర్ జగదీష్ యింటికి త్రీనాట్‌త్రీని పంపించు. అక్కడ జగదీష్ గారి శ్రీమతి కారు ఇస్తుంది. దానితో అతనిని యీ చోటుకు రమ్మను త్వరగా...." అని గుర్తులు చెప్పాడు.

"వాట్ సార్ యేమయింది?" ఆదుర్దాగా అడిగాడు హెడ్.

రఘువీర్ జరిగింది క్లుప్తంగా చెప్పి "కానిస్టేబుల్‌ని త్వరగా పంపించు" అన్నాడు.

"నన్నూ రమ్మంటారా సార్?"

"వద్దులే. నువ్వు స్టేషను దగ్గరుండు!" అని కనెక్షన్ కట్ చేసి, జగదీష్ నెంబరు తిప్పాడు.

"హాలో__పరిమళా స్పీకింగ్"

"నేను ఇన్‌స్పెక్టర్ రఘువీర్‌ను మాట్లాడుతున్నాను" చెప్పాడు.

"చెప్పండి?" అంది.

"మా ఫోర్త్ స్టేషన్ నుండి కానిస్టేబుల్ వస్తాడు.

అతనికి మీ కారు ఇవ్వండి! జగదీష్ ఇక్కడే వున్నాడు" అన్నాడు.

"ఏం చేస్తున్నారు?"

"అంతా ఇప్పుడు చెప్పడం కుదరదు. ముందు కారు ఇచ్చి పంపండి ప్లీజ్!"

అతని మాటల్లోని ఆతృతను గుర్తించి "ఓకే" అందామె.

## 9

జగదీష్ ఆఫీసుగది అది—

రఘువీర్ ప్రవేశించాడు!

"ఏమన్నా చెప్పాడా?" ప్రశ్నించాడు జగదీష్.

"వాడు చెబుతాడా మన భ్రమగానీ, వాడు రాతి మనిషి. యెంత ట్రీట్‌మెంట్ ఇచ్చినా, అసలు విషయం బయిట పెట్టడం లేదు!" అని నిట్టూర్చి ఎదురుగా కూర్చున్నాడు రఘువీర్.

"ఇలాంటి వాళ్ళతో కష్టమే! వాళ్ళను పట్టుకొంటే గానీ ఆ మెటల్ తిరిగి సంపాదించలేం. లక్షల విలువ గల వజ్రాలున్నాయి ఆ మెటల్‌లో!"

"సుమారు యెంత వుంటుం దేమిటి ఆ వజ్రాల విలువ?"

"ఇరవై ఐదు లక్షలవరకూ వుండొచ్చు మొత్తం విలువ!"

"మైగాడ్! యెక్కువే. వాళ్ళను త్వరగా పట్టుకోక పోతే యిలాంటివి యెన్ని చేస్తారో! ఐ.యస్.డి ఐ.సి. గార్డుని చంపారు. ఇద్దర్ని గాయపరిచారు—డిపార్టు మెంట్ ఆఫీసర్లు ముగ్గురు, ఈ కేసు నేను డీల్ చేస్తున్నా

నని తెలిసి ఉదయమే ఫోన్‌లలో చెప్పారు గట్టిగా, నేరస్తుల్ని త్వరగా బంధించాలని!”

“గుడ్డిలో మెల్ల అన్నట్టు యింత జరిగినా కొంత అదృష్టం యేమిటంటే, ప్రత్యేకాలలో ఫీట్ జరిగినట్టు డిపార్టుమెంటుకి ఇంకా తెలీదు! పదిహేడవ తారీఖున హెడ్ ఆఫీసులో సీల్డ్ పేపర్స్ అన్నీ చెక్ చేస్తారు. అప్పుడు మన దగ్గరున్న ఈ ఇన్‌ఫార్మింగ్ పేపర్ కనిపించక పోవడంతో మొత్తం జరిగిందంతా వెంటనే ఆరాతీసి తెలుసుకొంటుంది ఐ.యస్.డి.ఐ.సి” చెప్పాడు జగదీష్ కొద్ది బాధగా వాలిన కళ్ళతో.

“అన్ని చెక్ పోస్టుల దగ్గర కట్టుదిట్టమైన సెర్చింగ్ వుంది. వాళ్ళు యెక్కువ దూరం ప్రయాణం చేయలేరు ఎక్కడికి! ఎలా చూసినా వాళ్ళు తప్పించుకోవడం అసాధ్యం!” అన్నాడు రఘువీర్.

“పద. రాక్‌సన్‌ను మరో చూపు చూద్దాం!” అంటూ లేచాడు జగదీష్.

## 10

ఊరికి దూరంగా వున్న ప్రదేశమది—

రెండు సరుగుడు చెట్లమధ్యనుండి నిర్మానుష్యంగా కనబడుతూంది ఆ భవనం! బాగా పాడుబడినది!!

గుబురుగా వున్న అక్కడ చెట్లమధ్య వేన్ ఆగివుంది!

భవనం లోపల హాల్లో సన్నటి శబ్దం వినబడుతూంది. స్క్రూయింగ్ శబ్దమది! అరవిందం కళ్ళుమాత్రమే కనిపించేలా పొడవాటి రుమాలు ముఖానికి కట్టుకొనివున్నాడు. చేతిలో వున్న పొడవాటి సంచిలో వేన్ వెనుక తొట్టిలో వున్న మెటల్ నింపుకొని లోపలకు తీసికెళుతున్నాడు. అతడి ఒళ్ళంతా చెమటలు పట్టివున్నాయి.

బట్టలనిండా మసి అంటుకొని వుంది.

సంచినిండా మెటల్ నింపుకొని లోపలకు వెళ్ళాడు. లోపల హాలు మధ్యలో పెద్ద టేబుల్ వుంది. దానిపై ఇనుపస్టాండుకి 'కొలేషన్' తగిలించి వుంది. మెటల్ రియలైజేషన్‌కు వాడే సాధనం అది! స్క్రూయింగ్ డ్రెస్‌లో వున్న పాల్ చేతిలో స్క్రూ మెషీన్ ఆన్‌లో వుంది!

అరవిందం మోసుకొచ్చిన మెటల్ కొలేషన్‌లో వుంచి స్క్రూయింగ్ చేస్తున్నాడు పాల్. మెషీన్‌లో పచ్చలైటు మాత్రమే వెలుగుతూంది.

స్క్రూయింగ్ వల్ల పైకి చిమ్ముతూ మెరుస్తూన్న రాతి పొడి దుమ్ము రేగినట్టు హాలంతా ఆక్రమించింది. రియలైజేషన్ పూర్తయిన పొడి పెద్ద కుప్పలా పేరుకొనిపోయి, టేబుల్ మీద నుండి క్రిందికి పడుతూంది. ఉదయం అరవిందం, జనార్ధన్ సంచులతో చాలా మెటల్ మోసారు! ప్రస్తుతం జనార్ధన్ పనిమీద బయటికి వెళ్ళడంతో అరవిందం ఒక్కడే పని చేయవలసి వస్తూంది.

అప్పటికి సగానికి పైనే మెటల్ స్క్రూయింగ్ జరిగిపోయింది. మరోసారి సంచినింపి కొలేషన్‌లో వేశాడు అరవిందం. పాల్ స్క్రూని రన్ చేస్తున్నాడు! సరిగ్గా రెండు క్షణాలు గడిచాయి?! పాల్ కళ్ళు పెద్దవయ్యాయి!?

ఎర్ర లైటు వెలిగివుంది!!

ఆనందం పట్టలేక "అరవిందం సార్! త్వరగా రండి సక్సెస్! గ్రాండ్ సక్సెస్!!" వెర్రిగా పిల్చాడు పాల్, అరవిందాన్ని.

అరవిందం చేతిలో సంచి పడేసి దగ్గరకొచ్చాడు.

స్రూక్ అప్ చేసి చెప్పాడు పాల్. "ఈ మెటల్ లోనే డైమండ్స్ వుంది!"

కాలేషన్ లో కనబడుతూన్న మెటల్ వంక కళ్ళు విప్పార్చుకుని చూశాడు అరవిందం. అతడి పెదవులు కొద్దిగా వణికాయి సంతోషంతో. "కమాన్ క్విక్! మెటల్ ను స్రూక్ చెయ్!" చెప్పాడు పాల్ ను తొందర పెడుతూ.

దాదాపు అరగంట తర్వాత గరుగ్గా, బరువుగా ఒక ఆకారంలేని అంతర్గతంగా తెలుపు రంగు కలసివున్న లేత నీలిరంగు రాళ్ళు పదకొండు వెలుపలికి తీశాడు పాల్ మెటల్ లోనుండి!!

అరవిందం కర్చీఫ్ తీసి జాగ్రత్తగా వాటిని మూట గట్టుకొని జేబులో దూరుకున్నాడు వెంటనే! పాల్ ముఖంలో కొద్దిగా రంగులు మారాయి!! అయినా మాట్లాడకుండా ఊరుకున్నాడు.

నిలువెల్లా ఆనందంతో గాలిలో తేలుతున్నట్టున్నాడు అరవిందం. "వెల్ డన్ పాల్! వెల్ డన్!!" అంటూ పాల్ ని అభినందించాడు.

బయట జీపు వస్తూన్న శబ్దం వినిపించింది!?

అరవిందం బయటికి వచ్చాడు. జనార్దన్ క్రిందికి దిగాడు, చేతిలో ఫుడ్ టిన్స్ తో! పాల్ కూడా వచ్చాడు అక్కడికి. ఏదో చెప్పబోతుంటే అరవిందం కంటితో సైగ చేశాడు పాల్ కు.

మౌనంగా వుండిపోయిన పాల్ ని చూసి "ఏమయింది! వజ్రాలు బయటపడ్డాయా?" అడిగాడు జనార్దన్.

"లేదు! ఇంకా స్రూకింగ్ జరుగుతోంది. ఇంకా కొద్ది మెటల్ వుంది. బహుశా అందులో వుండవచ్చు

డైమండ్స్" తాపీగా చెప్పి, "ఆ టిన్స్ అక్కడ పెట్టి, మిగతా మెటల్ నువ్వు మోయి!" అన్నాడు అరవిందం.

పాల్‌కు అర్థం కావడం లేదు అరవిందం ప్రవర్తన! అతడు చాలా ప్రమాదకారి అని మాత్రం అవగాహన అవుతోంది అతడికి!!

జనార్దన్ కదిలాడు. పుష్ టిన్స్ వరండాలో బల్లపై వుంచి, సంచి అందుకొని వేన్‌లో మెటల్ నింపాడు. దానినిండా. "చాలా వరకూ అయిపోయిందే! ఎంత మెటల్ క్రష్యింగ్ చేసినా డైమండ్స్ బయటపడలేదా!?" సంచిలోపలకు చూస్తూ ఆశ్చర్యంగా అడిగాడు ఇంద్రక్రి.

అరవిందం మాట్లాడలేదు. ఏదో ఆలోచిస్తున్నట్లు, అస్పష్టంగా జేబు తడుముకుంటూ దిక్కులు చూస్తూ వుండిపోయాడు. పాల్ మాత్రం కదలకుండా చేతిలో క్రష్ మెషీన్‌తో కొయ్యలా నిలబడివున్నాడు.

జనార్దన్, పాల్ వంక చూసి ఆగిపోయాడు. అరవిందం పాల్‌కు కళ్ళతో యేవో సైగలు చేస్తూ, అసహనంగా చెప్పాడు, "పాల్! క్రష్యింగ్ ప్రారంభించు నువ్వు. పని త్వరగా తెముల్చుకొని మరో ప్రాంతానికి వెళ్ళిపోవడం మంచిది మనం! రాక్‌సన్ ద్వారా పోలీసులు యేక్షణానయినా ఈ ప్రాంతాన్ని కనుగొనవచ్చు!"

పాల్ కదల్లేదు. ఒక విషయం మాత్రం గ్రహించాడతడు. అరవిందం పెద్ద ఛీటర్. ప్రస్తుతం జనార్ధన్‌ను యేదో విధంగా వదిలించుకోవాలనుకొంటున్నాడు. వజ్రాలలో తనకు మాత్రమే వాటా యిచ్చేటట్టు ప్రవర్తిస్తున్నాడు. అది కేవలం నటనే అయ్యుండొచ్చు! జనార్ధన్

తొలగితే రేపు తనను కూడా అడ్డుతప్పిస్తాడు నిశ్చయంగా!

జనార్ధన్ అప్పటికే సంచి క్రింద పెట్టి ఆశ్చర్యంగా చూడసాగాడు పాల్ వంక!?

“పాల్ నీకే చెప్పేది! ఏమిటాలోచిస్తున్నావ్? స్ప్రేయింగ్ మొదలుపెట్టు, కమాన్ క్విక్” తీవ్రంగా చెప్పాడు అరవిందం.

నెమ్మదిగా కదిలి జనార్ధన్ వంక చూసి చెప్పాడు పాల్ “జనార్ధన్! నువ్వు వచ్చేటప్పటికే వజ్రాలున్న రాళ్ళు లభించాయి పెట్టెలో! ఈ అరవిందం నీకు వాటా ఇవ్వడానికి ఇష్టంలేక....”

పాల్ ఆగిపోయి నిలువెల్లా వణికిపోసాగాడు. అరవిందం ముఖం మారి!! శరీరంలోని రక్తమంతా ముఖంలోనికి పాకినట్టు ఎర్రబడిన ముఖంతో, ఎర్రజీరలతో కూడిన కనుగుడ్లతో క్రూరంగా చూస్తున్నాడు అరవిందం, పాల్ వంకే!?

ఇటువైపు పాల్ చెప్పింది విని జనార్ధన్ ముఖంలో రంగులు మారసాగాయి! క్రమంగా అది అర్ధంకావడంతో నమ్మలేకపోతున్నాడతడు తను విన్న మాటల్ని!!

అరవిందం చేతిలో రివాల్వర్ ప్రత్యక్షమైంది!! వెర్రిగా చూశాడు పాల్.

“ఇడియట్. మెన్షన్ పేపర్ పడవేసినప్పుడే నిన్ను చంపిపారేద్దామనుకొన్నాను! నీ అవసరం వుండడంవల్ల ఇంతవరకూ వదిలాను—ఇప్పుడు నువ్వు చేసిన పనికి నిన్ను క్షమించడం అంత మూర్ఖత్వం మరొకటిలేదు! చావు!” అంటూ పేల్చాడు రెండుసార్లు.

బిగ్గరగా అర్చి కూలిపోయాడు పాల్. అతని చేతిలో స్ప్రే మెషిన్ దూరంగా పడింది. బుల్లెట్లు అతడి

స్ప్రేయింగ్ మన్ దుస్తుల్ని చీల్చుకొని పోయాయి!! గుండెలపై పొంగుతూన్న రక్తం అతడి దుస్తుల్ని తడి చేస్తూ క్రిందికి కారుతోంది.

అరవిందం పూనకం వచ్చినట్టు జనార్ధన్ వైపు తిరిగాడు.

తటాలున క్రింద వుంచిన సంచి అందుకొని అడ్డుపట్టుకొన్నాడు-జనార్ధన్! రివాల్వర్ పేల్చాడు అరవిందం!? బరువైన సంచి చిన్నాభిన్నమైంది. అందులో మెటల్ క్రిందికి రాలిపోయింది.

ఆలస్యం చేయకుండా చప్పున లోనికి గెంతాడు జనార్ధన్. ఈసారి అరవిందం పేల్చిన బులెట్ గోడ అంచుకు తగిలింది. పెచ్చులు ఊడిపోయింది గోడ అక్కడ బులెట్ విసురుకి!!

చురుగ్గా కదిలాడు అరవిందం. రెండు పుష్ టిన్స్ అందుకొని, పాల్ శవాన్ని తొక్కుకుంటూ కంగారుగా కదిలాడు!! రెండడుగులు వేశాక అనుకోకుండా అతడి కాలు క్రిందపడి వున్న స్ప్రే మెషీన్ పై పడింది! బటన్ నేలకు నొక్కుకుపోవడంతో, స్క్రూ ఆన్ అయింది!!!

కాలు తీసుకొనే వ్యవధి లేకపోయింది అరవిందానికి! రాతిపొరను చెక్కగల లాంటి బలమైన ఇనుప స్క్రూ అతడి బూటును ఛేదిస్తూ అరికాలుకు తగిలింది!!

భరించలేని బాధతో కెవ్వుమని అర్చాడు అరవిందం. విలవిల్లాడుతూ కాలును పట్టిన స్క్రూని విదిలించాడు. మెషీన్ పక్కకుపడి, తిరుగుతూనే వుంది శబ్దం చేస్తూ! చనిపోయిన పాల్ కళ్ళుమాత్రం నిశ్చలంగా వున్నాయి తెర్చుకొని!!

పోటపోటా రక్తం కారిపోతుంది అరవిందం కాలు నుండి! స్క్రూ లోపలికి దొలిచింది అతని కాలును! షర్టు చింపి కట్టుకట్టాడు. బాధను పళ్ళబిగువున ఓరుస్తూ వేన్ దగ్గరికి వెళ్ళి మెటల్ నింపిన తొట్టి లింక్ ను తొలగించి, వేన్ యొక్క స్టార్టు చేశాడు!!

మెల్లగా టర్నింగ్ తిప్పి ముందుకు పోనిచ్చాడు.

సరిగ్గా అదే సమయంలో మరోవైపునుండి రఘువీర్, మరికొంతమంది పోలీసులు ఎక్కివున్న పోలీసు జీపు, వెనగ్గా జగదీష్ కారు ఆ భవనం దగ్గరకు ప్రవేశించాయి.

వాహనాలు ఆగాక — జీపులోనుండి రఘువీర్ దిగి నిలబడ్డాడు. హెడ్ కానిస్టేబుల్స్ చకచకా క్రిందికి దిగారు.

కారు డోర్ తెరుచుకొని దిగి చెప్పాడు జగదీష్.

"రఘువీర్, ఇక్కడినుండే రివాల్వర్ పేలిన శబ్దాలు వినిపించాయి. భవనం లోపలికి వెళ్ళిచూద్దాం!?"

రఘువీర్ చెప్పడంతో కానిస్టేబుల్స్, హెడ్ జగదీష్ వెంట లోపలకు ప్రవేశించారు! చుట్టూ చూస్తూ బయట నిలబడిన రఘువీర్ కు అకస్మాత్తుగా కన్పించింది, మూడింగా వెళ్ళిపోతున్న వేన్! రఘువీర్ కనుబొమ్మలు ముడిపడ్డాయి!!

కాసేపట్లో జనార్దన్ ని దృఢంగా పట్టుకొని పోలీసులు, జగదీష్ బయటకు వచ్చారు!

రఘువీర్ జీపు ఎక్కి స్టార్టు చేసి "జగదీష్! మరొకడు వేన్ లో పారిపోతున్నట్టున్నాడు. నేను వెంబడిస్తాను. మీరంతా స్టేషన్ దగ్గరుండండి!" అన్నాడు జీపును స్పీడుగా ముందుకురికిస్తూ.

నిర్మానుష్యంగా వున్న ఆ రోడ్డుపై చివరికి కనిపిం

చింది రఘువీర్ కు, చాలాదూరంగా పోగిపోతున్న వేన్!
జీపు స్పీడు పెంచాడు క్రమంగా. వేన్ దగ్గరకు
పాగింది.

అరికాలిలో గాయాన్ని ఓరుస్తూనే చేతులు స్టీరింగ్ పై
బిగబట్టి డ్రైవ్ చేస్తున్నాడు అ ర విం ద ం. మెరుపు
వేగంతో ముందుకు పోతూంది వేన్. అయినా వెనుక
వదలకుండా వెంబడిస్తూంది జీపు.

దాదాపు ఐదునిమిషాలు గడిచాయి. ఎదురుగా రోడ్డు
మలుపుతిరిగి వుండడం గమనించిన రఘువీర్ తన వాహనం
స్పీడ్ ని తగ్గించి వేశాడు. అరవిందం మాత్రం అలాగే
పోనిస్తున్నాడు వేన్ ను. ఇంతలో మలుపు దగ్గరయ్యింది
బాగా!!

అరవిందం బ్రేక్ పై కాలువుంచి తొక్కి కొద్దిగా
నొక్కబోయాడు!? గాయంతో పుండుగా మారిన అతడి
కాలు అందుకు సహకరించలేదు!! అంతవరకూ బ్రేక్ వేసే
అవసరం రాకపోవడం వలన అరవిందం గ్రహించలేదు,
తన కాలు అందుకు పనికిరాదని!!!

అంతే! రెండు క్షణాలు కంగారుపడ్డాడు అరవిందం.
ఇంతలో మలుపు వచ్చేసింది. ఎడంకాలుతో బ్రేక్
నొక్కుదామని కాళ్ళు కదుపుతూ కుడివైపుకు ఒరిగాడు
అరవిందం. స్టీరింగ్ కంట్రోల్ తప్పింది ఆ కంగారులో!?
చేతులు వణుకుతుండగా బ ల మ ం తా ఉపయోగించి
తిప్పాడు స్టీరింగ్!! కొద్దిగా తిరిగింది స్టీరింగ్ ....

కారు, శర వేగంతో దేకుతున్నట్టుగా రోడ్డును దాటి
వెళ్ళి, క్రింద గడ్డి ప్రదేశంలో ముందుకి వేగంగా పోయి
ఎదురుగా దగ్గర దగ్గరగా వున్న రెండు పెద్ద చెట్లను
గుద్దింది పెద్ద ధ్వనితో!!!

మెడ విరిగిన అరవిందం ఆ క్షణమే చనిపోయాడు.

రఘువీర్ జీపు ఆపి త్వరగా క్రిందికి దిగి, నడుచుకుంటూ వచ్చి రోడ్డు అంచున నిలబడి, ఇంజన్‌తో పాటు చాలా భాగాలు తుక్కు తుక్కు అవగా పొగలు కక్కుతూన్న వేన్‌ను చూడసాగాడు....

—: అయిపోయింది :—

# శాశ్వత సమాధి

## కె.వి.వి. సత్యనారాయణరాజు

బస్ దిగి నలువైపులా చూశాడు శశాంక.

ఈదురుగాలి రివ్వున వీస్తోంది. వర్షపు జల్లు సన్నగా పడుతోంది. ఎత్తైన చెట్లమీద పడిన వర్షం ఆకులమీది నుంచి అంచెలంచెలుగా జారి భూమిని చేరేముందు లయ బద్ధంగా అదోరకమైన శబ్దం చేస్తోంది.

సముద్రమట్టానికి రెండువేల ఎనిమిదివందల అడుగుల ఎత్తులో యెంతో ఆహ్లాదకరంగా ఉంది అక్కడి వాతా వరణం.

మేఘాలు చేతికందే యెత్తులో శరవేగంతో ప్రయా ణిస్తున్నాయి.

రెండు చేతుల్నీ బలంగా రుద్దుకొని పాంట్ జేబులో చెయ్యిపెట్టి సిగరెట్ పాకెట్ బయటకు తీశాడు శశాంక.

లైటర్ తో సిగరెట్ వెలిగించి పొగ బలంగా పీల్చి వదులుతోంటే నరనరమూ ఉత్తేజంతో నిండిపోయింది.

బస్ దిగినచోట దక్షిణంవైపుగా సన్నటి కాలిబాట

ఒకటి వుంది. ఎయిర్ బాగ్ భుజాన తగిలించుకొని ఆ కాలిబాట వెంట నడక సాగించాడు శశాంక.

యూనివర్శిటీలో పోస్టు గ్రాడ్యుయేషన్ చేస్తున్నప్పుడే అతడి మనసు మూలికలవైపు ఆకర్షింపబడింది.

చదువు పూర్తి చేసి రీసెర్చిలో చేరాడు. నూటికి తొంభై తొమ్మిదిమంది పి. హెచ్. డి. డిగ్రీ కోసమే రీసెర్చిలో చేరతారు. కానీ అద్భుతమైన మూలిక నొక దాన్ని సంపాదించి దాన్ని మానవాళికి ప్రయోజనకరంగా ఉపయోగించాలనే సదుద్దేశ్యంతో అతడు రీసెర్చిలో చేరాడు.

ఒక ప్రాచీన గ్రంథంనుంచి అతడు సేకరించిన సమాచారం ప్రకారం—రాచపుండుపుని సమూలంగా నాశనం చేసే మూలికలా అడవిలో దొరుకుతాయి.

ఉదయం ఏడున్నరకు భద్రాచలం వెళ్ళే బస్ ఎక్కాడు వైజాగ్ లో. దాదాపు నూటయాభై కిలోమీటర్లు ప్రయాణంచేసి మధ్యాహ్నం ఒంటిగంటకు ఆ అడవి దగ్గర బస్సు దిగాడు శశాంక.

ఆ కాలిబాట వెంబడి దాదాపు ముప్పైమైళ్ళు నడిస్తే గానీ అతడు చేరాల్సిన గమ్యంరాదు. వాతావరణం బాగుంటే గంటకైదుమైళ్ళ చొప్పున ఆరుగంటల్లో అతడు గమ్యం చేరుకోవచ్చు.

ఆ కాలిబాటవైపు సెలయేరు ప్రవహిస్తోంది. గత నాలుగురోజులుగా ఆపు లేకుండా వర్షం కురిసినందున నేల తడితడిగా వుండి జారుతోంది. బాటకిరువైపులా నిలువెత్తు పెరిగిన గడ్డి, దేహానికి తగుల్తూ చికాకు కలిగిస్తోంది.

మైలుదూరం నడిచేసరికి అతడి దేహం పూర్తిగా తడిసి

పోయింది. సైత్రియూరి గొడుగులల్ల పెద్దగా ఉపయోగం కనబడలేదతడికి.

సుమారు వాలుగైను గంటలు నడిచాక కాలిబాట ఎడమవైపుకు వంపు తిరిగింది. నడుస్తున్నవాడల్లా ఆగిపోయి ఎయిర్ బాగ్‌ను క్రిందికి దించాడు.

అందులోంచి కంపాస్ తీసి పట్టుకు నడిచాడు. బాట వంపు తిరిగినవైపు తూర్పు దిక్కును సూచిస్తోంది.

దక్షిణ దిక్కుగా వెళ్ళాలంటే ఎదురుగా కనిపిస్తోన్న వాగును దాటాలి. కానీ కాలిబాట తూర్పువైపుకి తిరిగి వుంది.

కంపాస్‌ను బాగ్ లో వుంచి, పాంటూ, షర్టూ విప్పి వాటినికూడా బాగ్ లో పెట్టి, బాగ్ లోంచి టవల్ తీసి ఆ వాటర్ ప్రూఫ్ ఎయిర్ బాగ్‌ను వీపుమీద అడ్డంగా కట్టుకొని వదులుగా పెరిగిన రెల్లుగడ్డిని రెండు చేతులతోనూ పట్టుకొని జాగ్రత్తగా దిగాడు.

పది అడుగులు క్రిందికి దిగాక నీటిమట్టానికి చేరుకున్నాడు.

ఒడ్డున విశ్రాంతి తీసుకుంటోన్న నీటిపాములు అలికిడికి బెదిరి వాగు మధ్యకు వెళ్ళిపోయాయి చకచకా ఈదుకుంటూ. అవి నీటిపాములని తెలిసినా ఎందుకో అతని వళ్లు అప్రయత్నంగా జలదరించింది.

ఒకసారి వాగువైపు చూశాడు. నిశ్చలంగా వుందది. ఆరకిలోమీటరు దిగువున ఎంతో ఉధృతంగా పరవళ్ళు తొక్కుతూ ప్రవహించిన ఆ సెలయేరు అక్కడెంతో ప్రశాంతంగా వుండడంతో, అక్కడ లోతెంత వుంటుందో ఇట్టే అర్థం కాదతనికి.

అరవై అడుగుల వెడల్పున విస్తరించి వున్న ఆ

వాగును దాటడం పెద్ద కష్టమనిపించలే దతనికి.

ఒక్కసారి గాలి బలంగా పీల్చి వదిలి రెండు చేతులూ ముందుకు సాచి, కాళ్ళను గట్టుకతన్ని పెట్టి వాగులోకి దూకాడు.

నీళ్ళు చల్లగా తగిలాయతడి దేహానికి.

బారలు సాచివేస్తూ ఈదడం ప్రారంభించాడు. వాగు మధ్యలోకి చేరుకున్నాక—అక్కడెంత లోతుంటుందో చూడాలనే చిలిపి ఊహ కలిగిందతనికి.

అతడికా సమయంలో తెలియదు—తన చిలిపి కోరికే తన భవిష్యత్తునో మలుపు తిప్పబోతోందని.

ఆ ఊహ మనసులోకి రాగానే ఈతకొట్టడం మాని కాళ్ళు క్రిందికి వ్రేళ్ళాడేశాడు. కాలికి యేమీ అందలేదు.

నీరు మెడవరకూ వచ్చింది. మరికాస్త క్రిందికి దిగాడు నీళ్ళతడి చెవులవరకూ వచ్చాయి. కాలికేదో మెత్తగా తగిలింది కానీ అది బురదలాలేదు.

సన్నటి తీగ అతడి కాలికి చుట్టుకుంటున్నట్టుగా అనిపించి, కాలు బలంగా విదిల్చాడు. అయినా అతని కాలిని చుట్టుకన్న తీగ విడవలేదు.

అప్పుడతడి మొహంలో భయం ప్రవేశించింది. తన దారిన తాను వెళ్ళకుండా లోతెంతో చూడాలని ప్రయత్నించినందుకు తనను తానే తిట్టుకున్నాడు.

రెండు కాళ్ళూ బలంగా విదిల్చి, ముందుకు ఈదడం ప్రారంభించాడు, అతడెంత బలంగా విదిల్చినా అతడి కాళ్ళచుట్టూ అల్లుకున్న తీగమాత్రం జారిపోలేదు. అదసలు తీగో, పామో కూడా అర్ధంకాలేదతడికి.

ఒడ్డుకు చేరాక చూసుకోవచ్చు లెమ్మని వేగంగా ఈదసాగాడు.

కాస్సేపటిలోనే ఒడ్డుకు చేరుకున్నాడు శశాంక. ఆయాసంతో అతడి గుండె ఎగిరెగిరి పడుతోంది. తన రెండు కాళ్ళవైపూ చూసుకున్నాడు.

ఎడమ కాలికి చుట్టుకుని వుందో తీగ. తామరతూడు కంటే సన్నగా వుందది. తన ఆందోళనకు సవ్వొచ్చింది అతడికి. తననింత సేపూ యేడిపించింది ఈ నీటి మొక్కా?! అనిపించిందతడికి.

రెండు చేతులతోనూ దాన్ని తీసివేయబోయాడు. ఊహూ ఎంత బలంగా లాగినా రాలేదది. కాలిని దగ్గరకు తీసుకొని పరీక్షగా చూశాడు.

తన శరీరంలోంచి యేదో బయటకు ప్రవహిస్తున్నట్లుగా, సన్నటి గొట్టాలతో దేహంలోంచి రక్తం బయటకు తీస్తున్న ఫీలింగ్!

అదిరిపడ్డాడు శశాంక.

మైగాడ్! డ్రాసిరా, నెపెంథిస్ (కీటక భక్షక మొక్కలు) లాంటి మొక్క కాదు కదా ఇది?!

పరీక్షగా చూశాడు తీగవైపు.

టూర్నాన్మోలో స్పెషలైజేషన్ చేసిన అతడికది ఏరకం మొక్కో అర్థంకాలేదు.

నీటి మొక్కల కుటుంబాలు — నింఫేసీ. హైడ్రోకారిటేసీ—ఊహుం యే మొక్కతోనూ పోలిక కనబడ లేదు. దానిమీద చేత్తో రాశాడు. జిగురుగా, ఆకుపచ్చ రంగులో వుందది.

ఆలోచనలు మెదడును తినేస్తోంటే, నరాలు జివ్వుమని లాగుతున్నాయి. ముందు దాన్ని వదిలించుకునేందుకు కాలికీ తీగకూ మధ్యనున్న ఖాళీలో వేళ్ళు దూర్చి బలంగా లాగాడు.

ఇనుపతీగ అయినా కాస్సేపు ప్రయత్నిస్తే తెగుతుందేమోగానీ అది యెంతమాత్రమూ ఊడిరాలేదు. భయం అతన్ని తిరిగి ఆవహించింది. దగ్గర చాకులాంటి ఆయుధం యేదీ లేదు.

పరిస్థితి తన చేయి దాటి పోయిందనే ఊహ మదిలోకి రాగానే కళ్ళలోకి నీళ్ళు చిమ్ముకొచ్చాయి.

గాభరాగా వాచీవైపు చూశాడు. సమయం ఆరుగంటలైంది. కనుచీకటి పడింది. తనింకా ఇరవై మైళ్ళు నడిస్తేగానీ గమ్యం చేరుకోడనే ఊహ మదిలోకి రాగానే అతడి నరనాడులూ క్రుంగిపోయాయి.

మెల్లగా లేచి నిలబడ్డాడు. కానీ నిలబడలేక అంతలోనే కూలబడిపోయాడు. కళ్ళనుంచి కారుతోన్న నీటిని అదిమిపడుతూ రెండు చేతులమీదా పైకి ప్రాకసాగాడు.

గట్టు పైకి చేరుకునేందుకు ముప్ఫైనిమిషాలు పైనే పట్టిందతడికి. సూర్యుడు చెట్ల చాటున అస్తమించి చాలాసేపైంది. ఇక ఒక్క అడుగుకూడా వేసే స్థితిలో లేడతడు.

మరి కాస్సేపటిలోనే అతడికి స్పృహ తప్పింది.

## 2

శశాంక కళ్ళు విప్పాడు.

తలంతా దిమ్ముగా వుంది. ఒళ్ళంతా సూదులతో పొడిచినట్లుగా సలుపులు పెడుతోంది.

చేతులు పైకెత్తి కళ్ళు రుద్దుకోబోయాడు.

కానీ చేతులతడికి సహకరించలేదు.

తనకెదురైన భయంకరమైన అనుభవం హఠాత్తుగా అతడి స్మృతిపథంలోకి వచ్చి గజగజా వణికిపోయాడు.

అతికష్టంమీద చేతుల్ని స్వాధీనంలోకి తెచ్చుకొని,

కాలిమీదకు పోనిచ్చి ఆత్రుతగా తడిమాడు.

అక్కడక్కడా బుడిపెల్లా తగిలాయతడి చేతులకు. వాటిమీద తడితడిగా, జిగటగా తగిలింది చేతికి, ఏదో పసరు.

దిగ్భ్రమనుంచి తేరుకొని పరిసరాలను పరిశీలించాడు.

రెల్లుగడ్డితో నేయబడిన గుడిసె అది. క్రింద నేలంతా అలికి ముగ్గులు పెట్టబడి వుంది. తను పడుకున్న స్థలం వైపు చూసుకున్నాడు.

వెదురుగడలతో తయారుచేయబడిన మంచం అది. దళసరి నల్లటి దుప్పటికింద మెత్తగా వుండేందుకు ఆకులు వత్తుగా పరచబడి వున్నాయి.

ఓ పక్కగా చేతికందుబాటులో వెదురుముక్కలతో చేసిన చిన్నబల్ల వుంది. దానిమీద కల్వంలో ఎర్రటి ముద్ద వుంది. దాని పక్కనే మట్టికూజా వుంది.

అతికష్టంమీద లేచి కూర్చుని తడబడుతోన్న చేతుల్ని ముందుకుసాచి ఆ కూజాను పైకెత్తి నీళ్ళు గటగటా త్రాగాడు. ఆ మాత్రానికే ఆయాసం వచ్చిందతనికి.

కూజాను తిరిగి బల్లమీద వుంచబోతూ సాధ్యంకాక అలాగే వదిలివేశాడు దాన్ని. అతని చేతిలోంచి జారి పడింది 'దబ్' మనే శబ్దంతో.

తిరిగి వెనక్కి వాలుతూ కిర్రుమన్న చప్పుడు వినిపించి దృష్టటు సారించాడు శశాంక.

గుమ్మానికడ్డగా వున్న తడికను తోసుకుని వచ్చాడో యువకుడు. అతడి దేహం నల్లగా కండలు తిరిగివుంది.

తలచుట్టూ పట్టీలాంటిది బిగించబడి వుంది. రంగు రంగుల పూసల దండలతడి మెళ్ళో వ్రేలాడుతున్నాయి.

నడుంకు అడ్డంగా తోలుపటకాలాంటిది వుంది. మొల దాటని గుడ్డొకటి ఆ పటకా క్రిందినుంచి వ్రేలాడుతూ వుంది.

నుదుటున అర్ధ చంద్రాకారంగా పసుపురంగు బొట్టుంది. అతడు లోపలికడుగు పెట్టి శశాంక దగ్గరకు వచ్చాడు.

శశాంక రెండు చేతులూ జోడించి అన్నాడు—"మీ రెవరో నాకు ప్రాణదానం చేసి పోయే ప్రాణాన్ని నిలబెట్టారు."

ఆ యువకుడేమీ మాట్లాడలేదు, ఓసారి శశాంక వైపు చూసి క్రిందపడిన కూజా ఎత్తి బల్లమీద వుంచి, శశాంక పడుకున్న మంచం దగ్గర నేలమీద కూర్చుని అతనిమీద కప్పబడి వున్న పలచటి ఆచ్ఛాదను తొలగించాడు.

అక్కడక్కడా రక్తం గడ్డకట్టి వున్నచోట చేతో తడిమి తృప్తిగా తలాడించి—కల్వంలోని ముద్దను చేతిలోకి తీసుకొని, శశాంక దేహంమీద అక్కడక్కడా పిండాడు.

అతడి చేతివేళ్ళ మధ్యనుంచి పచ్చటి ద్రవం బొట్లు బొట్లుగా తన దేహంమీద పడినపుడల్లా సురుక్, సురుక్ మంటోంది శశాంకకు.

తన పని పూర్తిచేసి లేచి నిల్చున్నాడా యువకుడు. అతడొక్క మాటకూడా మాట్లాడకుండా వెళ్ళిపోయాడు.

తనక్కడికెలా వచ్చాడో తెలుసుకోవాలని శశాంక కెంతో ఆత్రుతగా వుంది.

"ఇదుగో అబ్బి మాట!" అని పిలిచాడు.

ముందుకు నడవబోయిన వాడల్లా ఆగి వెనక్కి తిరిగి—"అదంతా రేపు. ఈ దినానికేం మాట్లాడకు! సాయంత్రం

జొన్నరొట్టె అట్టుకొత్తాను. మాట్లాడకుండా తిని తొంగో!" అని వెళ్ళిపోయాడు.

భారంగా నిట్టూర్చి అతడు కనుమరుగయ్యాక చేతి కున్న వాచీవైపు చూసుకొని అదిరిపడ్డాడు శశాంక!

అతడి చేతికున్న ఆటోమేటిక్ డేట్ వాచీలోని తారీఖు ఆగస్టు పందొమ్మిదో తారీఖును సూచిస్తోంది.

తను ఆగస్టు పన్నెండో తారీఖున హైజాక్ లో బయలుదేరాడు. అదే రోజు సాయంత్రం ఆరుగంటలకు తనకు స్పృహతప్పింది. తిరిగి కళ్ళు తెరిచేసరికి తారీఖు పందొమ్మిది.

అంటే ....ఏడురోజులు తను స్పృహలేకుండా వున్నాడన్నమాట!

## 3

ఆ యువకుడితో గుడిసెలోంచి బయటకు వచ్చాడు శశాంక. నాలుగు రోజుల క్రితం అతడివంటిమీద వున్న గాయాలు మచ్చలకైనా మిగులలేదతడి వంటిమీద.

ఆ యువకుడు ముందు నడుస్తోంటే అతణ్ననుసరించాడు శశాంక.

దాదాపు కిలోమీటరు దూరం నడిచాక ఆ యువకుడు ఆగాడు. అక్కణించి బాట రెండుగా చీలి వుంది.

ఒకటి ఆగ్నేయంగానూ మరోటి నైఋతి దిశగానూ వున్నాయి. ఆ ఆటవిక యువకుడు ఒకసారి వెనక్కి తిరిగి శశాంకవైపు చూసి-"అవైపెప్పుడూ వెళ్ళమాక"—అని నైఋతి దిశగా వున్న సన్నటి కాలిబాటవైపు నడక సాగించాడు.

మరో రెండు కిలోమీటర్లు నడిచాక ఆ బాట అంతమై చుట్టూ అల్లిబిల్లిగా అల్లుకొన్న పొదలతో మూసుకుపోయిన

కంచె మధ్యను దారితీసింది.

ఆ యువకుడితో, కంచెదాటి లోపలకు ప్రవేశించిన శశాంకకు అచ్చటి వాతావరణం యెంతో ఆహ్లాదకరంగా అనిపించింది.

సుమారు పదిహేనువందల చదరపు గజాల విస్తీర్ణంలో మధ్య ఓ కుటీరం వుంది. ఆ కుటీరానికన్నివైపులా క్రమ పద్ధతిలో పెంచబడిన రకరకాల మొక్కలున్నాయి.

తీగలు, పొదలు, చిన్న చిన్న చెట్లు—ఇలా అన్ని రకాల మొక్కలూ రకానికొకటి చొప్పున వున్నా యక్కడ. ఆ మొక్కల్ని చూస్తూనే అతని కళ్ళు విచ్చు కున్నాయి.

వాటిలో ఎక్కువ భాగం అతనికి పరిచితమైన మొక్కలే. అవన్నీ ఔషధాలుగా ఉపయోగపడే మొక్కలేననే విషయం అతనికి స్ఫురించేందుకు ఎంతో సమయం పట్టలేదు.

ఇవన్నీ ఔషధాలనిచ్చే మొక్కలనే విషయం తెలియని వారెవరూ ఆ మొక్కలన్నిటినీ ఒకచోట చేర్చి ఒక క్రమపద్ధతిలో ఏ ప్రయోజనమూ లేకుండా పెంచరు.

అంటే....ఆ మొక్కలద్వారా లభించే ఔషధాల గుణగణాలు బాగా తెలిసిన వ్యక్తెవరో ఆ కుటీరంలో నివసిస్తూ వుండాలి. అదే నిజమైతే తనింతదూరం వచ్చి నందుకు, శ్రమపడి మూలికలకోసం అడవంతా తిరగ నవసరంలేకుండా అతణ్ని జాగ్రత్తగా కనిపెట్టుకొని వుంటే, తను ఖచ్చితంగా మానవాళికి ప్రయోజనకరమైన మూలికలను సంపాదించుకొని తిరిగి వెళ్ళవచ్చు.

ఆనందంతో గొట్టుమిట్టాడిందతని మనసు.

కుటీరంవైపు నడుస్తూ అటూ ఇటూ వున్న మొక్క

అను పరీక్షగా చూస్తున్న అతడి ఆలోచనలకు అంత రాయం కలిగింది—"ఎవరది?" అనే మాటలు గంభీ రంగా వినబడడంతో తలెత్తి చూశాడు.

విశాలమైన నుదురు, పొడవైన నాసిక, ఎత్తయిన కనుబొమలతో ఎంతో ఆకర్షణీయంగా, మరెంతో గంభీరంగా వున్నాడా వ్యక్తి.

కండలుదేరిన భుజాలు, దండల చుట్టూ రుద్రాక్ష మాలలు, మెడలో పొడవాటి రుద్రాక్ష దండలు, నుదుటి మీద అడ్డంగా విభూతి, మూరెడు గడ్డంతో పచ్చని పసిమి ఛాయతో ఎంతో ఆరోగ్యవంతంగా మరెంతో శుచిగా వున్నాడతడు.

శశాంకను తీసుకువచ్చిన ఆటవిక యువకుడు నడుం మీద రెండు చేతులూ వుంచి కొద్దిగా ముందుకు వంగి రెండుసార్లు కాళ్ళమీద పైకి లేచి, మామూలుగా నిల బడ్డాడు.

కుటీరంపు ద్వారంవద్ద నిలబడిన ఆ వ్యక్తి ఆశీర్వ దిస్తున్నట్టుగా కుడిచేతిని పైకెత్తి క్రిందికి దించాడు.

శశాంక ముందుకు నడిచి ఆ యువకుడి సరసన నిలబడి రెండు చేతులూ జోడించి నమస్కరించాడా వ్యక్తికి.

ఆ వ్యక్తి కలపంకించి అన్నాడు—"నువ్వేనా వాగు లేటి వాగు దగ్గర స్పృహలేకుండా పడివున్నది?"

తలాడించాడు శశాంక — పదిరోజుల క్రితం వాగు దాటిన తర్వాత అపస్మారక స్థితిలో తను పడిపోవడాన్ని గుర్తు తెచ్చుకుంటూ.

ఆ వ్యక్తి శశాంకను తన దగ్గరకు రమ్మని చేత్తో సైగ చేశాడు.

ముందుకు నడిచి కుటీరంలోకి అడుగు పెట్టాడు శశాంక.

మట్టితో అలికిన నేలమీద ఓ వైపు పులిచర్మం పరిచి వుంది. దానికన్నివైపులా రకరకాల సైజుల్లో కల్వాలు వున్నాయి.

ఆ కల్వాల్లో సగం సగం నూరిన ముద్దలున్నాయి. వాటి నుంచి రకరకాల వాసనలు వెలువడి ఆ చుట్టుపక్కల వున్న గాలికి వింత పరిమళాలు కలిగిస్తున్నాయి.

ఆ వ్యక్తి కల్వాలను దాటుకొని మధ్యలో పరిచిన పులిచర్మం మీద కూర్చుంటూ శశాంకను కూర్చోమని సైగ చేశాడు.

అతనికి నాలుగడుగుల దూరంలో రెండు జింక చర్మాలు పరిచి వున్నాయి. వాటిలో ఒకదాని వద్దకు చేరి ఒద్దికగా దానిమీద కూర్చున్నాడు శశాంక. మరోదాని మీద అతడినక్కడకు తీసుకువచ్చిన ఆటవిక యువకుడు ఆసీనుడయ్యాడు, భుజాన తగిలించి వున్న విల్లమ్ములను ఓ వారగా వుంచుతూ.

ఆ వ్యక్తి ఎడంచేతో కల్వాన్ని అందుకొని అందు లోని పదార్థాన్ని వేలితో తీసి వేలిని ముందుకు సాచాడు శశాంక వైపు.

శశాంక ముందుకు జరిగి అరచేతిని వెడల్పుగా సాచి పట్టుకున్నాడు. ఆ వ్యక్తి చేతిలోని పదార్థాన్ని శశాంక చేతిలో పదేలా విదిల్చి—"నోట్లో వేసుకో" అన్నాడు.

తటపటాయిస్తూనే శశాంక దాన్ని నోట్లో వేసు కున్నాడు. ఆ పదార్థం నాలికకు తగలగానే జివ్వుమని లాగింది. ఒక్క క్షణం మాత్రమే! వెంటనే యెంతో తియ్యగా అనిపించి అప్రయత్నంగానే దాన్ని గొంతు లోకి తోశాడు.

గొంతులోంచి లోపలకు జారుతున్నప్పుడు ఒళ్ళంతా ఆవిరైపోతున్న భావన కలిగింది. ముక్కులోంచి, నోట్లోంచీ వెచ్చటి గాలి వెలువడింది. కళ్ళలోంచి కొద్దిగా నీళ్ళు కారడం ప్రారంభించాయి. మెదడు క్రమంగా మొద్దుబారడం ప్రారంభించింది.

తనకేం జరుగుతోందో అర్థంకాలేదు శశాంకకు. శశాంక మొహంలో వ్యక్తమవుతోన్న భావాలను గమనించి తృప్తిగా తలాడించి అన్నాడా వ్యక్తి—"ఇప్పుడు చెప్పు. ఈ అడవుల్లోకి ఎందుకొచ్చావ్ నువ్వు?"

ఎక్కడినుంచో-లోతుగా వున్న నూతిలోంచి వచ్చిన మాటల్లా వినబడ్డాయి శశాంకకు.

కళ్ళు తెరిచే వున్నా అతనికేమీ కనబడడంలేదు. చెవుల్లో సన్నని హోరు ప్రారంభమైంది. క్రమంగా అతడి కళ్ళు మూతలు పడ్డాయి.

తన ప్రమేయం లేకుండానే తానెప్పుడు బయలుదేరాడో, ఏ ఆశయంతో ఆ అడవుల్లోకి వచ్చాడో ప్రారంభించాడు.

సుమారు అరగంట తర్వాత శశాంక మామూలుగా అయ్యాడు. ఆ వ్యక్తి అందించిన పదార్థం నోట్లో వేసుకున్నాక కొద్దిక్షణాలు మాత్రం అతడికి బాహ్యస్మృతి వుంది. ఆ తరువాత కళ్ళు తెరిచేవరకూ అతడికేం జరిగిందో తెలియదు. అతడి పక్కన ఆటవిక యువకుడు అలానే కూర్చుని వున్నాడు.

ఆ వ్యక్తి శశాంక కళ్ళలోకి చూస్తూ అన్నాడు— "నువ్వు నిజంగా మానవాళికుపయోగించే మూలికలు సంపాదించేందుకే ఇక్కడికొచ్చినట్టయితే ఈ క్షణంనుంచీ నిన్ను నా శిష్యుడిగా స్వీకరిస్తాను.

అయితే ఓ షరతు. నేను చెప్పిన పని యాంత్రింలా చేసుకుపోవడం తప్ప. నేను చేసే పనులను గురించి ప్రశ్నించినా, ఆరాతీసినా తీవ్ర పరిణామాలెదురొక్క వలసి వుంటుంది.

అందుకు నీకిష్టమైతేనే ఇక్కడ వుండొచ్చు. అలా కాని పక్షంలో నువ్విక్కణ్నించి వెళ్ళిపోవడం మంచిది."

ఆఖరి వాక్యం చెప్పినపుడతడి కంఠంలో కరకుదనం ధ్వనించింది.

శశాంక రెండు చేతులూ జోడించి అన్నాడు—"మీ షరతు నాకంగీకారమే! నేనెందుకొచ్చానోనే విషయం నేను చెప్పకుండానే తెల్సుకున్న మీరు, నేనిక్కడికొచ్చిన పని యెప్పుడు నెరవేరాలో కూడా ముహూర్తం పెట్టే వుంటారు.

"ఎంతకాలమైనాసరే మీ శుశ్రూష చేసుకుంటూ ఇక్కడే వుంటాను. మీరు వెళ్ళిరమ్మని ఆశీర్వదించినపుడు మాత్రమే నేను తిరిగి వెళ్ళేందుకు సిద్ధమవుతాను."

శశాంక కంఠంలో ధ్వనించిన దృఢత్వానికి ముగ్ధుడై నట్టుగా—"శుభం! నీ మాట నువ్వు నిలబెట్టుకుంటే, నీద్వారా లోకానికి మహోపకారంచేసే అవకాశం నాకు త్వరలోనే కలుగుతుంది—" అన్నాడా వ్యక్తి చేయెత్తి దీవిస్తూ.

శశాంక ఆ వ్యక్తి మొహంలోకి తేరిపార చూశాడు. అతడి మొహంలో యేదో దివ్యమైన తేజస్సు వుట్టిపడుతోంది. అతడి వయసెంతో చెప్పడం కష్టమనిపించింది శశాంకకు.

ఇంతలో ఆ వ్యక్తి—"గురుబరీ" అని పిలిచాడు.

శశాంకను తీసుకువచ్చిన యువకుడు—"స్వామీ!"

అంటూ ముందుకు వంగాడు.

"ఈ వచ్చ్రాడు నాతోనే వుంటాడు. ఇక నువ్వు వెళ్ళిరా!" అన్నాడా వ్యక్తి.

గురుబరీ లేచి నిలబడి నడుంమీద రెండు చేతులూ వుంచి ముందుకు వంగి, కాలి వేళ్ళమీద రెండుసార్లు పైకి లేచి, విల్లమ్ములు అందుకొని బయలుదేరాడు.

ఆ ఆటవిక యువకుడు కనుమరుగయ్యాక, ఆ వ్యక్తి పక్షి కిచకిచలాడినట్టు నోటితో చిత్రమైన సవ్వడిచేశాడు,

ఆ సవ్వడి పూర్తి అయ్యీ అవకుండానే కాలి అందెల చప్పుడు వినిపించింది శశాంకకు.

ఆ సవ్వడి వినిపించిన దిక్కుగా తలతిప్పాడు.

పురాణాల్లో వర్ణించబడిన మునిపత్నుల్ని తలపుకు తెచ్చే వస్త్రధారణతో ఆతడిముందు నిలబడి వుందో స్త్రీ.

చామనఛాయగా, కోల మొహంతో, విశాలమైన కళ్ళతో, మెదటి చూపులోనే 'బాగుంది' అనిపించేలా వుందా పడతి.

ఆమె వయసు పాతిక్కీ ముప్ఫైకీ మధ్య ఎంతైనా వుండొచ్చనిపించింది శశాంకకు. ఆమె మెడలో రుద్రాక్షమాల వేళ్ళాడుతోంది. ఆమె వక్షస్థలాన్ని సరిగ్గా మధ్యకు గీతగీసినట్టుగా వుందది.

శశాంక ఒక పట్టాన కళ్ళు తిప్పుకోలేక పోయాడామె నుంచి. ఆమె మాత్రం శశాంకవైపు ఒకే ఒక్కసారి చూసి, తరువాత తన దృష్టి నా వ్యక్తివైపు మరల్చింది.

ఆ వ్యక్తి అన్నాడామెతో—"మానసా, ఈ యువకుడు మనతోనే వుంటాడు. మన కుటీరం వెనుక వున్నత పతివాటికలో ఇతడికి బస యేర్పాటు చెయ్యి. ఈలోగా తేజద్రవాన్ని సిద్ధంచెయ్యి."

ఆమె వినయపూర్వకంగా తలూపి లోపలికి వెళ్లే ముందోసారి శశాంక వైపు చూసింది.

అతడి చూపులు తన వక్షస్థలంమీద తారట్లాడ డాన్ని గమనించి బెదిరిన లేడిపిల్లలా చెంగున గృహాంతర్భాగం లోకి దూకింది.

ఆ తరువాత కాస్సేపటివరకూ ఆ వ్యక్తేమీ మాట్లాడ లేదు. తన యెదురుగా వున్న ఒక కల్వంలోని సగం నూరబడిన మందును మెత్తగా నూరడంలో మునిగిపోయాడు తదేక దీక్షతో.

అతడు చేసే పనిని చూస్తూ కూర్చున్నాడు శశాంక. ఇంతలో అందెల సవ్వడి తిరిగి వినిపించింది.

మానస ఓ చేత్తో పట్టి కూజాను నడుంమీద పెట్టు కొని, మరో చేత్తో కప్పు ఆకారంలో వున్న రెండు మట్టి పాత్రలను తీసుకొని వచ్చింది.

కూజాను ఇద్దరి మధ్య వుంచింది. ఒక మట్టిపాత్రను శశాంక ముందూ, మరొకదాన్ని ఆ వ్యక్తి ముందూ వుంచి. ఆ వ్యక్తి కళ్ళలోకి చూసింది.

అతడు చేస్తున్న పనిని ఆపి—"ఊ" అన్నాడు.

మానస కూజాను పైకెత్తి ముందుగా ఆ యువకుడి ముందుంచిన మట్టికప్పులో కూజాలోని ద్రవాన్ని పోసింది.

తరువాత ఆ వ్యక్తి ముందున్న పాత్రలో కూడా కొంచెం ద్రవంపోసి ఓ వారగా నిల్చొంది.

శశాంక తన యెదురుగా వుంచబడిన పాత్రలోకి చూశాడు.

పసుపు పచ్చగా, మేలిమి బంగారాన్ని తలపింప జేసేలా వుందా పాత్రలోని ద్రవం.

కళ్ళెత్తి ఆ వ్యక్తివైపు చూశాడు.

అతడు గద్దాన్ని ఓసారి దువ్వుకొని అన్నాడు—"నీ ముందుంచబడింది—తేజద్రవం. ఇది తయారుచేసేందుకు పది సంవత్సరాలు అహోరాత్రులూ శ్రమించాను. నా పేరు—తేజస్వి కలిసివచ్చేలా దీనికి తేజద్రవం అని పేరు పెట్టాను. నాగరికపు మనుషుల ఊహకుకూడా అందని అద్భుతమైన రుచీ, శక్తీ దీనికి వున్నాయి."

శశాంక ఆశ్చర్యంగా చూశాడు.

తేజస్వి తనముందున్న మట్టిపాత్రను పైకెత్తి ఆ ద్రవాన్ని త్రాగడం ప్రారంభించాడు. శశాంక కూడా తన ముందున్న పాత్రనెత్తి ఆ ద్రవాన్ని కొంచెం త్రాగాడు.

నాలికకు తగిలీతగలడంతోనే యేదో అనిర్వచనీయమైన అనుభూతి కలిగింది శశాంకకు. ఎంతో మధురంగా సువాసనాభరితంగా వుంది ద్రవం.

మట్టిపాత్రలోని ద్రవాన్ని త్రాగడం పూర్తిచేసేసరికతడి మనసు స్వర్గంలో విహరించడం ప్రారంభించింది. ఇంపోర్టెడ్ లిక్కర్స్ కంటే ఎన్నోరెట్లు అద్భుతంగా అనిపించిందతడికా ద్రవం.

ఆ ద్రవాన్ని రోజుకోసారి త్రాగుతూ జీవితాంతమూ మరే కోరికలూ లేకుండా అక్కడే ఆనందంగా జీవించవచ్చనిపించిందతడికి.

అభినందనపూర్వకంగా తేజస్వివైపు చూస్తూ అన్నాడు: "మీరిచ్చిన తేజద్రవాన్ని వర్ణించేందుకు నాకు తెలిసిన భాషల్లో మాటల్లేవు. మీ తెలివితేటలు అత్యద్భుతం.

ఇక్కడికి వచ్చినందుకు నా ఆశయం నెరవేరుతుందనే నమ్మకం యెంతగానో బలపడింది నాలో. మీరు నన్ను శిష్యుడిగా స్వీకరించడం నా అదృష్టం."

తేజస్వి మొహం తీక్షణంగా మారింది. కటువుగా అన్నాడతడు—"నన్ను పొగిడి, నానుంచి నీవేం ఆశిస్తున్నావో పదేపదే పరోక్షంగా తెలియజేయనవసరంలేదు."

శశాంక కంగారుపడ్డాడు.

"క్షమించండి గురుదేవా, నా ఉద్దేశ్యం అదికాదు. నేను మనఃస్ఫూర్తిగానే మిమ్మల్ని అభినందిస్తూ, నా అదృష్టానికి నన్ను నేనే అభినందించుకుంటున్నాను."

తేజస్వి యేమీ మాట్లాడకుండా తన ముందున్న కల్వాల్లోంచి ఒకదాన్నతడికి అందించి—"జాగ్రత్తగా నూరు. మరీ పలచగా అయిపోకుండా. జాగ్రత్తగా ముద్దలా తయారుచెయ్" అని లేచి నిల్చున్నాడు.

మానస కూజాను పైకెత్తి నడుంమీద పెట్టుకొని ఇంట్లోకి దారితీసింది.

తేజస్వి కుటీరంలోంచి బయటకు వచ్చి, కుటీరానికి కుడివైపున వున్న మొక్కల మధ్య తిరుగుతూ ఒకో మొక్కనే పరీక్షగా చూస్తున్నాడు.

## 4

తపతి వాటికలో వెదురు కర్రల మంచంమీద వెల్లకిలా పడుకొని ఆలోచించసాగాడు శశాంక.

తనిక్కడికి వచ్చి నాలుగురోజులయింది. కాలకృత్యాలు తీర్చుకున్నాక తేజస్విముందు కూర్చోవడం—అతడు చెప్పినట్టుగా వివిధరకాల మూలికల్ని నూరడం, ఆ నూరిన ముద్దల్ని చిన్న చిన్న గుళికలుగా చేసి నీడలో ఆరబెట్టడం, తిరిగి సాయంత్రం వాటిని పోగుచేసి చిన్న చిన్న వెదురు బుట్టల్లో సర్దడం.

ఇంచుమించుగా ప్రతిరోజూ ఇదే పని తనకు. తనతో ఫలానా పని చెయ్యమని చెప్పడం తప్ప అధికంగా

ఒక్క మాటకూడా మాట్లాడడంలేదు తేజస్వి.

ఆ మూలికలేమిటో తెలుసుకుందామని తనుచేసిన ప్రయత్నాలన్నీ విఫలమవుతూనే వున్నాయి.

అందుకు కారణం—అతడు తనకు నూరమని ఆకులు, వేర్లు, ఇతర మొక్కల భాగాలుకాక సగం నూరిన ముద్దలు మాత్రమే ఇస్తూండడం.

అంగట్లో అన్నీ వున్నా అల్లుడి నోట్లో శని-అన్నట్టు మూలికల మొక్కలన్నీ ఆ ఆవరణలోనే వున్నాయి' కానీ ఏ మొక్కల్ని ఎప్పుడు పోగుచేసి వాటి నెంతెంత ప్రమాణంలో కలిపి తనకిస్తున్నాడో గానీ ఒక్క చిన్న ఆధారంకూడా దొరకలేదు ఈనాటివరకూ.

అతడు తయారుచేసే మందుల్లో చాలా రకాలు న్నాయి. ప్రతిరోజూ సాయంత్రం అయిదు ఆరు గంటల మధ్య చుట్టుపక్కల వున్న గ్రామాల్లోని ఆటవికులు వస్తారు.

వారి మాటల్ని ఓపిగ్గా విని తన పక్కనే వున్న వెదురు బుట్టల్లోని గుళికలను ఇస్తాడు తేజస్వి. ఒకసారా గుళికను తీసుకున్నవాడు మర్నాడు రాగా తను చూడ లేదు.

ఒకే డోస్ ... జ్వరం, వాంతులు, విరేచనాలు, పాముకాట్లు, పక్షవాతం, ఉబ్బసం, ఇలా ఏ రోగానికైనా తేజస్వి ఒకేఒక డోస్ ఇస్తాడు. దాంతోసరి.

సాయంత్రం అతడు అడవిజాతి వాళ్ళకు వైద్యం చేస్తున్నంతసేపూ మానస అతడి పక్కనే కూర్చుని అతడు సూచించిన గుళికలను వెదురు బుట్టల్లోంచి తీసి తేజస్వికి అందిస్తుంది.

తనను మాత్రం ఆ సమయంలో దగ్గరకు చేరనివ

కుండా ఆవరణలోని మొక్కలకు పాదులు తవ్వి, కలుపు తీయమని నిర్దేశించాడు తేజస్వి.

అతడినుంచి ఆ అద్భుతమైన మూలికల రహస్యాన్ని రాబట్టడం ఎలా?

వెదురు తడిక కిర్రుమని చప్పుడవడంతో ఉలిక్కిపడ్డాడు శశాంక.

ఓ చేత్తో పళ్ళన్నీ మరో చేత్తో కూజాను పట్టుకొని లోపలకు ప్రవేశించింది మానస.

ఎప్పటిలానే ఆమెను చూస్తూనే అతడి హృదయపు ఉద్వేగం పెరిగింది. తనెప్పుడు కళ్ళలో కళ్ళు కలిపినా బెదురు చూపులు చూస్తుందామె.

అవసరానికి మించి ఒక్క మాటకూడా మాట్లాడలేదామె ఇంతవరకూ. గత నాలుగురోజుల్నించీ తనామెనెంత పలకరించాలని ప్రయత్నించినా పట్టించుకోకుండా తప్పుకు తిరుగుతోంది,

తేజస్వి తనకు మూలికల రహస్యం యెప్పటికైనా చెబుతాడో లేదో తెలియదు. అతడు చెప్పకపోతే తను చేయగలిగిందేమీ లేదు—కనబడిన కొన్ని కొత్త మొక్కల్ని పోగుచేసి వాటి నైడెంటిఫై చేసుకునేందుకు తిరిగి యూనివర్శిటీకి పోవడం తప్ప.

అదే తన ఆశయం అయితే తనింతవరకూ రానవసరం లేదు. ఇక్కడి పరిస్థితి మొదట్లో ఆశాజనకంగా వున్నా, నాల్రోజులకే తనకు నిరాశ నిస్పృహలావహించాయి.

ఏదో ఒకటిచేసి మూలికల రహస్యాన్ని చేజిక్కించుకోవాలి! మానసను ఎరగా ఉపయోగించుకుంటే?

ఆ ఊహాకే సన్నగా వణుకు ప్రారంభమైందతడిలో. ఏదో తెలియని ఆనందమూ కలిగిందతడికి.

కానీ ఆమెనెలా టాకిల్ చేయడం?

ఒకవేళ తన ప్రయత్నం బెడిసికొడితే??

తనికృణించి ప్రాణాలతో బయటపడదు. కానీ ధైర్యం చేయక తప్పదు.

మానస అతడికి దగ్గరగా వచ్చి శయ్యపక్కనున్న మట్టి దిమ్మమీద ఆ పళ్ళెం వుంచి, కూజాను క్రిందికి దించింది. అతడివైపు చూడనైనా చూడకుండా వెను దిరిగింది.

ఆమె అడుగు ముందుకు వేసేలోగా—"మానసా" అని పిలిచాడు లోగొంతుకతో.

ఆమె ఆగింది.

ఆగినప్పుడామె నడుంమీది చర్మం ఓవైపు అడ్డంగా ముడతపడింది లోతుగా. ఆమె పృష్ఠభాగపు అందాలను తలనుంచి పాదాలవరకూ అతడు వీక్షించి ఆనందించే లోగా ముందుకు తిరిగిందామె.

క్షణకాలం ఆమె మొహంలోకి చూశాడు శశాంక. ఎప్పటిలానే ఆమె కళ్ళలో బెదురు ప్రస్ఫుటమౌతోంది.

ఈసారామె వక్షస్థలం ఎగిసెగిసి పడుతోంది, బహుశ ఏకాంతంలో అతడికంత దగ్గరగా మొదటిసారి నిలబడవలసి వచ్చిందనే ఊహ మనసులోకి రావడం వల్లనేమో!

పిలవడమంటే పిలిచాడుగానీ, ఆమెతో ఏం మాట్లా డాలో అర్థంకాలేదతడికి.

అతికష్టంమీద గొంతు పెగల్చుకొని—"నేనెప్పుడు పలకరించినా నాతో మాట్లాడవెందుకని?" అనగలిగాడు.

ఆమె బెదురు కళ్ళలో ఆసక్తి తొంగిచూసిందీసారి. ఆమాత్రం రెస్పాన్స్ చాలనుకున్నాడేమో—"మరోలా

అనుకోకండి, శాస్త్ర యెక్కువగా మాట్లాడడం నాకల వాటు. ఇక్కడికొచ్చిన దగ్గర్నుంచి మాట్లాడేందుకు మనిషి లేక పిచ్చెక్కినట్లుగా వుంది నాకు. మీకభ్యంతరం లేకపోతే రోజూ కాస్సేపు నేను మాట్లాడే సొద విని వెళ్ళండి. మీరేం మాట్లాడనఖ్ఖరలేదులెండి నాతో" అన్నాడు శశాంక.

అతడూహించని విధంగా అతడిముందు మొదటిసారిగా కిసుక్కున నవ్వింది ఆమె. ఆమె అలా నవ్వుతోంటే యెంతో మనోహరంగా వుంది.

అతడేదో మాట్లాడబోయేంతలో ఆమె తన చూపుడు వేలిని నోటికడ్డంగా వుంచి 'ఇష్' అని సన్నగా శబ్దంచేసి లోగొంతుకతో అంది—"ఇప్పుడికేమీ మాట్లాడకండి. రేపు రాత్రి తేజస్వి శాంభవి గుహల దగ్గరకు వెళతారు. అప్పుడు మాట్లాడుకుందాం."

అతడి గుండె ఒకసారి ఆగి కొట్టుకుంది.

అతడికి మరొక్కమాట మాట్లాడే అవకాశమివ్వకుండా—ఆమె విసవిసా నడుచుకుంటూ వెళ్ళిపోయిం దక్కణ్ణించి.

మానస వెళ్ళిపోయాక కూజాలోంచి తే:ద్రవాన్ని వంచుకొని త్రాగాడు.

తన భర్త లేని సమయాన తనతో మాట్లాడేందుకామె వస్తోందంటే....అదీ రాత్రి సమయంలో....

'ఇయ్య' అంటూ సంతోషం పట్టలేక పిచ్చిగంతులు వేశాడు శశాంక.

## 5

మర్నాడు రాత్రి ఏడున్నర గంటలవేళ అతడి కుటీరంలోకి వచ్చింది మానస.

రోజాలా కాకుండా ఆ రాత్రామె అద్భుతంగా అలంకరించుకొని వుంది. మామూలుగా చామనఛాయగా వుండే మానస, ఆ రోజు మొహానికేం పూసిందో గానీ పచ్చని పసిమి ఛాయతో మిసమిసలాడుతోంది.

ఆమె శరీరంలోకి అడుగు పెట్టగానే సువాసనాభరితమైన పరిమళం ఆ ప్రదేశమంతా వ్యాపించింది. వస్త్రధారణ మామూలుగానే వున్నా, ఆమె కట్టూ నడకా యెంతో ఆకర్షణీయంగా అనిపించాయతడికి.

ఆమె వాలకం చూశాక — ఆరాత్రామె కేవలం తనతో ముచ్చటించేందుకే రాలేదనీ, తన ముచ్చటతీర్చే ఉద్దేశ్యంతోనే ఆమె అంత అద్భుతంగా అలంకరించుకొని వచ్చిందనీ అర్థమైందతడికి.

అతడి దగ్గరకు వచ్చి పళ్ళాన్ని మంచం పక్కనే వున్న మట్టి దిమ్మమీద వుంచి కూజా క్రిందికి దించింది.

ఆమె కళ్ళలోకి సూటిగా చూశాడు శశాంక.

కనురెప్పలు ఒకసారి తాటించి — "ఏమిటి చూస్తున్నారు?" అంటూ అవసరంలేకపోయినా బిగుతుగా ఒంటిని చుట్టుకొని ఉన్న చీర చెంగునోసారి సర్దుకుంది.

అతడికామె అర్థమైంది.

ఇహ అతను తెలుసుకోవలసిందల్లా — ఆమె అంత త్వరగా అతడికెందుకు చేరువ అయ్యేందుకు ప్రయత్నించిందనేది.

ఆ ఆలోచన మనసులోకి రాగానే ఉలిక్కిపడ్డాడు శశాంక. ఒకవేళ తనను పరీక్షించేందుకు తేజస్వి పంపగా రాలేదుకదా ఆమె?

అతడి గుండె ఝల్లుమంది!

అంతలోనే మరో ఆలోచన అతడి మెదడు నాక్రమించుకుంది. అదే నిజమైతే మొదటినుంచీ ఆమె తనను కవ్వించేందుకు ప్రయత్నించాలి. తను కవ్వించేటంతవరకూ ఆగి వుండకూడదు.

మనసు స్థిమితపడిం దతడికి.

అతడికి మరింత సమీపంగా వస్తూ —"ఏమిటి ఆలోచిస్తున్నారు, నన్నెదురుగా వుంచుకుని?" అంది మానస.

మామూలుగా అయ్యాడు శశాంక — "ఏంలేదు, నామీద దేవిగారికింత త్వరగా యెలా దయ కలిగిందా? అని."

అతడు నవ్వుతూనే అన్నా ఆమె మొహం ముడుచుకుంది.

"అంతేలే....అడగ్గానే ఒప్పుకుంటే మీ మగవాళ్ళకు చులకనే కదా మరీ...." గారంపోతూ దీర్ఘంతీస్తూ అంది మానస.

తనామె నేం అడిగాడు? ఆమె యే విషయంలో తన అంగీకారాన్ని తెలియజేసింది?

ప్రశ్నలు మెదడును దొలిచేస్తోంటే చిరునవ్వు మొహంలోకి తెచ్చుకుని—"క్షమించండి. మీ మనసు నొప్పించానేమో? మీలాంటి అందమైన ఆడవాళ్ళను చూస్తే ఏం మాట్లాడాలో తెలిసిచావదు, నా వెధవ నోటికి" అని మూతిమీద అరచేత్తో చరుచుకున్నాడు.

ఆ బాణీ అద్భుతంగా పనిచేసిందామె మీద. కిలకిలా నవ్విందామె.

మంచంమీద కూర్చున్నవాడల్లా లేచి నిల్చుని ఆమె తెచ్చిన పళ్ళెం అందుకుంటూ — "మీరూ తినరూ నాకోసం!" అని అభ్యర్థిస్తున్నట్టుగా చూశాడు.

సిగ్గుల మొగ్గే అయిందామె.

కబుర్లు చెబుతూ చతురోక్తులతో ఆమెను నవ్విస్తూ భోజన కార్యక్రమం ముగించాడు శశాంక. అతిడు చేతులు కడుక్కున్నాక ఆ పళ్ళెం చేత్తో పట్టుకొని వెనుదిరిగిందామె.

చేజిక్కిన అవకాశం చేయి జారిపోతోందని కంగారు పడ్డాడు శశాంక. ఆమెకంటే వేగంగా నడిచి, గుమ్మానికి అడ్డంగా వున్న వెదురు తడికను మూసి అక్కడే నిలబడి దీనంగా మొహంపెట్టి అన్నాడు శశాంక—

"వెళ్ళిపోతున్నారా?"

"వెళ్ళక ఇక్కడే వుండిపొమ్మంటావా?" చిరుకోపం తొంగిచూసిందామె గొంతులో. పెదాలుమాత్రం చిరు దరహాసం చిలికిస్తున్నాయి.

దాంతో ధైర్యం వచ్చిందతడికి.

ముందుకు నడిచి ఓ చేత్తో ఆమె చేతిలోని పళ్ళా నందుకొని క్రింద పెడుతూ ఆమెకు దగ్గరగా జరిగి ఆమె కళ్ళలోకి చూస్తూ, — "వెళ్ళిపోతారా?" అని అడిగాడు.

కనురెప్పలు ఒకసారి తాటించి అతడి కళ్ళలోకి సూటిగా చూసిందామె. అతడి కళ్ళు అంతులేని కాంక్షను వ్యక్తం చేస్తున్నాయి.

అతడి చూపులామె దేహం చేసే ప్రకంపనలమీదా, అందుకనుగుణంగా కదుల్తోన్న ఆమె అవయవాలమీదా కేంద్రీకృతమై వున్నాయి.

అతడామెకు మరికాస్త దగ్గరగా జరిగాడు.

అతడి దేహం నాలుగైదుచోట్ల ఆమె దేహాన్ని స్పృశిస్తోంది.

ఒక్కడుగుకూడా వెనక్కువేయకుండా ఆమె అలాగే

నిలబడడంతో అతడిలో తెగింపు వచ్చేసింది.

ఆమె ఎంత అభ్యంతరం పెట్టినా అతడివా పట్టించు కునే స్థితిలో లేడు. అతడేం చేసినా యెదురుతిరిగే స్థితి నేవాడో దాటిందామె.

ఆ తరువాత—ఆమెను శయ్యమీదకు చేర్చేందుకు యెక్కువ సమయం పట్టలేదతడికి.

స్త్రీ సుఖం అతడికి కొత్తగాకపోయినా—మానసతో అనుభవం అతడికెంతో ఉత్తేజకరంగా వుంది.

మంచంమీద అతడి పక్కనే పడుకొని వున్న మానస రెండు చేతులూ తలక్రిందచేర్చి అరమోడ్పు కళ్ళతో అస్పష్టంగా గొణిగింది—"నేనెంత అదృష్టవంతురాల్ని!"

తృప్తిపడిన కళ్ళతో ఆమెవైపు తిరిగి—"నువ్వు కాదు మానసా.... నేను.... నేనెంతో అదృష్టవంతుణ్ని!" అన్నాడు శశాంక ఆమెను దగ్గరగా లాక్కుంటూ.

కాస్సేపయ్యాక అంది మానస—"నెలకు రెండుసార్లు పున్నమి, అమావాస్య రాత్రుల్లో ఆ గుహాలవద్దకు వెడతాడు తేజస్వి. ఆ రాత్రంతా గుహల్లో గడిపి తెల్లవారు ఝామున తిరిగి కుటీరానికి చేరుకుంటాడతడు.

ఆ రెండు రోజులూ అతడు తన కుటీరంలోని నేల మాళిగలో గడుపుతాడు. అతడేం చేస్తాడో యెవరికీ తెలియదు, ఆ రెండు రోజులూ అతణ్ని చూసేందుకు ఆటవికులెవరూ కూడా ఎంత అనారోగ్యంతో బాధపడినా ఆ రెండు రోజులూ రారు."

వెదకబోయిన తీగ కాలికి తగిలినట్టుగా ఆమె ఆ టాపిక్ ఎత్తడం ఎంతో శుభసూచకంగా అనిపించిందతడికి.

తిరిగి మానసే అంది—"దాదాపు అయిదేళ్ళనుంచీ ఈ

వైద్యం శుశ్రూష చేస్తున్నాను. నెలకు నాలుగుసార్లే అయినా వాణ్ని భరిస్తున్నాను. ఇంకా యెంతకాలం ఇక్కడ పడిగాపులు కాయాలో అర్థంకావడంలేదు."

ఆమె మాటల్ని వింటూనే శశాంక ఉలిక్కిపడ్డాడు.

అతడికో విషయం స్ఫురించింది. ఆమె తేజస్వి భార్య కాదు. అందుకే అంత త్వరగా తనకు దగ్గరగా వచ్చిందామె. తనలాగే ఆమెకూడా యేదో పనినిమిత్తమై అక్కడ చేరింది. అంతవరకూ తనూహించగలడు.

అతడి ముఖకవళికల్ని గమనిస్తూ అందామె-"ఆర్.కె. మల్టీ నేషనల్ డ్రగ్స్ కంపెనీ పేరు నువ్వు వినేవుంటావు. ఆ కంపెనీలో జూనియర్ సైంటిస్టు నేను.

మా కంపెనీ డ్రగ్సును తయారుచేసి అమ్మడమే కాకుండా డ్రగ్స్ మీద రీసెర్చికూడా చేస్తోంది. ప్రస్తుతం ఇనీషియల్ స్టేజిలో కేన్సర్‌ని క్యూర్ చేసే మందులేతప్ప కొంచెం ఎడ్వాన్స్ అయ్యాక మందులేం లేవు.

మా కంపెనీ దాన్ని ఛాలెంజ్‌గా తీసుకొని ఆ ప్రాజెక్టు నాకు వప్పగించింది. మా డ్రగ్స్ రీసెర్చి ఇన్స్టిట్యూట్‌లో ఈ తేజస్వి సీనియర్ సైంటిస్టుగా పనిచేసేవాడు, నేనక్కడ చేరకముందు. అతడూ కేన్సర్ ప్రాజెక్టుమీద పనిచేసేవాడు.

అర్థాంతరంగా అతడి భార్యాబిడ్డలు మరణించడంతో విరక్తిచెంది ఆ ఉద్యోగాన్నొదిలేసి అక్కడినుంచి మాయమయ్యాడితడు. అక్కడినుంచి బయటకు వచ్చేసినా అతడా విషయంమీదే పరిశోధన చేస్తున్నాడు.

మొదటినుంచీ ఇతనిమీద కన్నేసి వుంచిన మా మేనేజ్‌మెంట్ ఇతని ఆరాతీసి—ఇతడు ఆంధ్రప్రదేశ్ అడ

వుల్లో విశాఖపట్నం జిల్లాలోని రాఘవేంద్ర నగర్‌కు నైఋతి దిశగా ముప్పై మైళ్ళ దూరంలో నివాసం యేర్పరచుకున్నాడని తెలుసుకొని—ఇతడిన్ని ఛేజ్ చేసి ఆ పరిశోధనల సారాంశాన్ని అందజేసే పనిని నాకు వప్పగించింది. అప్పటినుండి ఇతడికి శిష్యురాలుగా చేరి శుశ్రూష చేస్తున్నాను.

నేనిక్కడికొచ్చి దాదాపు అయిదేళ్ళయినా తన పరిశోధనా ఫలితాల్ని అతడింతవరకూ నాకు తెలుప లేదు. అయితే అతడు రోజూ ఆడవిజాతి వాళ్ళకు వైద్యం చేసేటపుడిచ్చే గుళికలను గురించి మాత్రం కొంత తెలుసు నాకు.

నెలకు రెండుసార్లతడు శాంభవీ గుహాల దగ్గరకు వెడతాడు. మర్నాడు మహా హుషారుగా వుంటాడు.

ఏదో రహస్యం అక్కడే వుంది. అతడు చేసే పరిశోధనల రహస్యం అక్కడే ఉండివుండాలి.

ఇదివరకు నేనొక్కదాన్నే కనుక అంతగా ధైర్యం చేయలేకపోయాను. ఇప్పుడు నువ్వు నాకు తోడు దొరికావు కనుక మనిద్దరమూ కలిసి ఆ రహస్యాన్ని ఛేదించ గలమనే అనుకుంటున్నాను...."

గుక్కతిప్పుకునేందుకు ఆగింది మానస.

ఆమె చెప్పినదంతా విన్నాక పట్టరాని ఆనందంతో తలమునకలై ఆబగా ఆమెను దగ్గరగా లాక్కున్నాడు శశాంక.

అప్పుడు సమయం—రాత్రి పన్నెండు గంటలు.

అంతవరకూ వాళ్ళిద్దర్నీ పరీక్షగా చూస్తోన్న రెండు కళ్లు—అక్కడినుంచి కదిలాయి.

# 6

తేజస్వి కుటీరంనుంచి బయలుదేరిన ఆ బాట ఈశాన్య దిక్కుగా వచ్చి అక్కడినుంచి రెండు దారులుగా చీలింది. ఒక బాట వాయువ్యంగానూ, మరొకటి ఆగ్నేయం గానూ వున్నాయి. కుటీరంనుంచి బయటపడిన తేజస్వి అక్కడకు వచ్చాక ఆగ్నేయ దిశగా నడవడం ప్రారంభించాడు.

అతన్ననుసరించి వచ్చిన శశాంకకు ఆగ్నేయ దిశగా తిరగబోతోండగా—తనను తేజస్వి దగ్గరకు తీసుకొచ్చే ముందు అక్కడోసారి ఆగి 'ఆగ్నేయ దిశగా వెళ్ళమాక!' అని గురుబరి చెప్పడం గుర్తొచ్చింది.

వెన్నెల పుచ్చపువ్వులా అడవంతా పరచుకొనివుంది. పిండారబోసినట్టున్న ఆ వెన్నెల్లో పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ నడుస్తున్నాడు తేజస్వి.

అతని భుజాన జింక చర్మంతో చేసిన తోలుసంచి వుంది. అందులో భయంకరమైన విషమూలికలతో చేసిన మందులున్నాయి.

క్రూరమృగాలకు నిలయమైన ఆ అడవిలో అంత రాత్రివేళ నిర్భయంగా సామాన్య మానవుడెవడూ నడవలేడు—ఎంతో గుండె నిబ్బరం కలవారైతే తప్ప.

అతడికి రెండువందల అడుగుల దూరంలో సవ్వడి చేయకుండా పిల్లుల్లా నడుస్తున్నారు—శశాంక, మానస.

వాళ్ళిద్దరి వెనుకా నడుస్తోన్న వ్యక్తి భుజాన వున్న గండ్రగొడ్డలిని అటూ ఇటూ మార్చుకుంటూ పళ్ళు కొరుకుతున్నాడు.

దాదాపు రెండు గంటలు నడిచాక ఎదురుగా నల్లగా దర్శనమిచ్చాయి నున్నటి కొండలు.

ఆ వెన్నెల్లో—మదించిన మత్తేభాలు వరుసగా నిలబడి వున్నట్టుగా భ్రాంతిని కలగజేస్తున్నాయవి.

ఆ కొండల దగ్గరకు చేరుకోబోతోంటే ఇద్దరి మనసులూ ఉద్వేగంతో నిండిపోయాయి. కాస్సేపట్లో ఓ అద్భుతమైన రహస్యాన్ని తెలుసుకోబోతున్నామనే ఊహ వారికంతులేని ఆనందాన్ని కలిగించింది.

తేజస్వి ఆ కొండలదగ్గరకు చేరుకున్నాడు.

నడక వేగం పెంచారిద్దరూ.

వాళ్ళు చూస్తూండగానే ఒక బండరాయి పక్కకు తప్పుకొంది. గుహ లోపలికి అడుగు పెట్టాడు తేజస్వి.

వాళ్ళక్కడికి చేరుకునేసరికి, తెరుచుకున్న బండరాయి తిరిగి మూసుకుంది. ఆ వెన్నెల్లో చేతితో తడమనవసరం లేకుండానే మెరుగురాయి సైజులో ఓ రాయి ఎత్తుగా కనబడింది. దానిమీద రెండు చేతులూ వేసి కుడివైపుకు తిప్పాడు.

ఊహుఁ—

ఈసారి ఎడమవైపుకు తిప్పాడు.

ప్రయోజనం లేకపోయింది.

దాన్ని పైకి లేపాడు. అంతవరకూ గుహను మూసి వుంచిన బండరాయి పక్కకు తప్పుకొంది.

ఒక మనిషి అడ్డంగా తిరిగి వెళ్ళగలిగేటంత స్థలం ఏర్పడింది. తను ముందు లోపలికి నడిచాడు శశాంక. అతడి వెనకగా మానస కూడా లోపలకు చేరుకుంది.

## 7

ఆ గుహలో అక్కడక్కడా వెలుగు ప్రసరిస్తోంది.

తల పైకెత్తి చూశాడు శశాంక.

గుహ పై భాగాన వున్న కంతల్లోంచి వెన్నెల కిర

ణాలు పడి గుహను ప్రకాశవంతం చేస్తున్నాయి.

వారికి తేజస్వి కనబడలేదు. అయిదు నిమిషాల క్రితం ఆ గుహలోకి ప్రవేశించిన అతడేమయ్యాడో వారికర్థం కాలేదు.

ఒక్కో అడుగే తూచి తూచి వేస్తూ గుహాంతర్భాగానికి దారితీశారు. అక్కడక్కడా స్తంభాల్లా ఉన్నాయా గుహలో.

అవెలా యేర్పడ్డాయో అర్థమైందతడికి.

నేచురల్ విదరింగ్ వలన గుహ పైభాగపు రాతిలోని కాల్షియం పొరలు కరిగి ఊడల్లా క్రిందికి వ్రేళ్ళాడడం మొదలుపెట్టి గుహ అడుగు భాగానికి చేరడంవల్ల అక్కడక్కడా స్తంభాల్లా ఏర్పడ్డాయి.

అతడి ఊహ కరెక్టేనన్నట్టుగా సగం సగం రాతి స్తంభాలు పైకప్పునుంచి గాల్లో వేళ్ళాడుతూ వున్నాయి. కొన్ని వేల సంవత్సరాల తర్వాత అవికూడా గుహ అడుగు భాగంవరకూ విస్తరిస్తాయి.

అవెందుకు ఎలా యేర్పడ్డా తాము దాక్కోనేందుకు మాత్రం బాగా ఉపయోగపడతాయనిపించిందతడికి.

ఆ వెలుగులో ఆమె చేయందుకుని నడక సాగించాడు శశాంక. కొంచెం దూరం నడిచాక దారి ఇరుకయింది. అక్కడ చీకటిగా వుండటంతో జేబులోంచి పెన్ టార్చ్ తీసి స్విచ్ ఆన్ చేశాడు. కొంచెం దూరం నడిచాక ఆ దారి విశాలమై నాలుగు భాగాలుగా చీలింది.

ఎటువైపు వెళ్ళాలో అర్థంకాలేదతడికి. చివరకు కుడివైపు తిరిగాడు.

టార్చ్ వెలుతురులో కొంచెం దూరం నడిచాక కాగడాల వెలుతురు కనబడింది. నడకలో వేగం పెంచి

అక్కడకు చేరుకున్నారిద్దరూ.

అక్కడ... వరుసగా రాళ్ళతో నిర్మించబడిన గదు లున్నాయి. ఒక్కో గదికీ అరచేయంత రంధ్రాలు పది, పదిహేను వున్నాయి. దగ్గరగా వెళ్ళి ఒక గదిలోకి చూశాడు శశాంక, రంధ్రం ద్వారా. లోపలి దృశ్యం చూసి ఉలిక్కిపడ్డాడతడు.

లోపల....

ఒక శాగడా వెలుగుతోంది. నేలమీద వత్తుగా గడ్డి పరచివుంది. ఆ గడ్డిమీద వెల్లకిలా పడుకొని వున్నా డో వ్యక్తి. అతడికి గడ్డం, మీసాలు బాగా పెరిగి వున్నాయి. అతడి వంటిమీద నూలుపోగుకూడా లేదు. పొట్ట చేత్తో పట్టుకొని మెలికలు తిరుగుతున్నాడతడు. వుండుండి, "అమ్మా...." అని అరుస్తున్నాడు.

శశాంకా ఆశ్చర్యచకితుడయ్యాడు.

మానస పరిస్థితికూడా అలాగే వుంది.

ఆశ్చర్యంనుంచి తేలుకోకుండానే పక్క గదివైపు నడిచారిద్దరూ.

అక్కడా అదేస్థితి.

మొదటి వ్యక్తికంటే ఎక్కువగా బాధపడుతూ, మూలుగుతూ గదంతా దొర్లుతున్నాడా వ్యక్తి.

ఆ దృశ్యాన్ని చూడలేక అక్కణ్ణుంచి ముందుకు నడిచారు.

దాదాపు పది రాతిగదుల్లోనూ అదే పరిస్థితి వుంది!

చివర్న మాత్రం రెండు రాతిగదులు ఖాళీగా వున్నాయి. పరీక్షగా చూస్తే వాటిలో రెండు అస్థిపంజ రాలు కనబడ్డాయి.

వాళ్ళంతా ఎవరు?

ఎవరు వారి నలా బంధించారు?

వాళ్ళంతా విపరీతంగా బాధపడుతున్నారెందుకని?

ఇద్దరి మనసుల్లోనూ అవే ప్రశ్నలు.

అంతలో....

"ఎక్కువగా ఆలోచించి బుర్రలు పగలగొట్టుకోకండి" అనే మాటలు వినిపించి ఇద్దరూ అదిరిపడ్డారు.

ఆ స్వరం ఇద్దరికీ పరిచితమైనదే కావడంతో వారి అదురుపాటు వణుకుగా మారింది.

ఓ చేత్తో కాగడా పట్టుకొని వారి ముందుకు వచ్చాడు తేజస్వి.

అతడి మొహంలో నవ్వు కదలాడుతోంది.

గత అయిదేళ్ళనుంచీ తనతడికి సమీపంగా వుంటోన్నా అతడు నవ్వగా యేనాడూ చూడలేదు మానస.

శశాంక కతడి నవ్వుమాటున దాగిన క్రూరత్వం అతడి కళ్ళలో ద్యోతకమయింది.

కాగడా వెలుగులో అతడి మోహం ఎఱ్ఱగా కనిపిస్తోంది.

తేజస్వి కళ్ళు అగ్నిని జ్వలిస్తున్నాయి.

శశాంకను తీక్షణంగా చూస్తూ అన్నాడు తేజస్వి—

"నువ్వు మొదటిసారి నన్ను కల్సుకున్నప్పుడే చెప్పాను, నేను చేసే పనులను గురించి ప్రశ్నించినా, ఆరాతీసినా తీవ్ర పరిణామాలెదుర్కోవలసి వుంటుందని. అయినా నువ్వు లెఖ్ఖచెయ్యలేదు. ఇప్పుడు నిన్నేం చేయబోతున్నానో తెలుసా?"

అతడి హుంకరింపు గుహ అంతా ప్రతిధ్వనించింది.

గజగజా వణికిపోయాడు శశాంక.

"నీమీద అనుమానంతో గురుబరిని నీమీద కాపలాగా

వుంచానన్న సంగతి బహుశ నీకు చెప్పినా నమ్మవేమో?

మొదటినుంచి నీ ప్రతి చర్యనూ పరిశీలిస్తూ, రహస్యంగా నిన్ను అనుసరిస్తూ ఎప్పటికప్పుడు నాకు తెలియజేస్తూనే వున్నాడు గురుబరి.

పదిహేనురోజుల క్రితం మీరిద్దరూ తపతి వాటికలో కలుసుకొని ముచ్చటించుకోవడం, మీ తరువాతి కార్యక్రమం అంతా మర్నాడే నా చెవిన వేశాడు.

అప్పట్నించి ఈ రోజుకోసమే నేనూ ఎదురుచూస్తున్నాను మీలాగే. ఈ రాత్రి మీరు నా వెనుక వస్తారని నాకు తెలుసు. ఇప్పుడు మీ ఇద్దర్నీ ఏం చేయాలో గురుబరి నిర్ణయిస్తాడు" అంటూ, "గు రు బ రీ!" అని పిలిచాడు.

అప్పటివరకూ వాళ్ళిద్దర్నీ అనుసరించి వచ్చిన గురుబరి భుజాన్న గండ్రగొడ్డలితో చీకట్లోంచి వెలుగులోకి వచ్చాడు.

మానస అతణ్ని చూసి వణికిపోయింది.

గురుబరి తేజస్విని చూసి నవ్వాడు.

ఆ నవ్వుకర్థం తనకు తెలుసునన్నట్టుగా—'అలాగే చేద్దాంలే' అన్నట్టుగా ప్రతిగా నవ్వాడు తేజస్వి.

తను ద్రోహం చేసినందుకు తననిప్పుడు ఆ గండ్రగొడ్డలితో నిలువునా నరుకుతాడా?

మానస దేహం అపాదమస్తకమూ కంపించింది. వళ్ళంతా చెమట్లు పట్టాయి. కళ్ళు బైర్లు కమ్ముతోంటే తన ప్రమేయం లేకుండానే దబ్బున కూలబడిపోయింది నేలమీద.

మగవాడు కావడంవల్లనో లేక చావు తెగింపువల్లనో పైకి నిబ్బరంగానే వున్నాడతడు.

తేజస్వి ఆకళిం్పు సమీపిస్తూ అన్నాడు—"మరి కొంత కాలం మీరు నమ్మకంగా పనిచేస్తే, నా పరిశోధనా వివరాలు మీకు తెలియజేసేవాణ్ణే.

కానీ నాగరికులపట్ల వాకున్న అపనమ్మకాన్ని మరో సారి బుజువుచేయడంద్వారా నాకా అవసరం లేకుండా చేసి ఒక విధంగా మేలేచేశారు.

నాగరికులమధ్య పుట్టి, పెరిగి—వారిమధ్య ఇమడ లేక ప్రశాంతంగా పరిశోధన సాగించేందుకు ఈ అడవులోకి వచ్చాను. అయినా నన్ను వదలడంలేరు మీలాంటి నాగరికులు.

ఇక్కడికొచ్చాక ఎన్నోరకాల పరిశోధనలు చేశాను, ఇంకా చేస్తున్నాను. నా పరిశోధనా ఫలితాలను పరీక్షించుకునేందుకు నాకు మనుషుల అవసరం ఎంతైనా వుంది.

మీరింతకుముందు రాతిగదుల్లో చూసిన వాళ్ళంతా నాగరిక ప్రపంచంనుంచి—నా పరిశోధనా ఫలితాల్ని తస్కరించుకునేందుకు వచ్చినవాళ్ళే!

నన్ను మోసగించాలని ప్రయత్నించి, వారికి తెలియకుండానే నా పరిశోధనల్లో బలిపశువులుగా ఉపయోగపడుతున్నారు.

చూశావ్ గా, వాళ్ళంతా యెంత హృదయవిదారకంగా రోదిస్తున్నారో? రకరకాల మూలికలతో తయారుచేసిన మందుల్ని వాళ్ళమీద ప్రయోగిస్తున్నాను. మానవాళికి యే రోగమూ దరిచేరకుండా చేసేందుకు అహోరాత్రాలూ పరిశోధనలు కొనసాగిస్తున్నాను.

ఫార్మసీలో డాక్టరేట్ తీసుకున్న నేను నాగరిక ప్రపంచంవల్ల దారుణంగా వంచించబడ్డాను. నేను

సైంటిస్టును కావడంవల్ల నా భార్యాపిల్లలూ దారుణంగా చంపబడ్డారు. నాగరిక ప్రపంచం నన్నావిధంగా సన్మానించింది.

అందుకే నాకీ ప్రపంచంలో నమ్మదగ్గవాళ్ళెంటూ ఎవరూలేరు, ఈ ఒక్క గురుబరి తప్ప" అంటూ అతడి తల నిమిరాడు.

శశాంక్ యేదో చెప్పబోయాడు.

అతణ్ని వారిస్తూ అన్నాడు తేజస్వి—"నువ్వేమీ చెప్పొద్దు. నాగరికులంతా ఆలాంటి వాళ్ళు కాదని నువ్వు చెప్పబోతున్నావ్, అవునా?

మిగిలినవాళ్ళ సంగతెలా వున్నా ఈ అడవికి వచ్చి నన్ను కలుసుకున్న ప్రతీ వ్యక్తీ నీతోసహా నన్ను చంపి, నా పరిశోధనల రహస్యాన్ని చేజిక్కించుకుందామనే ప్రయత్నించారు.

కాదంటావా? నువ్వూ, మానసా కలిసి—ఈ రహస్యాన్ని ఛేదించాక నన్ను చంపి ఇక్కణ్నించి వెళ్ళిపోదామని వేసిన ప్రణాళిక నాకు తెలియదనే అనుకుంటున్నావా?"

శశాంకకు నోట మాటరాలేదు.

"....ఇహ మీరిక్కడ శాశ్వతంగా సమాధి అయినట్టే. చివరి రెండు గదుల్లోనూ రెండు అస్థిపంజరాలు కనబడే వుంటాయి. నా పరిశోధనలకు ఆ రెళ్ళు సహాకరించి తరువాత అలా మారారు - నన్ను మోసగించిన ఇద్దరు వ్యక్తులు. ఖాళీ అయిన ఆ రెండు రాతిగదుల్నీ మీ ఇద్దరికీ కేటాయించబోతున్నట్టు ఈసరికి నీకర్థమయ్యే వుంటుంది.

నీలా మున్ముందు ఎవరైనా వచ్చినా వారికీ ఇదే గతి

పడుతుంది. బయటి ప్రపంచంలో సైంటిస్టులు యెన్ని కుందేళ్ళనూ, ఎలుకల్నీ కోతుల్నీ దారుణంగా చిత్రవధ చేసి చంపడంలేదు? కాకపోతే వాళ్ళు అన్నమూ పున్నమూ ఎరుగని అమాయక ప్రాణుల్ని తమ పరిశోధనలకు వుపయోగించుకుంటోంటే, నమ్మకద్రోహులైన మనుషుల్ని నేనా పనికి వినియోగించుకుంటున్నాను.

నాకు తెల్సినదాంట్లో వందో వంతు మీ నాగరికుల కందినా దాన్ని సరిగా ఉపయోగించుకోరు సరికదా, ఒకరినుంచి మరొకరు దాన్ని తస్కరించేందుకు మోసాలూ, హత్యలూ ఎన్నైనా చేస్తారు.

అందుకే నా పరిశోధనా ఫలితాలెన్నటికీ నాగరికుల కందవు. అలా అని అవి నాతోనే అంతరించిపోవు. నా తరువాతి వారసుణ్ని నేనెన్నడో నిర్ణయించుకున్నాను. గురుబరికంటే అర్హుడైనవాడు ఈ భూమ్మీద లేడు.

ఒక ప్రయోజనకరమైన విషయాన్ని తెల్సుకునేందుకు అర్హత ముఖ్యం. ఆ అర్హత ఎన్ని యుగాలు గడిచినా నాగరికులకు రాదు. అందుకే నా పరిశోధనా ఫలితాలు ఈ ఆటవికుల మధ్యనే వుంటాయి ఎన్నటికీ. మీరిక్కడ శాశ్వతంగా సమాధి చేయబడినట్టే ఆ రహస్యాలూ ఇక్కడి అడవులకూ గుట్టలకూ పరిమితమౌతాయి....''

అంతే!—కుప్పకూలిపోయాడు శశాంక.

—:అయిపోయింది:—

సీరియల్

వి.య్యస్.రావ్



(గత సంచిక తరువాయి)

పోతరాజు పగలబడి నవ్వాడు. "మా కేసు లన్నింటికీ ఇకనుంచి పర్మనెంట్ సాక్షులు మీరే! పని పడినప్పుడు కబురు చేస్తా. వెళ్ళండి!" అన్నాడు.

ఇద్దరూ మెల్లిగా కదిలారు.

"కృష్ణంరాజూ" పోతరాజు పిలిచాడు, కృష్ణంరాజు గిరుక్కున వెనక్కి తిరిగాడు.

"కిందికి దిగడానికి వేరే రోడ్డు, తెలుసుగా?" పోతరాజు ప్రశ్నించాడు.

"కొండమీదున్న ఈ హోటల్ కి లెక్కలేనన్నిసార్లు వచ్చాను!" కృష్ణంరాజు నవ్వుతూ అన్నాడు. అతను రాక్ హిల్ హోటల్ కి రావడం ఇదే మొదటిసారి.

ఇద్దర్నీ మాయంచేస్తూ మూసుకున్న తలుపుని వోసారి

చూసి, పోతరాజు టేబుల్ మీదున్న సీసాల్నీ, గాజుల్నీ, ప్లేట్లనీ పెద్ద ట్రేలోకి సర్దాడు. ట్రేని మంచంమీద పెట్టి, టేబుల్ని మునుపట్లా గోడవారగా లాగి, శుభ్రంగా తుడిచాడు. కుర్చీల్ని మామూలుగా సర్దేశాడు. తలుపు తెరిచాడు ట్రే పట్టుకుని పక్కగదిలోకి వెళ్ళాడు. తిరిగొచ్చి, గదిని పరిశీలనగా చూసి, తలుపు మూసి తాళం వేసి, పక్కగదిలో దూరి తలుపు మూసుకున్నాడు.

కుర్చీలో కూచుని సిగరెట్ వెలిగించాడు. ముందు జాగ్రత్తతో మరో వ్యక్తి పేరుతో పక్కగది కూడా తీసుకున్నందుకు సంతోషిస్తూ, నవ్వుకున్నాడతను. ఇలాంటి లావాదేవీలు అతిరహస్యంగా జరగాలి!

* * *

కృష్ణంరాజు టాక్సీని కుడివైపు తిప్పి పోనిచ్చాడు. అతని పక్కనే కూచున్న మస్తాన్ రావు ఉషారుగా మరో సిగరెట్ వెలిగించాడు.

వచ్చినప్పుడు జల్లులుగా పడుతున్న వర్షం కొంచెం బలిసింది.

కృష్ణంరాజు ఈలవేస్తూ కార్ని మలుపు తిప్పాడు. లైట్లెందుకో మరీ డిమ్‌గా వెలుగుతున్నాయి. బ్యాటరీ ఛార్జ్ చేసి రెండురోజులు కూడా కాలేదు.

“కేసవగానే వాళ్ళు మనల్ని మరిచిపోతారనుకున్నా!” కృష్ణంరాజు చిన్నగా నవ్వాడు.

మనుషుల తత్వం బాగా తెలిసిన మస్తాన్ రావు చిన్నగా నవ్వాడు.

“మరిచిపోయేవారే! కానీ, ఎవరో ప్రశ్నలు అడిగి, అంతా తిరగతోడడానికి రెడీ అవుతున్నారటగా?

అందుకే మనం నోరు జారకుండా వుంటానికే ఈ పైకం ముట్టజెప్పారు!"

"అలాగా?" కృష్ణంరాజు అనుమానంగా అన్నాడు.

"మీరెలాగనుకుంటున్నావ్! బ్రదర్, లోకం సంగతి నీకు తెలీదు. పనివుంటేగానీ, నీ కెవ్వడూ పైసలివ్వడు!" మస్తాన్ రావు తెలివిగా అన్నాడు.

"రైట్! ఆ ప్రశ్నలు అడగబోయే వ్యక్తులకి మనం యెంతో ఋణపడ్డాం!" కృష్ణంరాజు నవ్వాడు. మస్తాన్ రావు నవ్వలేదు.

"బ్రదర్. బంగారు గుడ్లుపెట్టే బాతు దొరికింది మనకు!" మస్తాన్ రావు వున్నట్టుండి అన్నాడు.

కృష్ణంరాజు వులిక్కిపడ్డాడు. "ఏమిటి?" అరిచాడతను నోరంగా చూస్తూ. మస్తాన్ రావు చిన్నగా నవ్వాడు.

"నెలకోసారి, ఎవరో వ్యక్తి మనకోర్టు సాక్ష్యాల గురించి ప్రశ్నిస్తూ వుంటే ఏమవుతుంది?" ప్రశ్నించాడతను.

"ఏమిటవుతుంది?" కృష్ణంరాజు అడిగాడు.

"ప్రతీ నెలా పెన్షన్లాగా మనకి డబ్బొస్తూ వుంటుంది!" మస్తాన్ రావు నవ్వుతూ అన్నాడు.

"అ?" అన్నాడు అర్థంకాని కృష్ణంరాజు.

"ప్రతీనెలా యెవరో వ్యక్తి మనల్ని ప్రశ్నిస్తాడు. మనం ఆ సంగతి భూపాలంకి చెప్తాం. ఆ వ్యక్తి అయిదు వేలిస్తానంటున్నాడంటాం, మనం నోరు తెరవడానికి. అప్పుడు మనం నోరు మూసుకోడానికి భూపాలం వచ్చినట్టేయే పదివేలో ఇస్తాడు!" మస్తాన్ రావు సగర్వంగా నవ్వాడు.

కృష్ణంరాజు ఉషారుగా ఈలవేశాడు. రొడ్డుని

వోసారి చూసి, మస్తాన్ రావువైపు తలతిప్పాడు.
“బాగానే వుంది. ప్రతీనెలా మనల్ని ఆ ‘ఎవరో వ్యక్తి’ అడగొద్దా!” సందేహిస్తూ అన్నాడతను.

మస్తాన్ రావు బిగ్గరగా నవ్వాడు. “రాజా, నువ్వ బంటులా ఆలోచిస్తున్నావ్! ఏ వ్యక్తీ మనల్ని అడగ నక్కర్లేదు. అడుగుతున్నట్టు మనం నెలనెలా చెప్తూ వుంటాం!”

కృష్ణంరాజు ఎడంచేత్తో అతని భుజాన్ని చరిచాడు. “ఔను! అది నాకు తట్టలేదు!”

“అందరికీ అన్నీ తట్టితే మస్తాన్ రావెందుకు? నన్ను కల్సుకుంటూ వుండు. నాటకం ఎలా నడపాలో చెప్తా. ప్రతిసారీ ఇద్దరం ఒకేలాగా చెప్పాలి” అన్నాడు మస్తాన్ రావు సాలోచనగా.

“ఆ భూపాలం యెవరో, ఎక్కడుంటాడో మనకి తెలీదుగా?” కృష్ణంరాజు కళ్ళు చిట్లించి రోడ్డుని చూస్తూ అన్నాడు.

“అదంతా నా కొదిలెయ్. వచ్చేనెల మొదటివారం నన్ను కల్సుకో!” మస్తాన్ రావు గంభీరంగా అన్నాడు.

రోడ్డు మలుపు తిరిగింది. స్లో చేయబోతూ కృష్ణంరాజు బ్రేక్ పెడల్ని తొక్కాడు. పెడల్ లూజాగా బోర్డుని తాకింది. కారు స్లో కాలేదు. ఆశ్చర్యపోతూ స్టీరింగ్ ని తిప్పాడతను. టైర్లు కీచుగా అరిచాయి. రోడ్డు వాలుగా కిందికి దిగుతోంది. కృష్ణంరాజు మళ్ళీ బ్రేక్ నొక్కాడు. కారు స్పీడులో మార్పులేదు.

“బ్రేక్ ఫెయిలయ్యింది!” కంగారుగా అన్నాడతను. మస్తాన్ రావుకి మత్తు దిగిపోతున్నట్టనిపించింది.

“ఇంజన్ ఆఫ్ చెయ్!” గాభరాగా అరిచాడతను.

కృష్ణంరాజు కళ్ళు చిట్లిస్తూ చూశాడు. రోడ్డుమధ్యలో ఎర్రటి అక్షరాల్తో వున్న బోర్డు అతని కళ్ళని పొడుస్తూ కనిపిస్తోంది. "రోడ్డు మరమ్మతులో వుంది. ఎడమవైపు తిరగండి" అంటూ హెచ్చరిస్తోంది బోర్డు.

బ్రేకులు నొక్కడానికి వ్యర్థంగా ప్రయత్నిస్తూ, కృష్ణంరాజు బోర్డుమీదికి దూసుకొస్తున్న కార్ని చివరి నిమిషంలో యెడమకి తిప్పాడు. మస్తాన్ రావు పక్కనున్న బ్రీఫ్ కేసుమీద చెయ్యివేశాడు.

క్షణంలో గాలిలో తేలుతున్నట్టనిపించిందతనికి. చక్రాలకింద నేల మాయమైందా? ఏం జరిగిందో అతని మెదడుకి తట్టేలోగా కారు రెండువందల అడుగుల లోతున్న అగాధంలోకి వేగంగా దొర్లుకుంటూ పోతోంది కారూ, దాని వెంట పొర్లుతున్న రాళ్ళూ ఆ చీకటి రాత్రిలో భీకరంగా చప్పుడు చేశాయి.

కాసేపట్లో శబ్దం తగ్గింది. లోయలోంచి మంటలు లేచాయి....

చీకట్లోంచీ, చప్పుడు చేయకుండా, రోడ్డు మధ్యకి నడిచాడు జాకీ. లోయలోకి దొర్లుకుపోయిన కారు యేమయ్యిందో చూడక్కర్లేదు!

నడిరోడ్డులో మూడురాళ్ళమధ్య భద్రంగా ఇరికించి నిలబెట్టిన బోర్డుని లాగాడు. కిందపడేసి, మూడురాళ్ళనీ లోయలోకి విసిరేశాడు. బోర్డుని అందుకుని, ఇరవైగజాల దూరంలో వున్న మలుపు దగ్గర, చీకట్లో ఆపిన వాన్ వైపు జోరుగా నడిచాడు. అతనికి దగ్గరగా, విజయోత్సాహంతో నవ్వాలనిపిస్తోంది.

• • •

మనోజ్ హోటల్ గదిలో కాలుకాలిన పిల్లిలా

పచార్లు చేస్తున్నాడు. ఒకటి యాదృచ్ఛికం కావొచ్చు. ఒక విషయంతో సంబంధం వున్న వివిధ వ్యక్తులు ఒకేరోజు ప్రమాదవశాత్తూ మరణిస్తే, దాన్ని నిర్లక్ష్యం చేయడానికి వీల్లేదు.

పొద్దుటే మస్తాన్‌రావుని కలుసుకోడానికి వెళ్ళిన అతనికి పెద్ద షాక్ తగిలింది. గతరాత్రి, పన్నెండు ప్రాంతంలో కొండదారిలో జరిగిన కారు ప్రమాదంలో మస్తాన్‌రావు మరణించాడు. టాక్సీ తోలిన వ్యక్తి, కృష్ణంరాజు! ఒక్క దెబ్బకి రెండు పిట్టలు! ఏదో మాస్టర్ మైండ్ చాకచక్యంగా రాక్షసంగా అంతా నడిపిస్తోంది....

మనోజ్ బుర్ర వేడెక్కుతోంది. కొత్త పాకెట్లోంచీ సిగరెట్ తీసి వెలిగించాడతను. టాక్సీ నంబర్నిబట్టీ, సగం సగం కాలిన శరీరాల్నిబట్టీ వాళ్ళిద్దర్నీ పోల్చడం జరిగింది. చీకట్లో, వర్షంలో తడిసిన రోడ్డుమీద స్కిడ్ అవడంమూలాన కారు లోయలోకి దొర్లిపోయిందని పోలీసులు తీర్మానించుకున్నట్టు పేపర్లు చెప్తున్నాయి. మంచంమీద పడేసిన పేపర్ని పక్కకితోసి, మనోజ్ నీరసంగా మంచంమీద వాలాడు.

తను అన్వేషణ సాగిస్తున్నట్టు ఎవరేనా పసిగట్టారా? లేక ముందుజాగ్రత్తతో తప్పుడు సాక్షుల్ని నిర్మూలిస్తున్నారా? అరితేరిన నేరస్థుడు, తాత్కాలికంగా భయంలేకపోయినా భవిష్యత్తుని దృష్టిలో వుంచుకుని తనకి సహకరించిన వాళ్ళని తుదముట్టించవచ్చు. తను డబ్బుతో వాళ్ళని కొన్నాడు. అలాంటి వ్యక్తులు తిరు వాత కూడా డబ్బుకోసం ఇతర్లకి అమ్ముడుపోవచ్చు. రాజమ్మ, మస్తాన్‌రావు, టాక్సీ డ్రైవర్ కృష్ణంరాజు—

ఇంకా ఎవరెవరు ఇలా బలైపోతారు?

మనోజ్ తటాలున లేచికూచున్నాడు. తను నిర్లక్ష్యంగా వ్యవహరించాడు. ఇవన్నీ ముందుచూపుతో చేసిన హత్యలు మాత్రమే కావు. తను రంగంలోకి దిగినట్టు పసిగట్టాక — ముందుచూపుతో చేసిన హత్యలు!

రాజమ్మ ఇంటిని వెతుక్కుంటూ మొదటిసారి తను వెళ్ళినప్పుడు అక్కడ బెలూను అమ్ముకుంటూ కనిపించిన వ్యక్తి, ముస్తాన్‌రావు ఇంటి ప్రాంతంలోకూడా రోడ్డు మీద తనకి కనిపించాడు! రాజమ్మ చనిపోయిన రోజు రోడ్డుమీదున్న టీస్టాల్ దగ్గర తను ఆగాడు. అప్పుడు, చిన్న సైకిల్ పంపుతో బెలూన్లకి గాలికొడ్తూ రోడ్డు మీద కూచున్న బెలూన్ల వ్యక్తిని తను చూశాడు. పట్టించుకోడం మానేశాడు! అతను తర్వాత హోటల్ దగ్గరకూడా కనిపించాడు.

గుడ్ గాడ్! తను నిజంగా బడుద్ధాయిలా వ్యవహరించాడు. తను ఎక్కడికెళ్తే అక్కడ బెలూన్లు అమ్మాల్సిన అవసరంలేదు! గాలిపటం తోకలా అతను తనని వెంటాడుతూనే వున్నాడు. ఈ గాలిపటానికి అదొక్కటే తోక అనుకోడానికి వీల్లేదు! ఆవులమధ్య ఆవు తోళ్ళలా అమాయకంగా రోడ్లలో తిరిగే జనంలో తనని గమనించే కళ్ళు ఎన్ని వున్నాయి? తనని వెంటాడే కాళ్ళు ఎన్ని వున్నాయి?

మనోజ్ మరో సిగరెట్ వెలిగించి పచార్లు ప్రారంభించాడు. తన ఉనికి, తన ఉద్దేశం 'వాళ్ళకి' ఎట్లా తెలిశాయి? ఇప్పటిదాకా తను ఇద్దరువ్యక్తుల్ని మాత్రమే కల్సుకున్నాడు. తన అన్నయ్య కరుణాకర్, లాయర్ రంగనాథ్.

రంగనాథ్ భార్యను గాయపరచి, అతన్ని హెచ్చరించి తరవాతకూడా వాళ్ళు అతనిమీద ఒక కన్నేసి వుంటారు! ఆ కంట్లో తను పడివుంటాడు! ఎలాగో తన సంగతి కనుక్కొని తనని తమ మైక్రోస్కోప్ కింద పెట్టారు ఆ వ్యక్తులు!

తను ఇంక రెప్పల్ని కళ్ళకి దూరంగా వుంచి, అనుక్షణం మెలకువగా వుండాలి! ఇంకా నరబలులు సాగకుండా చూడాలి.

• • •

కాఫీ ముగించి మనోజ్ లాంజిలోకి అడుగులు వేశాడు. అక్కడా ఇక్కడా కుర్చీలో కూచున్నారు అయిదారుగురు.

మనోజ్ సిగరెట్ వెలిగించి రోడ్డుమీదకి నడిచాడు. హోటల్ ముందు ఆగి, అటూ ఇటూ దూసుకెళ్తున్న వాహనాల్ని చూస్తూ వుండిపోయాడు.

మనోజ్ కళ్ళు బెలూన్లకోసం గాలిస్తున్నాయి. బెలూన్ల వ్యక్తి ఎక్కడా కనిపించలేదు.

ఆలోచిస్తూ మనోజ్ వెనక్కి తిరిగి హోటల్ లాంజి వేపు అడుగులు వేశాడు. లిఫ్టువేపు తిరగబోతూ తటాలున ఆగాడు.

గోడవారగా సోఫాలో కూచున్న వ్యక్తి, న్యూస్ పేపర్ని మొహానికి అడ్డంగా లాగడం అతని దృష్టిని ఆకర్షించింది.

తెల్లటి వెంట్రుకలు పక్కపాపిడి క్రాపు. పొడుగాటి మొహంలో ముక్కు పొడుగ్గా కూచిగా అవుపిస్తోంది. ఇవాళ పొద్దుటిదాకా తను వున్న హోటల్ లాంజిలో న్యూస్ పేపర్ పట్టుకొని, ఏకాగ్రతతో చదువుతూ

ప్రతీసారీ తనకి కనిపించాడతను! బెలూన్! న్యూస్ పేపర్! మనోజ్ తనలో నవ్వుకున్నాడు.

వెళ్ళి అతని పక్కనే కూచుని, న్యూస్ పేపర్ లాక్కుని, పొడుగాటి ముక్కుని పచ్చడిచేసి, బుద్ధి చెప్పాలనిపించిం దతనికి. బిగుసుకుంటున్న పిడికిళ్ళను విడదీసు కుంటూ మనోజ్ తనని సంభాళించుకున్నాడు.

తను వాళ్ళని కనిపెట్టినట్టు వాళ్ళకి తెలీకూడదు. తనలాంటి వాళ్ళని నీడలా వెంటాడే, ఇలాంటివాళ్ళంతా తోకలు. తలలు యెక్కడో దాక్కునివుంటాయి. ఈ తోకలు, మెల్లిగా తనని తల దగ్గరకు తీసుకెళ్తాయి! మనోజ్ లిఫ్ట్ వేపు అడుగులేశాడు.

లిఫ్ట్‌లో మారి, తటాలున వెనక్కి తిరిగాడు. న్యూస్ పేపర్ తటాలున జరిగి, తనవేపు చూస్తున్న ఆ వ్యక్తి ఎడమకంటిని మూసేసింది.

తలుపులు మూసుకున్నాయి. లిఫ్ట్ కదిలింది.

• • •

మనోజ్ డ్రెస్ చేసుకొని, సూట్ కేస్ సర్దాడు. గదంతనీ ఒకసారి పరిశీలించి, ఇవతలికి నడిచాడు.

రిసెప్షన్ ముందు నిలబడి వోరగా చూశాడు. 'న్యూస్ పేపర్' యథాస్థానంలో వుంది! లోపల్లోపల సంతోషిస్తూ మనోజ్ రిసెప్షనిస్టుని చూశాడు.

"గది ఖాళీచేస్తున్నా" అన్నాడతను న్యూస్ పేపర్ వెనక దాక్కున్న వ్యక్తికోసం, కంఠస్వరం బాగా పెంచి.

"నెలరోజులుంటామన్నారు?" రిసెప్షనిస్టు నవ్వుతూ ప్రశ్నించాడు.

"ఉండాలనుకున్నా. కానీ ఆర్మీ ఉద్యోగంగా!

బోగర్ ఏరియాలో గొడవలు. ఉన్నపళాన దైద్రబాని వుత్తరువొచ్చింది!" మనోజ్ నవ్వుతూ బిగ్గరగా అన్నాడు. న్యూస్ పేపర్ కదల్లేదు.

"టికెట్ బుక్ చేయించమంటారా?" రిసెప్షనిస్టు అడిగాడు.

"నో. థాంక్స్, పాస్ వుంది. ఎంతైంది?" మనోజ్ ప్రశ్నించాడు.

"నూటఅరవై అయిదు రూపాయలివ్వండి" అన్నాడు రిసెప్షనిస్టు.

మనోజ్ పర్సులోంచీ డబ్బుతీసి కౌంటరుమీద పడేశాడు.

"ఇటువేపు వస్తే, మా హోటల్‌కే రండి సార్!" రిసెప్షనిస్టు నవ్వుతూ ఆహ్వానించాడు.

"థాంక్స్ మూడ్నెంతులు ఇటువేపు రాను!" అంటూ మనోజ్ హోటల్లోంచీ ఇవతలికి నడిచాడు. టాక్సీ చేసుకొని స్టేషన్‌కు వెళ్ళాడు.

స్టేషన్‌లో పబ్లిక్ టెలిఫోన్ బూత్‌ని చూడగానే అతనికి రంగనాథ్ గుర్తొచ్చాడు. తను వెళ్ళిపోతున్నట్టు అందరికీ తెలియడం మంచిది. నవ్వుకుంటూ అతను టెలిఫోన్ బూత్‌లోకి దూరాడు. బూత్‌కు కొద్ది దూరంలో బెలూన్లు ఎగురుతూ కనిపించాయి మనోజ్‌కు.

● ● ●

ఉదయం తొమ్మిది గంటలు కావస్తోంది.

పైజామా, జుబ్బా, ఆవజోళ్ళూ ధరించి మనోజ్ కుంటుతూ హోటల్లోంచి ఇవతలికి నడిచాడు.

తనకి పరిచయమైన ఇద్దరు వ్యక్తుల్లో ఎవరేనా వున్నారేమో అని అటూ ఇటూ పరిశీలనగా చూశాడతను.

న్యూస్ పేపరు-, బెలూన్లూ లేవు! చిరునవ్వు నవ్వుకుంటూ, హోటల్ ముందున్న న్యూస్ స్టాండు వేపు కుంటుతూ అడుగులేశాడు.

వారం రోజుల తర్వాత ఆ రోజు ఉదయమే అతను ఢిల్లీ నుండి తిరిగివచ్చాడు.

రెండు దినపత్రికలూ, మూడు మాసపత్రికలూ, మూడు సినిమా పత్రికలూ, రెండు ఇంగ్లీషు పత్రికలూ, కొన్నాడు. అన్నింటిని దొంతరగా పట్టుకొని, రోడ్డు దాటి ఎదురుగా వున్న లక్ష్మీ సైకిల్ మార్ట్ ని సమీపించాడు.

పాపతను ప్రశ్నార్థకంగా చూశాడు. అద్దెకి సైకిల్ కావాలన్నాడు మనోజ్. పాపతను అనుమానంగా చూశాడు. మనోజ్ పక్కకి తిరిగి, దగ్గరగా వున్న హీరో సైకిల్ కారేజ్ కి పేపర్ల దొంతర తగిలించాడు. ఆశ్చర్యంగా చూస్తున్న పాపతన్ని నవ్వుతూ చూశాడు.

జుబ్బా జేబులోంచీ అయిదువంద రూపాయల నోట్లు తీసి అతనివైపు చాచాడు.

"పేరు సుబ్బారావు మూడుగంటల్లో సైకిల్ వాపసు చేస్తా" అంటూ సైకిల్ మీద చెయ్యేశాడు.

పాపతను గారపళ్ళను చూపిస్తూ నోట్లు అందుకున్నాడు.

"పేరెందుకులెండి. తీసుకెళ్ళండి!" అన్నాడు.

మనోజ్ హోటల్ వేపు వోసారి చూసి, సైకిల్ని ఫుట్ పాత్ మీంచీ రోడ్డుకి దించాడు. కళ్ళద్దాల్ని సరిచేసుకొని ఈల వేస్తూ' సైకిల్ మీదికి ఎగిరాడు. సైకిల్ వేగంగా కదిలింది....

పదినిమిషాల తరవాత మనోజ్ సైకిల్ని మెయిన్ రోడ్డులోంచీ సైడ్ రోడ్డులోకి తిప్పాడు. మలుపులో వున్న టీస్టాల్ ముందు ఆపి, కిందికి దిగాడు. స్టాండ్ వేసి టీ

స్టాల్‌లోకి వెళ్ళాడు. రోడ్డువైపు తిరిగి, కుర్చీలో కూచుని స్ట్రాంగ్ టీ ఆర్డరిచ్చాడు. టీ చప్పరిస్తున్నా అతని చూపులు రోడ్డుని నిశితంగా గాలిస్తున్నాయి.

టీ ముగించి బిల్లు చెల్లించి, ఇవతలికి వచ్చాడు. సైకిల్ దగ్గరగా నించుని, జేబులోంచి సిగరెట్ పాకెట్ తీశాడు. తీరుబడిగా సిగరెట్ వెలిగించాడు. హుషారుగా సిగరెట్ పీలుస్తూ రోడ్డు పొడవునా తన చూపుల్ని పరుగెత్తించాడు. ఎదురుగా వున్న షాపుల వైపు నిదానించి చూసి, సైకిలెక్కాడు.

మనోజ్ అయిదు నిమిషాల్లో, న్యూ కాలనీలో 56 నంబరు ఇంటిముందు సైకిల్ ఆపాడు. ఎడమకాల్ని మెట్టుమీద ఆనుకొని, రెండుసార్లు బెల్ మోగించాడు.

విసుగు నటిస్తూ జుబ్బాచేత్తో నుదుర్ని అంటిన చెమట అద్దుకున్నాడు. మెల్లిగా తలతిప్పి వెనక్కి చూశాడు. రోడ్డు ఖాళీగా వుంది.

కిందికి దిగి, సైకిల్ పెడల్ని మెట్టుకి ఆన్చాడు. న్యూస్ పేపర్లనీ, మాగజైన్స్‌నీ చేతికింద ఇరికించి, నాలుగు మెట్లూ యెక్కి వసారాలో, తలుపుముందు ఆగాడు. అతని కుడిచెయ్యి పైకిలేచింది. వేళ్ళకణుపులు తలుపుమీద చప్పుడుచేశాయి. రెండోసారి తలుపుతట్టి, మనోజ్ రోడ్డువైపు తిరిగాడు. యాంత్రికంగా రోడ్డు మీద అటూ ఇటూ చూశాడు.

తలుపు వెనక మెత్తగా అడుగుల చప్పుడు. కాసేపట్లో గడియతీసిన చప్పుడు అతనికి వినిపించింది. తలుపు కొద్దిగా వెనక్కి జరిగింది. తలుపుకీ, ద్వారబంధానికీ మధ్య నించున్న యువతి అతన్ని ప్రశ్నార్థకంగా చూసింది.

మనోజ్ తేలిగ్గా ఊపిరిపీల్చుకుంటూ, చిరునవ్వు

నవ్వాడు. చంకలో ఇరికించిన న్యూస్ పేపర్ల దొంతరని ఆమె మానేలా ముందు పట్టుకున్నాడు. ఆమె కళ్ళల్లో ప్రశ్నార్థకం జతకి ఆశ్చర్యార్థకం చేరింది.

"అవి మాకు కాదు. ఎవరిల్లు కావాలి మీకు?" సన్నటి కంఠం మనోజ్ ని ప్రశ్నించింది.

"అడ్వొకేట్ అన్నారావుగారిల్లు...." మనోజ్ మెల్లిగా అన్నాడు.

"ఇదే. అయితే వాటికి మేం ఆర్డరివ్వలేదు...." అందామె సందేహిస్తూ.

"మిస్ ఇందులేఖా, మీ నాన్నగారి గురించి మీతో మాట్లాడాలి; పత్రికలివ్వడానికి నేను రాలేదు!" మనోజ్ కంఠం బాగా తగ్గించి, అన్నాడు. త్వరగా ఇంట్లోకి వెళ్ళాలని అతని హృదయం ఆశిస్తోంది.

తన పేరుని ఉచ్చరించిన అపరిచిత యువకుణ్ని ఇందులేఖ ఆశ్చర్యంతో చూసింది. "మీరు.. మీరెవరు?" ఆమె కంఠం కొద్దిగా వణికింది.

"నా పేరు మనోజ్ ....ముందు లోపలికి వెళ్దాం.... అంతా వివరిస్తాను...." మనోజ్ చిరునవ్వు నవ్వుతూ అన్నాడు.

ఆమె విశాల నేత్రాల్లో యేదో సందేహం అద్దంలా ప్రతిబింబంలా అవుపిస్తోంది. మనోజ్ అసహనంగా కదిలాడు.

"ఎవరే అమ్మాయ్?" ఏదో కంఠం లోపల్నుంచీ వణుకుతూ ప్రశ్నించింది.

"ఎవరో నాన్నగారి గురించి వాకబు చేస్తూ వచ్చారు, నాయనమ్మా," ఇందులేఖ మొహం పక్కకి తిప్పి జవాబిచ్చింది. ఆమె జడ త్రాచుపాములా కదిలింది. మరె

పూలు మనోజ్ వైపు నవ్వాయి. ఆమె తలతిప్పి అతన్ని చూసింది. ఆమె చూపులు అతని చూపుల్ని దేనికోసమో వెతుకుతున్నాయి. తను చూపుల్తో గాలించే దుర్మార్గమేదీ అతని చూపుల్లో ఆమెకి కనిపించినట్టు లేదు....

తలుపుని బార్లా తెరిచిందామె. "రండి" అంటూ దూరంగా జరిగింది.

"థాంక్స్" అంటూ మనోజ్ గుమ్మం దాటాడు.

సన్నగా, పొడుగ్గా వున్న ఇందులేఖ నడక కళ్ళని లాగి, చూపుల్ని తనవెంట ఈడ్చుకుపోతుంది. ఊదా రంగు పోలియెస్టర్ చీర, అందమైన ఆయిల్ పెయింటింగ్‌ని చక్కటి ఫ్రేములా ఆమె అందాన్ని హెచ్చు చేస్తోంది. మనోజ్ ఆమెని వెంబడించాడు.

చిన్నగది, ఒకవైపు గోడని పుస్తకాలున్న రాక్స్ పూర్తిగా కప్పేశాయి. చిన్న టేబుల్‌కి రెండువైపులా రెండు కుర్చీలు. అది అన్నారావుగారు ఆఫీసుగా వుపయోగించిన గది అని రాక్స్‌లోని లా పుస్తకాలు చెప్తున్నాయి. కిటికీమీద, గోడకి తగిలించిన ఫోటోకి పూలదండ వేళ్ళాడుతోంది.

"కూర్చోండి" ఇందులేఖ కంఠం అతన్ని హెచ్చరించింది. మనోజ్ ఆమె యెదురుగా కూచుని, విచారంగా చూశాడు.

"అయామ్ సారీ. మీ నాన్నగారు....పోయారు...." అన్నాడతను.

ఇందులేఖ కళ్ళు బాధకి పట్టిన అద్దాల్లా వున్నాయి. "థాంక్స్....నాన్న కార్ని చాలా జాగర్తగా తోలేవాడు. అయినా యాక్సిడెంట్ అయింది..." ఆమె కంఠం వణికింది.

మనోజ్ ఆమెని జాలిగా చూశాడు. యాక్సిడెంట్! అది యాక్సిడెంట్ కాదనీ, హత్య అనీ తను ఆమెకి చెప్పగలడా?

"మిస్ ఇందులేఖా, అడ్వొకేట్ కరుణాకర్ నా అన్నయ్య. ఆయన విషయం....మీకు తెలుసనుకుంటాను" అంటూ ఆగాడతను.

ఆమె మనోజ్‌ను ఆశ్చర్యంగా చూసింది.

"నాన్న.... కేసు గురించి నాతో చూచాయగా అన్నాడు. తరవాత జరిగిందంతా పేపర్లలో చదివాను" ఇందులేఖ అంది.

మనోజ్ ఆమెని తదేకంగా చూశాడు. "మరణించే ముందు నాన్నగారు తను మా అన్నయ్య కేసుని వాదించబోతున్నట్టు చెప్పారా?"

ఆమె తలాడించింది. ఆమె చెవులకి వేళ్ళాడుతున్న రింగులు వూగిసలాడాయి. "జైల్లో ఆయన్ని కలుస్తున్నట్టు నాన్న చెప్పాడు. మీ అన్నగారు నిరపరాధి అని ఆయన నాతో అన్నాడు...."

"మిస్ ఇందులేఖా, మీ నాన్నగారు చెప్పింది నిజం. మా అన్నయ్య నిర్దోషి!" మనోజ్ వుద్రేకంతో అన్నాడు. "కానీ నిర్దోషికి శిక్ష విధించబడింది. ఆయన్ని సర్వనాశనం చేయడానికి బ్రహ్మాండమైన కుట్ర సాగించబడింది. ఆ కుట్రకి కారకులైనవాళ్ళ గురించిగానీ, కారణాల గురించిగానీ నాన్నగారు మీతో యేమేనా అన్నారా? ఎంత చిన్న విషయం అయినా ఫరవాలేదు."

ఇందులేఖ విచారంగా చూసింది. "కరుణాకర్ మీద యేదో కుట్ర సాగుతోందనీ, అసత్యాల ఇటుకలతో సమాధిచేసే ప్రయత్నం సాగుతోందనీ నాన్న అన్నాడు.

భార్య హత్యతో జీవచ్ఛవంలా అయిపోయిన ఆయన్ని ఆదుకోవాలనీ, కోర్టులో ఆయన తరఫున వాదించబోతున్నాననీ నాన్న అన్నాడు. అయితే, మృత్యువు ఆయన్ని ఆటకాయించింది...." ఆమె కంఠం విచారంతో గాద్గదికం అయ్యింది.

మనోజ్ ఆమెని నిదానించి చూశాడు. "మీ నాన్న గారు యాక్సిడెంట్‌లో మరణించలేదు. ఆయన హత్య చేయబడ్డారు!"

ఇందులేఖ ఉలిక్కిపడి, తటాలున లేచి నిలబడింది. ఆమె కళ్లు అయోమయంగా చూస్తున్నాయి. ఎర్రటి పెదవులు అదురుతున్నాయి.

"నాకు....అర్థంకావడంలేదు...." అందామె వణికే గొంతుతో.

"అయామ్ సారీ. బాధ కలిగించినాకూడా, మీకు నిజం చెప్పాలి. మా అన్నయ్యకు సహాయం చేయాలనుకున్న నిర్ణయం ఆయన్ని హతమార్చింది. అన్నయ్య శత్రువులు ఆయన్ని తుదముట్టించారు. హత్యని యాక్సిడెంట్‌లా కనిపించేలా చేశారు!"

ఇందులేఖ బలహీనంగా కుర్చీలో కూచుంది. "నేను నమ్మలేకుండా వున్నాను...."

"కేసు జరుగుతున్నప్పుడు మా అన్నయ్యకి సహాయం చేయాలనుకున్న ఆనందరావుగారి నోరు నొక్కేశారు వాళ్ళు. కేసు పూర్తయి అన్నయ్యకి శిక్ష పడ్డాక, నేను నిజంకోసం అన్వేషణ ప్రారంభించాక — కేసులో అన్నయ్యకి వ్యతిరేకంగా తప్పుడు సాక్ష్యాలు చెప్పిన వ్యక్తుల నోళ్ళు నొక్కేస్తున్నారు...."

"వాట్ ?" ఇందులేఖ అరిచింది. మనోజ్ చిన్నగా

నవ్వాడు. లాయర్ రంగనాథ్‌ని బెదిరించిన విషయం గురించీ, వున్నట్టుండి ఒక్క పద్ధతిలో మరణించిన ముగ్గురు పాత్రుల గురించీ ఆమెకి వివరించాడు.

"ఇవన్నీ స్వాభావిక మరణాలు కావు. అలాగే మీ నాన్నగారిదికూడా...." అన్నాడతను.

ఇందులేఖ కళ్ళు వున్నట్టుండి నీళ్ళతో నిండాయి. బుగ్గలమీదికి జారుతున్న అశ్రువుల్ని అరచేత్తో తుడుచుకుందామె.

"మిమ్మల్ని నొప్పించడానికి ఈ సంగతి చెప్పలేదు. మీరు జాగ్రత్తగా వుండాలన్న వుద్దేశంతో నిజం మీకు తెలియజేశాను. మీనుంచీ యేవేనా విషయాలు తెలుస్తాయేమో అని వచ్చాను. ఈసారి చాలా జాగ్రత్తగా మిమ్మల్ని కలుస్తున్నాను. మిస్ ఇందులేఖా, అపరిచితుల్ని ఇంట్లోకి రానివ్వకండి...."

"నేను అలా యెవర్నీ రానివ్వను...." అందామె అడ్డొస్తూ.

"నన్ను రానిచ్చారు!" మనోజ్ నవ్వుతూ అన్నాడు.

ఇందులేఖ రెప్పల్ని దించుకుంటూ చిరునవ్వు నవ్వే ప్రయత్నం చేసింది.

"మీరు వుద్యోగం చేస్తున్నారా?" మనోజ్ ప్రశ్నించాడు.

"లేదు...." ఆమె తల అడ్డంగా వూగింది. అతని కళ్ళల్లోని ప్రశ్నను ఆమె అర్థం చేసుకుంది "ఇన్సూరెన్స్ కంపెనీ కారుకి యాభై వేలు వచ్చింది. నాన్న పాలసీ మీద మరో పాతిక వేలొచ్చాయి. కారు పైకంతో, అద్దెకి వున్న ఈ ఇంటిని బాబాయి నా సొంతం చేశాడు" అందామె చిన్నగా నవ్వుతూ.

మనోజ్ ఆమెని తదేకంగా చూశాడు. "మిస్ ఇందులేఖా, మా అన్నయ్యకోసం, న్యాయంకోసం మీ నాన్నగారు బలైపోయారు. ఆయన ఋణం నేను తీర్చుకుంటాను. అపార్థం చేసుకోకండి. నేను కొంత.... కొంత....డబ్బిస్తాను...."

"నో థాంక్స్!" ఇందులేఖ అడ్డు తగిలింది. ఆమె కళ్ళు తీక్షణంగా చూస్తున్నాయి. "న్యాయంకోసం పాటుపడిన నాన్నను, అమాయకుడైన నాన్నను హత్య చేసిన దుర్మార్గుల్ని వెతికిపట్టండి. వాళ్ళకి శిక్షపడేలా చూడండి! మీరు ఋణం తీర్చుకోవాల్సిన మార్గం అదే!" అందామె ఉద్రేకంతో.

తడిగా, ఎర్రగా మెరుస్తున్న ఆమె కళ్ళని మనోజ్ ఆవేశంతో చూశాడు. లేచి నిలబడ్డాడు. "ఇంతవరకూ ప్రతి వ్యక్తీ నన్ను వెనక్కి తిరిగి పారిపొమ్మన్నాడు. మీ రొక్కరే ముందుకి వెళ్ళమంటున్నారు! థాంక్యూ వెరీమచ్!" అన్నాడు ఆనందంగా.

"నాన్న ప్రమాదవశాత్తూ మరణించాడనుకున్న నాకు, ఆయన హత్యచేయబడ్డాడన్నది భరించలేనిదిగా వుంది" ఇందులేఖ గాద్గదికంగా అంది. మళ్ళీ ఆమె కళ్ళు నీళ్ళతో నిండాయి. తలతిప్పి తండ్రి ఫోటోవేపు చూడసాగిందామె.

మనోజ్ ఆమెని సానుభూతితో చూశాడు. "మిస్ ఇందులేఖా, నేను వెళ్ళొస్తాను...."

ఆమె తటాలున తలతిప్పింది. "మళ్ళీ ఎప్పుడొస్తారు?"

"రాను. కలుసుకోవాలనుకున్న వాళ్ళందర్నీ ఆ దుర్మార్గులు కుదమట్టిస్తున్నారు. బైటికి లాగబడే

నిజాన్ని పాతాళంలోకి తొక్కేస్తున్నారు కొంతకాలం పాటు మాయమైపోయి, ఇవ్వాళే వచ్చాను. ఇప్పుడు నన్ను వాళ్ళు గుర్తించలేకపోవచ్చు. అయినా నిర్లక్ష్యంగా వుంటానికి వీల్లేదు. నా మూలంగా మీకు అపాయం జరక్కూడదు...."

"మిమ్మల్ని వెంటాడే వాళ్ళని మీరు వెంటాడాలి!" ఇందులేఖ నవ్వుతూ అంది. తెల్లటి పళ్ళు పెదవులమధ్య వెలుగ్ని చిమ్ముతూ మెరిశాయి.

మనోజ్ ఆమెని మెప్పుగా చూశాడు. "మీకు ధైర్యం ఎక్కువ!" అన్నాడు నవ్వుతూ.

"భయపడేవాళ్ళు హాయిగా బతకలేరు!" అందామె. "కూర్చోండి. కాఫీ తెస్తాను.." అంటూ కదలబోయింది.

"ప్లీస్ .... వొద్దు. వెళ్ళాలి. అనుకున్నది జరిగాక మిమ్మల్ని కల్సుకుంటాను...." మనోజ్ వెనుదిరిగి గుమ్మం వైపు నడిచాడు.

"మిస్టర్ మనోజ్!"

అతను వెనుదిరిగి ప్రశ్నార్థకంగా చూశాడు. ఆమె కళ్ళు తీక్షణంగా చూస్తున్నాయి. "ఈ ప్రయత్నంలో మీరు ఒంటరిగా వున్నారనుకోకండి!"

మనోజ్ ఆశ్చర్యంగా చూస్తూ ఆమె ముందుకి నడిచాడు. జ్యోతుల్లా వెలుగుతున్న ఆమె కళ్ళల్లో యేదో నిర్ణయం ప్రతిఫలిస్తోంది. తనిలోకి ధైర్యాన్ని సరఫరా చేస్తున్న ఆ విశాల నేత్రాలలోకి వుద్రేకంతో చూశాడు.

"మీ మాట నాకు కొండంత ధైర్యాన్నిస్తోంది. మీ ధైర్యాన్నీ, నిజాయితీనీ మెచ్చుకుంటున్నా" అన్నాడతడు.

ఇందులేఖ చూపులు దించుకోలేదు. "మిస్టర్ మనోజ్

ఆ దుర్మార్గులెవరో మనిద్దర్నీ ఒకేరకమైన దుఃఖానికి గురి చేశారు. అన్యాయం న్యాయాన్ని తొక్కేయడం మంచిది కాదు. ప్రయత్నించండి! జయించండి!" అంటూ ఆమె కుడిచేతిని ముందుకు చాచింది. మనోజ్ అప్రయత్నంగా ఆమె చేతిని పట్టుకున్నాడు.

"డబుల్ ఫోర్ డబుల్ త్రీ డబుల్ టూ! ఇది మా ఫోన్ నంబరు. అంత సులువుగా మరిచిపోలేరు. ఫోన్‌లో మీ ప్రోగ్రెస్ తెలియజేస్తూ వుండండి" అంటూ ఆమె చేతిని విడిపించుకుంది.

చిరునవ్వుతో ఆమెని చూసి మనోజ్ కదిలాడు. ఇందులేఖ అతని వెనకే హాల్లోకి వచ్చింది.

"మీ పత్రికలు..." అందామె.

"మీకే. డెలివరీ ఇచ్చాను!" మనోజ్ నవ్వుతూ అన్నాడు.

* * *

మౌనంగా వింటూ కూచున్న రామానుజం తటాలున సోఫాలోంచి లేచాడు. నిప్పులు చెరుగుతున్న కళ్ళతో అసహ్యంగా చూశాడు.

"గెటౌట్!" అరిచాడతను. అతని శరీరం కళంతప్పి వణుకుతోంది. ఎదురుగా కుర్చీలో కూచున్న మనోజ్ అతన్ని ఆశ్చర్యంగా చూశాడు.

"రామానుజంగారూ...."

"ఇంకా, పోలీసుల్ని పిలిపించి బైటికి గెంటించి, లోపల తోయించమంటావా?" రామానుజం వృద్ధ సింహంలా హుంకరించాడు.

నిట్టూరుస్తూ మనోజ్ లేచాడు. "శాంతంగా ఆలోచించండి. మీకు అంత ఆగ్రహం రావడానికి నేనేం

తప్పు చేశాను?"

"నా కూతుర్ని నాశనం చేసిన రాక్షసుడి తమ్ముడిగా పుట్టడమే నువ్వు చేసిన తప్పు!" రామానుజం ఆవేశంతో ఊగుతూ అరిచాడు.

"ఐ హేట్ దట్ డెమన్! ఐ హేట్ యూ! గెటౌట్!" ఎడం చేతిని గుమ్మంవైపు చూపిస్తూ గర్జించాడతను.

మనోజ్ అతన్ని నిదానించి చూశాడు. "రామానుజంగారూ, మీ అమ్మాయి గీత దుర్మరణం మిమ్మల్ని నరకయాతన పెడుతోందని నాకు తెలుసు. మొగ్గలాంటి గీతను కాలరాచిన వాళ్ళు వేరు. మా అన్నయ్య నిర్దోషి!"

"హు ...నిర్దోషి! అందుకే జైల్లో మగ్గుతున్నాడు! ఆల్ రైట్ ...."

"రామానుజంగారూ, మీరు పెద్దలు. మీరు ద్వేషించాల్సింది మా అన్నయ్యనూ, నన్నూ కాదు. మీ అమ్మాయి హంతకుల్ని!" మనోజ్ అడ్డొస్తూ అన్నాడు.

రామానుజం రౌద్రంగా చూశాడు. అతని మొహం మీద చెమట బిందువులు మెరుస్తున్నాయి. "మీ ఇద్దర్నే కాదు; మీ వంశాన్నే నేను ద్వేషిస్తున్నాను; ద్వేషిస్తాను! గెటౌట్!"

"వెళ్తాను. కేసు జరిగేప్పుడు సాక్ష్యం కోసం పోలీసులు కాకుండా మిమ్మల్ని కల్సుకున్న ఇతర వ్యక్తులెవరేనా వుంటే—వాళ్ళెవరో చెప్పేంతసేపు మీ కోపాన్ని దిగమింగగలరా?" మనోజ్ ప్రశ్నించాడు.

"ఐ సే గెటౌట్!" బిగించిన పిడికిళ్ళని గదల్లా ఆడిస్తూ రామానుజం అరిచాడు.

"ఓకే. వెళ్తాను. మీ కూతుర్ని పొట్టన పెట్టుకున్నది

మా అన్నయ్య కాదని నిరూపించి మీ కళ్ళు తెరి పిస్తాను!" మనోజ్ ఉద్రేకంతో అన్నాడు.

"గెట్ లాస్ట్, యూ బ్రదరాఫ్ మర్డరర్!" రామానుజం గర్జించాడు. అతని ముఖంలోకి తీక్షణంగా చూసి, మనోజ్ వెనుదిరిగి గుమ్మం దాటాడు. తన వెనుక, చెవులు పగిలేలా శబ్దం చేస్తూ మూసుకున్న తలుపువేపు క్షణకాలం చిరునవ్వుతో చూశాడు. సిగరెట్ వెలిగించి రోడ్డుమీదికి అడుగులేశాడు.

*  *  *

బాగా అలవాటుపడిపోయిన మనోజ్ అప్రయత్నంగా ఊగుతూ నడుస్తున్నాడు.

రకరకాల వాహనాలు అతని పక్కనే అటూ ఇటూ వేగంగా దూసుకుపోతున్నాయి. రోడ్డు రెండుగా చీలింది. యెడమవైపు తిరిగి నడుస్తూ సిగరెట్ పీకని గిరాటేశా డతను.

గీత తండ్రితో ఇంటర్వ్యూ చెడిపోయింది. అతని ద్వారా తను యేమీ తెలుసుకోలేదని తేలిపోయింది!

రామానుజం యింటి అవతలున్న మలుపులోంచీ మెల్లగా తనవేపే వస్తున్న నల్లటి కారు. ఆలోచనల్లో మునిగిన మనోజ్ గుర్తించే స్థితిలో లేడు. మెల్లగా జారుతూ తనని దాటి వెళ్ళిపోయిన నల్లటికారు మనోజ్ కళ్ళు చిట్లిస్తూ చూశాడు. వేగం పుంజుకున్న కారు ఎడమ వైపుకి తిరిగి ఇళ్ళమధ్య మాయమైంది.

మనోజ్ అప్రయత్నంగా నిలబడ్డాడు. నల్లకారు.... తనని వెంటాడుతోందా? అతని వొళ్ళు ఒకసారి జలదరిం చింది. వృద్ధుడు రామానుజం గుర్తుకు వచ్చాడు. ఏదో అనుమానం అతని హృదయాన్ని ముల్లులా గుచ్చడం

ప్రారంభించింది. ఇరవై గజాలు నడిచి హోటల్ సిద్ధార్థ లోపలికి వచ్చాడు.

కౌంటర్ ముందు తాంబూలం రుబ్బుతూ కూర్చున్న ప్రొప్రైటర్ ముందు రూపాయి నాణెం పడేశాడు. ఫోన్ వైపు చెయ్యి చూపించాడు. సొరుగులోంచి తాళంచెవి తీసి, ఫోన్ కి తగిలించిన తాళాన్ని తెరిచి మనోజ్ వైపు తల ఎగరేశాడతను.

రిసీవర్ని చెవికి ఆనించి, మనోజ్ నెంబర్ డయల్ చేశాడు. అటువైపున ఫోను రింగవుతోంది. నిమిషాలు గడుస్తున్నాయి. మనోజ్ లో ఏదో భయం మెల్ల మెల్లగా ప్రవేశిస్తోంది. అతను ఫోన్ని అందుకునే స్థితిలో లేడా?

తటాలున రిసీవర్ ఎత్తబడిన శబ్దం వినిపించిందతనికి. "హలో!...." అంది రామానుజం కంఠం మనోజ్ చెవిలో.

"సుబ్బరామయ్యగారున్నారా?" మనోజ్ ప్రశ్నించాడు.

"రాంగ్ నెంబర్!" రామానుజం కంఠం కసిరినట్టుగా అంది.

తేలిగ్గా నిట్టూరుస్తూ, "సారీ!" అంటూ మనోజ్ రిసీవర్ని పెట్టేశాడు.

ఆలోచిస్తూ, మరో నెంబరు తిప్పాడు. అటువైపున వెంటనే రిసీవర్ ఎత్తబడింది.

"డబుల్ ఫోర్, డబుల్ త్రీ, డబుల్ టూ ..." అందో స్త్రీ కంఠం. ఇందులేఖ! తృప్తిగా నవ్వుకుంటూ ఆమెతో మాట్లాడాలన్న కోరికని చంపుకున్నాడు మనోజ్.

"సారీ, రాంగ్ నెంబర్!" అంటూ రిసీవర్ పెట్టేశాడు. బల్లమీద పడేసిన యాభై పైసల చిల్లరమీద అరచేతిని బోర్లించాడు హోటల్ ప్రొప్రయిటర్.

మనోజ్ తేలికపడిన హృదయంతో రోడ్డుమీదికి నడిచాడు. కుడివైపుకి తిరగబోతూ తటాలున ఆగాడు. ఇరవై అడుగుల దూరంలో, రోడ్డు వారగా ఆగివుంది నల్లకారు ...

ఏదో సందేహం అతన్ని మళ్ళీ పీడించడం ప్రారంభించింది.

కిటికీలోంచి తనవైపే చూస్తున్నాడు స్టీరింగ్ వెనుకున్న వ్యక్తి. అతని మొహంమీద మెరిసిన నవ్వుని మనోజ్ గుర్తించాడు. ఆ మొహాన్ని ఎక్కడో చూశాడు తను ఎక్కడ?

మనోజ్ కి బెలూనులు అమ్ముతూ తిరిగిన వ్యక్తి మొహం తటాలున గుర్తుకువచ్చింది. బెలూనులు పట్టుకుని బికారిలా అవుపించిన ఆ వ్యక్తిని కార్లో చూసి, తను వెంటనే పోల్చుకోలేకపోయాడు.

తన వేషంలో,నడకలో తను తెచ్చిపెట్టుకున్న మార్పు తనకి సహాయం చేయడంలేదు! వాళ్ళు తనని పోల్చేశారు! కారు ముందుకు వెళ్ళిపోయింది.

ఈ దాగుడుమూతలు యిక చాలు! మనోజ్ పేవ్మెంట్ పక్కనే వున్న చెట్టుబోదెకి ఆనుకున్నాడు కాసేపు. రివాల్వర్ ని జేబులో పడేసుకోనందుకు విచారిస్తూ సిగరెట్ వెలిగించాడు.

అయిదు నిమిషాలు గడిచాయి.

సిగరెట్ పీకని కింద పడేసి మనోజ్ నడవసాగేడు. నిమిషాలు గడుస్తున్నాయి. రోడ్డుకి అడ్డంగా ప్రవహి

స్తోన్న సన్నటి నదిమీద బ్రిడ్జి ప్రారంభమయింది. బ్రిడ్జి మీద వాహనాలు దూసుకుపోతున్నాయి. మనోజ్ తటాలున ఆగాడు.

నల్లకారు అతని పక్కనే మెల్లిగా కదలసాగింది. మనోజ్ డ్రయివర్ వైపు ఓరగా చూశాడు. యేమీ యెరగనివాడిలా, నవ్వుకుంటూ రోడ్డుని చూస్తున్నా డతను. అతన్ని దాటి కొంచెం ముందుకెళ్ళిన కారు ఆగు తోంది.

మనోజ్ జేబులోంచి సిగరెట్ తీసి నోట్లో యిరి కించాడు. అటూ యిటూ చూశాడు. బ్రిడ్జి ఖాళీగా వుంది.

మనోజ్ డ్రయివర్ డోర్ వైపు గెంతాడు. కిటికీ లోంచి లోపలికి తొంగిచూశాడు. అతని చెయ్యి కోట్లోకి వెళ్ళింది. స్టీరింగ్ వెనుక కూచున్న వ్యక్తి పళ్ళికిలిస్తూ నిర్లక్ష్యంగా నవ్వుతున్నాడు.

"అగ్గి పెట్టె వుందా?" మనోజ్ మామూలుగా అడి గాడు.

ఊహించని ఆ పరిణామం కారు డ్రయివర్ని క్షణకాలం కంగారు పెట్టింది. అతని చెయ్యి స్టీరింగ్ మీంచి జేబులోకి అప్రయత్నంగా దూరింది.

మనోజ్ చెయ్యి మెరుపులా కదిలింది. ఇగ్నిషన్ కీని తిప్పి, లాగి, చేతిని ఇవతలికి తీసేసుకున్నాడతను. ఇంజన్ ఆఫ్ అయిపోయింది.

స్టీరింగ్ ముందు కూచున్నతని కళ్ళల్లో ఆశ్చర్యం గడ్డకట్టినట్టు ప్రత్యక్షమైంది. అగ్గిపెట్టెలో యివతలికి వచ్చిన చెయ్యి కదలకుండా అలాగే వుండిపోయింది.

మనోజ్ నిటారుగా నించున్నాడు. ఖాళీ లారీ బ్రిడ్జి

మీదుగా వస్తోంది. తనని దాటి దూసుకెళ్తున్న లారీ బాడీలోకి ఇగ్నిషన్ కీని విసిరేశాడతను. అదే క్షణంలో అతని చెయ్యి కారు డోర్ని విసురుగా లాగింది.

అగ్గిపెట్టె పట్టుకున్న కారు డ్రయివర్ చేతిని మనోజ్ చెయ్యి మంకీ స్పానర్ లా పట్టుకుంది. మెలితిప్పుతూ అతన్ని బలంగా లాగాడు మనోజ్. అసంకల్పితంగా వొరుగుతున్న డ్రయివర్ విసురుగా రోడ్డుమీదికి పడ్డాడు. ఆశ్చర్యంనుంచి అతను తేరుకునేలోగా మనోజ్ మెలి తిప్పిన చేతిని పైకి లాగాడు. బాధతో పళ్ళు ఇకిలిస్తూ పైకి లేచాడతను.

మనోజ్ కుడిచెయ్యి అతని ఎడమచేతి మణికట్టుని బిగించి పట్టుకుంది. మనోజ్ కాలు కారు డోర్ని మెల్లిగా లోపలికి తోసింది. మూసుకుంటున్న డోర్కీ, ఫ్రేముకీ మధ్య అతని ఎడమచేతి వేళ్ళను ఇరికించాడు మనోజ్. అతని మోకాలు డోర్ని నొక్కిపట్టింది. బాధతో అతను కెవ్వుమన్నాడు.

మనోజ్ అతన్ని నవ్వుతూ చూశాడు. "అయితే బెలూనులు అమ్మి, కారు సంపాదించావన్న మాట!" అన్నాడతను ఎగతాళిగా.

క్షణకాలం అతని కళ్ళల్లోని బాధను తరిమేస్తూ ఆశ్చర్యం ప్రత్యక్షమైంది. వొగురుస్తూ చూస్తూండిపోయాడతను. మనోజ్ ఎడమచెయ్యి కొద్దిగా కదిలింది. అతని మోకాలు డోర్ని ఒక్కరవ లోపలికి నొక్కింది. మెలి తిరిగిపోతున్న కుడిచెయ్యీ, డోర్ మధ్య నలిగిపోతున్న ఎడమచెయ్యీ అతన్ని కీచుగా అరిపించాయి.

"షటప్! అరిస్తే అయిదు వేళ్ళూ చింతకాయల్లా రాలి పోతాయి! కంఠం తగ్గించి మర్యాదగా అడిగిందానికి

సమాధానం చెప్పు! బెలూనులు ఎగరేస్తూ, కారు తోల్తూ జలగలా నన్నెందుకు పట్టుకున్నావ్? నిన్ను నా తోకగా నియమించిం దెవరు?" మనోజ్ కంఠం త్రాచుపాము బుసలా ధ్వనించింది.

జవాబుగా అతని కళ్ళు అటూ యిటూ కదిలాయి. అతిప్రయత్నంమీద బాధను ఓర్చుకుంటున్నా డతడు. మనోజ్ ఎడమచెయ్యి కొంచెం జరిగింది. పురి యెక్కుతున్న తాడులా వున్న అతని చెయ్యి కొద్దిగా సాగింది. పళ్ళతో కింది పెదవిని కొరుక్కున్నా డతను.

మనోజ్ కుడిచెయి అతని నడుముని తడిమింది. అతని పాంటు జేబులోకి దూరింది. పర్సునీ, సిగరెట్ పాకెట్నీ, లైటర్నీ తీసి చూసి, జేబులో పడేసుకున్నాడు మనోజ్. యీసారి మనోజ్ చెయ్యి అతని పాంటు జేబులోకి వెళ్ళింది. మనోజ్ చిరునవ్వు నవ్వుతూ చేతిని యివతలికి లాగాడు. అతని కళ్ళల్లోని కొత్త కంగారుని నవ్వుతూ చూశాడు.

నల్లగా మెరుస్తోన్న పిస్టల్ని జేబులోకి దోపుకున్నాడు. తనకోసం సర్వసన్నద్ధంగా వచ్చాడతను! మనోజ్ చింత నిప్పుల్లా వున్న కళ్ళని అతనివైపు తిప్పాడు.

"ఆల్ రైట్. నిన్ను మాట్లాడించడానికి ఇది తగిన ప్రదేశం కాదు. ఒక చక్కటి ప్రదేశానికి తీసుకెళ్తాను. అక్కడికి వెళ్ళగానే నీకు గొంతెత్తి పాటకచ్చేరీ సాగించా లనిపిస్తుంది....!" మనోజ్ వెటకారంగా అన్నాడు.

అతని కుడిచెయ్యి కారు డోర్ని పట్టుకుంది. డోర్ని ఆనుకునివున్న మోకాలు తటాలున పైకి లేచింది. మూలుగుతూ అతను కిందికి వంగేశాడు. డోర్లో ఇరుక్కున్న

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్క-మాటలో గాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డుపై వ్రాసి, ఈ నెల ౧౮ వ తేదీలోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు ఏడాది పాటు పత్రిక లేదా సప్లమెంట్ బహుమతిగా పంపుతాము.

## "హోమ్ డెలివరీ"

'హోమ్ డెలివరీ' సభ్యులకు 'అపరాధ పరిశోధన' పత్రిక మరియు సప్లిమెంట్ కాపీలు వాటి అసలు ధరకే అందజేయబడతాయి. అంతేకాదు - వారికి పత్రికలను ప్రతి నెలా 'రిజిష్టరు పోస్టు'లో పంపుతాము.

ప్రతి 6 నెలలకు ఒకసారి అంటే - జనవరి మరియు జులై నెలల పత్రికలు మాత్రం V. P. ద్వారా పంపబడతాయి— దానికి మీరు అర్ధ సంవత్సర చందా రు. 84/-లు చెల్లించవలసి వుంటుంది. పోస్టు ఖర్చులన్నీ మేమే భరిస్తాము. పత్రికల ఖరీదుకు మించి మీరు పైసా చెల్లించ నవసరంలేదు.

'హోమ్ డెలివరీ' వల్ల పత్రికలు మీకు మరింత త్వరితంగా, గ్యారంటీగా అందుతాయి. పోస్టులో పోయే సమస్య ఎంత మాత్రం లేదు. ఇంకా నెలనెలా V. P. ద్వారా తెప్పించుకునే సౌకర్యంకూడా వుంది.

మరి - మీరు చేయవలసిందల్లా వెంటనే రు. 10/-లు పంపి శాశ్వతంగా 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరటమే.

పూర్తి వివరాలకై 'అపన' చూడండి.

చెయ్యి అతన్ని కూలిపోకుండా ఆపింది. బాధ నిండిన కళ్ళతో కసిగా చూశా డతను.

మనోజ్ కారు డోర్ని వదిలేశాడు. అతని కుడిచెయ్యి పాంటుజేబులోకి వెళ్ళి పిస్టల్‌తో ఇవతలకి వచ్చింది. డోర్లోంచి బైటపడిన ఎడమచేతి వేళ్ళను గాభరగా చూసుకుంటున్నా డతను. అతని శరీరం పైకీ కిందికీ ఊగు తోంది. చాలాదూరం పరుగెట్టి అలసిపోయిన వాడిలా వొగురుస్తున్నా డతను. అతని కాళ్ళమధ్య తూకం వేసి నట్టు తగిలిన తన మోకాలి దెబ్బ యిప్పట్లో అతన్ని చక్కగా నడవనివ్వదని మనోజ్‌కి తెలుసు.

మనోజ్ అతని పక్కన నిలబడ్డాడు. మెలితిరిగిన అతని కుడిచేతిని వీపు వెనక్కి నొక్కాడు. అతను అరవ లేదు బాధని వోర్చుకోడంలో అతను బాగా తర్ఫీదయిన ట్టున్నాడు!

"డియర్ ఫ్రెండ్, కదులు. అలా పికారు కెళ్దాం!" అంటూ అతన్ని ముందుకి తోశాడు. వణుకుతున్న కాళ్ళు అతన్ని ముందుకి కదలనివ్వడంలేదు.

"పద! త్వరగా!" అటూ యిటూ వెళ్తున్న వాహనా లోని వ్యక్తులు తమవైపు ఆదోరకంగా చూడ్డం గమనించి మనోజ్ అన్నాడు, అతన్ని తోస్తూ.

"అంత తొందరేం లేదు, మిస్టర్ మనోజ్!"

వెనకనుంచి వినిపించిన మాటకి ఆశ్చర్యపోతూ మనోజ్ తల తిప్పబోయాడు.

• • •

"కదలొద్దు మిస్టర్ మనోజ్!" ఏదో కంఠం అతన్ని హెచ్చరించింది. అతని చెవికింద ఏదో చల్లగా గుచ్చు కుంది. మనోజ్ ఉలిక్కిపడ్డాడు, అతని కుడిచెయ్యి

మెల్లిగా, చాలా మెల్లిగా పాంటుజేబువైపు జరుగుతోంది.

"మిస్టర్ మనోజ్, సైలెన్సర్ వున్న పిస్టల్ నీ చెవి కింద ముద్దు పెట్టుకుంటోంది. కుడిచేతిని పైకెత్తు! నీ జేబులోని పిస్టల్ని తీసే అవకాశం నీకు లేదు!" ఆ కంఠం చెవి దగ్గరగా పలికింది మనోజ్ కుడిచెయ్యి పైకి లేచింది.

"వెరీగుడ్! మెలితిప్పిన అతని చేతిని వదిలేసి, నీ యెడమచేతిని కూడా పైకెత్తు మిస్టర్ మనోజ్."

పిస్టల్ని జేబులో పడేసుకున్నందుకు తనని తిట్టుకుంటూ వెనుతిరిగి చూసుకోనందుకు పళ్ళు కొరుక్కుంటూ మనోజ్ ఎడమచేతిని పైకెత్తేశాడు.

ఇందాకా అతని చేతుల్లో బందీ అయిన వ్యక్తి మెల్లిగా అతనివైపు తిరిగాడు. నొప్పిని భరించే ప్రయత్నంలో బిగబట్టిన పళ్ళు చేసిన గాయాల్తో అతని పెదవి ఎర్రగా అయింది. బరువుగా వూపిరి పీలుస్తూ అతను మనోజ్ జేబులోంచి సిగరెట్ పాకెట్ని, లైటర్ని, పిస్టల్నీ తీసి, ఎగతాళిగా నవ్వుతూ చూశాడు. పిస్టల్ పిడిని పట్టుకున్న అతని చెయ్యి పైకి లేచింది. మనోజ్ కంగారుగా చూశాడు.

"మూర్ఖుడా! జేబులో పెట్టు!" వెనకనుంచి కంఠం గద్దించింది.

పళ్ళు కొరుక్కుంటూ అతను పిస్టల్ని జేబులో పడేసుకున్నాడు.

"త్రీథర్టీవన్, బేడీలు తగిలించు!" కంఠం ఆజ్ఞాపించింది.

మనోజ్ ఉలిక్కిపడ్డాడు. త్రీథర్టీవన్! గుడ్ గాడ్.... పోలీసులా? అయోమయంగా ఆలోచిస్తోన్న మనోజ్ చేతులు కిందికి, వెనక్కి లాగబడ్డాయి. చేతులకి చల్లగా

తగిలిన బేడీలు క్లిక్కుమన్నాయి.

"కారు స్టార్టు చెయ్!"

"ఇగ్నిషన్ కీ లేదు సార్, వీడు లారీలోకి విసిరేశాడు" మొట్టమొదటిసారిగా డ్రయివర్ మాట్లాడ్డం వినిపించింది మనోజ్ కి.

"కారు తాళాన్ని లారీలోకి విసురుతూంటే నువ్వేం చేస్తున్నావ్!" ఆ కంఠం వెనుక నుంచీ గద్దించింది. "కమాన్. కార్లోకి యెక్కు. వైర్లు కనెక్టు చెయ్. స్టార్టు కార్!"

నాలుగైదు కార్లూ, ఆటోలూ ఆగిపెట్టున్నాయి. జరుగుతోన్న నాటకం మనుష్యుల్ని ఆకర్షించింది. మనోజ్ వోరగా చూశాడు.

"ఇన్‌స్పెక్టర్ గారూ, ఏం జరిగింది? ఎవరితను?" అక్కడ చేరిన వాళ్ళ ప్రతినిధిగా ఎవరో వ్యక్తి ప్రశ్నించాడు.

"రేపు న్యూస్ పేపర్ చూడండి. తెలుస్తుంది!" తన చెవికి పిస్టల్ ఆనించివున్న వ్యక్తి విసురుగా అనడం మనోజ్ కి వినిపించింది.

కారు స్టార్టయింది. వెనుక డోర్ తెరవబడింది. వెనుక నుంచీ అతను మనోజ్ ని కార్లో తోశాడు. పిస్టల్ కొన చెవికింద నుంచి దూరంగా జరిగింది. మనోజ్ సీటుమీద పడ్డాడు. తనని తోస్తూ, సీటుమీదకి జరిగి అతడు డోర్ మూశాడు కారు ముందుకి దూసుకెళ్ళింది.

మనోజ్ తలతిప్పి తన పక్కన కూచున్న వ్యక్తిని చూశాడు. అతని చేతిలో పిస్టల్ లూజాగా వేళ్ళాడుతోంది. ఖాకీ యూనిఫామ్‌లో సన్నగా పొడుగ్గా వున్నాడతను.

—(ఇంకా వుంది)

